# బద్దన్న సేనాని



## ౧

అది మహాశివరాత్రి. అంధకారములు గుత్తులు గుత్తులై దిశావలయముల హత్తుకొన్నవి.

కొండకొమ్మున నల్లని తేనెటీగలపట్టు పట్టును. కొండ ప్రక్కయంతయు వ్రేలాడి బొంయిమని ముసరుకొనుచున్న తేనెటీగలచేత నల్లఁగా నుండును. తత్సామప్రదేశమంతయు కిరాతులు గడకఱ్ఱలతోఁ బాడిచి మంటలతో వెలిఁగింతురు. తత్పర్వతపార్శ్వము గగ్గోలగును. ఆరీతిగా తద్దేశమంతయు వేయి కాగడాల వెలుతురుచే నొత్తిగిల్లుచున్న చీకట్లచేఁ గలగుండు పడుచున్న జనసమూహముచే గింగురు మనుచుండెను. వేయి తప్పెటల మ్రోతలు, పదివేలమంది జనముయొక్క మహా కలకలము, వేయికాగడాల వెలుతురు, కాగడాలు కొడికట్టినప్పుడెల్ల ముసరుకొనుచున్న చీకట్లు, బోయీలు కొడిదులిపి సిద్దెలతో మఱల నూనెపోయఁగా నాముదము తడి, వెట్ట యొక్క వఱకు నాఁగి మఱల నందుకొన్న వెలుతురులు, నానావాద్యముల ధ్వని, 'జయజయ మహాదేవ, శంభోశంకర, జయజయ వీరరుద్రభైరవ' యను వేయికంఠములనుండి వెలువడు మహానినాదములు దిక్కులఁ బిక్కటిల్లుచుండెను. ముందు తప్పెటలవాండ్రు, వాద్యగాండ్రు, పళ్ళెమోతలు, పళ్ళ ప్రక్కన

నిలుచుండి వీరాంగములు వేయుచు జడలు విరియఁబోసికొని కన్ను లురుముచు, హాహాకారములు చేయుచు నొడల నెల్ల రుద్రాక్షమాలలతో విభూతిరేఖలతోఁ దింత్రిణికులములు కలసి పోసినట్లు ప్రకాశించఁగా, స్థూలకాయులు గంతులు వేయు నప్పుడు కండరముల కదలికలచేత వికారముగాఁ గన్పించఁగా వారి కాయములకంటె స్థూలములైన యుదరము లెగిరిపడునప్పుడెల్ల కుదిలింపఁబడి యూఁగుచున్న తిత్తులవలె గనిపించఁగ వీరమాహేశ్వరులు వీరంగములాడు వేళల ప్రమథగణములు తాండవించుచున్నట్లు కనిపించుచుండిరి. ఆ వెనుక నొక నల్లని మహాశ్వముపై నొక రాక్షసునివంటి మనిసి కూర్చుండి యుండెను. ఆగుఱ్ఱ మేనుఁగంత గుఱ్ఱము. ఆ వీరపురుషుఁడు రాక్షసునియంత మనుష్యుఁడు. ఆతని జుట్టు నడుమున పాపట తీయఁబడి వెనుకకు దువ్వఁబడి యేనుఁగుతలకాయయంత వైశాల్యముగల పెదతలమీఁదఁ గొప్పముడిగా సంధింపఁబడి యుండెను. విభూతిరేఖలు వాని విశాలముఖమునిండఁ, గన్నులనిండఁ, జెవుల వెనుక భయంకరముగాఁ బులుమఁబడి యుండెను. కన్నులు చింతనిప్పులవలె మండుచుండెను. తాళవృక్షప్రమాణముగ నున్న యతని శరీరము మినుము పోతపోసినట్లుండెను. ఉదరము, వక్షస్థలము, దండలు, చేతులు, మణికట్లు సర్వత్ర విభూతిరేఖలే పులుమబడి యుండెను. వానిఱొమ్ముమీద పచ్చని పతకము నొక్కటి వ్రేలాడుచుండెను. కంఠమునందు బంగారు రుద్రాక్షలు, నిజమైన రుద్రాక్షలు, ఒకటివదలి యొకటిగాఁ గ్రుచ్చఁబడినవి తాటికాయలంతవి ప్రకాశించుచుండెను. దండలయందు బంగారపు బాహుబంధులు కట్టఁబడియుండెను. మణికట్లయందు రుద్రాక్షలు, బం

గాను కడియములు ప్రకాశించుచుండెను. అతని యెడమచేతిలో డాలు, కుడిచేతిలో దీర్ఘమైన ఖడ్గము గలదు. అతడు వంగపండు రంగు గల జరీ పీతాంబరము ధరించి యుండెను. రికాబులో వేసిన కాళ్లు నిక్కించి గుఱ్ఱముమీఁద నదిమి కూర్చుండెను. అతని బరువునకు గుఱ్ఱము నెక్కి వీపు కదించుకొనిపోయినది. నిగుడదన్నిన కాళ్ళు నీలమండలవద్ద పట్టుదోవతి జరీయంచు పైకిఁబోయి పిక్కలదాక మాత్రమే యుండెను. కుడికాలికి సింహతలాటపు బంగరు గండపెండేరము, పచ్చరాళ్లు పొదిగినది, కనులందు కొట్టవచ్చుచుండెను. పట్టుబట్టలో సన్న యాతని తొడలు మదపుటేనుఁగు తొండములవలెఁ, బిక్క- లినుపగుదియలవలెఁ జూపరులకు భయముఁ గలిగించుచుండెను. అతని చుట్టును వంద కాగడాలు వెలుఁగుచుండెను. ఆ మహాపురుషుని శంకఁ జూచిన వారు, చుట్టును నడచుచున్నవారు నానయుం పవిత్రమైన నమ్ర భావముతో, గౌరవ దృష్టులతో, భయముతో వర్తించుచుండిరి, అతని చుట్టునున్న వందమందియును వీరమాహేశ్వరులు. ఇంకను విభూతిధారులు, అందఱు ఖడ్గపాణులు. జయ జయ మహాదేవసదాశివముఖులు. వీరి వెనుక పలువచప్పరముపై బోయీలచేత మోయఁబడుచు శివుని పెక్కు యుత్సవ విగ్రహములు వచ్చుచుండెను. ఈ మహోత్సవము విజయవాటికకుఁ బ్రాగ్దిశయందు గవ్యూతిమేరయందు నడచుచుండెను. ఈ యుత్సవ మాస్థలమునందు పూర్వము ముప్పదియేండ్లుగా జరుగలేదు. నేడు జరుగుచుండెను. ఈ శైవోత్సవము విజయవాటిక దాటి రావలెను. ఇది వీరశైవుల యుత్సవము. వీరశైవులకు, వైష్ణవులకు నది విరోధహేతువైన విషయము. వీరశైవులు

విజయవాటికాపశ్చిమదిశకుఁ బోవచ్చును. ప్రాగ్దిశకు రారాదు. ఇది పూర్వమునుండి వచ్చుచున్న కట్టడి. ఆంధ్రదేశము దత్పూర్వమున వీరశైవులకుబలములేదు. విజయవాటిక శైవుల యొక్క యునికి. వీరశైవులు పశ్చిమ చాళుక్యుల దేశమునందు ప్రబలియుండి కొలఁదిమంది యాంధ్రదేశమునను మున్ను వ్యాపించిరి. కాని వారికిచ్చట బలములేదు. వీరశైవులు ప్రాగ్దిశకు రారాదన్న నియమము నేఁడుల్లంఘింపఁబడెను. ఉల్లంఘింపఁబడుటలో నెట్లుల్లంఘింపఁబడెను? ఆ మహాశ్వముపైనున్న వీరుని పేరు కరవాలభైరవుఁడు. అతఁడు మహాయోద్ధ. పశ్చిమ చాళుక్యుల సేనానాయకుఁడైన గోవిందరసునకుఁ గుడిభుజము. ఇతఁడు పూర్వమెన్నియో యుద్ధములం దారితేరినవాఁడు. అతనిపేరు విన్నమాత్రాన దిగ్దంతావళములు దద్దరిల్లునఁట. దివిజకాంతల గుండెలు దిగులుమనునఁట. పాతికయుద్ధములుచేసి వానిలో నతడు నఱికిన యేనుఁగుల సంఖ్య కొన్ని వందలకు మించినది. గుఱ్ఱముల సంఖ్య వేలమీఁద నుండును. అతఁడు కత్తియెత్తి నఱుకగా రౌతును గుఱ్ఱమును చెరిసగముగా రెండు తుండెములగును. అతని యెదుట నిలచిన వీరుఁడు లేఁడు.

పశ్చిమ చాళుక్యులు తెలుఁగుదేశముపై దండెత్తి గెలిచిరి. వెలనాటిచోడుఁడు రెండవ గొంకభూపతి వారి కోడిపోయెను. దేశములో బశ్చిమచాళుక్యుల యధికారము ప్రబలెను. దానితో వీరశైవుల యొత్తిడి విజృంభించెను. కరవాలభైరవుఁడు విజయవాటికారాష్ట్రకూటుఁడుగా నియమింపఁబడెను. ఇతఁడు వచ్చినప్పటినుండి పూర్వమునుండి యచ్చట వీరశైవులకు జరుగుచున్న యీ యవమానము భరింపలేక పోయెను. ఆయన

గ్రామము చుట్టును, పెరయూళ్లలోను బ్రకటించెను. "మహాశివరాత్రినాఁడు వీరశైవుల యుత్సవము ప్రాగ్దిశాభిముఖముగా బయలుదేరును. ఆ యుత్సవ మెదురు లేకుండ నెంతదూరము పోవునో, యంతదూరము వీరశైవుల మతప్రాబల్యము చెల్లును. ఆ యుత్సవమును నేనే నడపెదను. మీ యాంధ్రదేశములో నెవడైనఁ మహావీరుఁడున్నచో నాతోద్వంద్వయుద్ధముఁజేసి నన్నుఁ దరిమినచో విజయవాటముయొక్క ప్రాగ్దిశకు వీరశైవులు రారు. లేనిచో నీ భాగమంతయు వీరశైవులదియే యగును." ఈ ప్రకటన గడచిన పదిదినములుగాఁ జేయఁబడెను. ఈమహాశివరాత్రి రాత్రివేళ వీరశైవులు బయలుదేరిరి. కరవాలభైరవునితో నెదురించఁగల జెట్టి యెవరు? నాటితోఁ బూర్వపు టొడంబడికలు చెల్లిపోయినట్లే కనిపించెను.

రాత్రి ప్రొద్దుతిరిగిన వేళవఱకు నీవీరశైవోత్సవము నాల్గు గవ్యూతులదూరము నడచెను. బయలుదేరునప్పటి కించిత్సందేహములుగూడ వీరశైవుల మొగములయందు లేవు. ఈ దేశమంతయుఁ దమ కసివారుగా భావించ నారంభించిరి. అందఱి ముఖములయందు దర్పాడంబరము మెఱయుచుండెను. కరవాల భైరవున కెదురునడుచు వీరుఁ డెవఁడు! లేడని తెలిసికూడ నున్నాఁ డేమో యని బయలుదేరువేళ ననుమానమే. ఎవఁడైన వచ్చినచో నిలువ లేడన్న ధైర్యమే. అయినను వచ్చునేమో యన్న యనుమానము. ఇప్పటి కా యనుమానము విచ్ఛిన్నమైనట్లుండెను. ఇంక వెనుదిరిగిపోవచ్చును. అయినను మఱియొక గవ్యూతి మేఱ పోరాదా? కానిమ్మన్నఁగానిమ్మనిరి. మఱల నుత్సవము తొల్లిటికన్న నందముగా నెక్కువ యుత్సాహముతోఁ

బోవుచుండెను. అరగవ్యూతిమేఱ నడచెను. ఇంక తిరిగిపోవుద మనుకొనిరి. ఇంతలో దూరమున నరగవ్యూతిమేఱ వందకాగడాలు, కొన్ని వేలమంది జనము వచ్చుచున్నట్లు కన్పించెను. ఆ మ్రోత వినిపించెను. వీరశైవులలో నొకరి నొకరు చూచుకొని మాటాడుకొనిరి. అది తప్పకుండ ప్రత్యర్థిదళమే యైయుండును. వీరులందఱకు మొగములు జేవురించెను. కరవాలభైరవునితో ద్వంద్వయుద్ధమాడు నింకొక్కఁడుకలఁడా? ఏమియీయాంధ్రుల పొగరుబోతుతనము! ఈ మధ్యనున్న దూరము పరుగెత్తిపోవుద మని కొందఱు. కాదు రానిమ్మని కొందఱు. ఈ విచారణలో నా దూరముననున్న జనసమూహము చాల దగ్గరకు వచ్చెను. ఆ కేకలు, ఆ జయజయారావములు పట్టరానట్లుండెను. వీరశైవులును ముందు నడచిరి. రెండుదళములును కొంతమేఱ కలసికొనెను. కలసికొనుటతోడనే పెఱజనమెల్లరు నొడ్డుకొనిరి. కరవాల భైరవుఁడు గుఱ్ఱమును దుమికించుచుండెను. శత్రు వెచ్చట నన్న తహతహ కరవాలభైరవుని మొగమునందు, గుఱ్ఱముయొక్క దుమికించుటయందు గనుపించుచుండెను. జన మెక్కడివా రక్కడ నొత్తిగిలిరి. నడిమి భాగమంతయు బట్టబయలయ్యెను. పదునొకండువందల కాగడాల వెలుతురు పట్టపగలయ్యె. ఈ తల కొండకో మ్మొడ్డిగిల్లినట్లు కరవాలభైరవుఁడు నిలువని గుఱ్ఱమును నిలుపుటకుఁ బ్రయత్నించుచుండెను. వాని కెదురుగా నేఁబదిగజములమేఱ నొకపురుషుఁడు నిలచియుండెను. కుడిచేతిలోఁగత్తి, యెడమచేత డాలు. అతఁడు కాసెకోక బిగించికట్టియుండెను. స్థూలకాయుఁడు కాఁడు, మఱియు పొడుగు మనిసికాఁడు. మఱియు పొట్టిమనిసి

కాదు. శరీరమునకుఁ దగినంత దార్ఢ్యముకలదు. శిరమునకుఁ దలపాగఁ జుట్టియుండెను. దోవతి బిగించి కట్టుకొనెను. పైనుత్తరీయముండెను. మనిషినిఁజూచినచో నెవ్వరికిని నీతఁడు వీరుఁడని కాని, యోధయనికాని యభిప్రాయమేర్పడదు. ఒక సామాన్యమానవునివలె నుండెను. మొగముఁజూచినచో మర్యాదా లక్షణములు కన్పించుచుండెను. అతనినిజూచి కరవాలభైరవుఁడు వికటాట్టహాసముఁ జేసెను. అతనితోపాటు వందమంది వీరసైనికులు పకాలున నవ్విరి. ఇన్ని గులకరాళ్ళు పెద్దబుట్టలోఁ బోసి గలగరించినట్లుండెను. ఎదురునడచివచ్చిన ప్రత్యర్థివ్యూహములో నానావర్ణములవారు కలరు. బ్రాహ్మణులు, వైశ్యులు, శూద్రులు, పంచములు. కరవాలభైరవుఁడు నీవెవ్వరవని యడిగెను. మొదటియేర్పాటు తమలో, పెద్దలు కొందఱువచ్చి మాట్లాడునట్లు; కాని, కరవాలభైరవుని చూచినంతనే పెద్దలందఱు తాము కాదన్న, తాము కాదన్నట్లూరకుండిరి. ఆ యెదురువచ్చిన వీరుఁడే సమాధానముఁజెప్పెను "నేను కులముచేతఁ బంచముఁడను. నాపేరు బద్దన్న. ఈదేశము వీరసైనికులది కాదు. ముప్పదియేండ్లనుండి, యనఁగా వీరసైనికులిచ్చటికి వచ్చిన నాఁటనుండి వీరసైనికులవిజయవాటముయొక్క తూర్పుదేశము ప్రచారములో లేదు. మొదటనుండియు నీకట్టడికలదు. ఈకట్టడి నేఁడేల యుల్లంఘింపఁబడుచున్నది?" ఈ మాటలు వినినంతనే బద్దన్ననుఁ జూచినంతనే వీరసైనికులయొడళ్ళు మండిపోయెను. వారిలోఁ బ్రతివాఁడును బద్దన్నను పిట్టను పిసికివేసినట్లు పిసికివేయవలయు నని యూహించుచుండిరి. ఒకవేళ ద్వంద్వయుద్ధము కాక, దొమ్మియుద్ధము జరుగు నేమో యనియుఁ

బద్దన్న సిద్ధపడియే వచ్చెను. రెండువందలమంది కటారికాండ్రు బద్దన్నకు బాసటగా నిలచియుండిరి. కరవాలభైరవుఁడు చూచెను. ఇందు దొమ్మి కావలసిన యవసర మేమికలదు? ఈ బద్దన్నను తాను బ్రద్దలుచేసెద ననెను. "నాతో యుద్ధమాడవచ్చితివా" యనెను. బద్దన్న యిట్లనెను. "అవును యుద్ధ మాడవచ్చితిని. మీరు న్యాయముగఁ దిగిపోయి ప్రాతకట్టడిని తొలఁగించుటకుఁ బ్రయత్నింపకేని యుద్ధమాడనక్కఱలేదు. మీదారిని మీరు పొండు, మాదారిని మేము పోవుదము. కట్టడి కట్టడివలెనే యుండును. కాదనినచో, యుద్ధము చేయుదము. మీరు నన్ను గెలిచినచోఁ, బూర్వము కట్టడి మాసిపోయి నట్లే. నేను గెలిచినచో, మఱల వీరభైరవులు తూర్పు దెసకు రారాదు" అనెను. కరవాలభైరవుఁడు పెద్దగా నవ్వి యిట్లనెను. "ఏమోయీ! కత్తి నేర్పు చూపించుటకు వచ్చితివా? ఇందులో గెలుచుట లేదు; సంహరించుట యే." బద్దన్న 'చిత్త' మనెను.

అప్పుడు చూచుచున్న బద్దన్నపక్షమువారైన పెద్దలు కొందఱు ముందరికి వచ్చి యిట్లనిరి. "అయ్యా! తమరు గుఱ్ఱము మీఁదనుండిరి. బద్దన్న కాళ్ళమీఁద నిలచియుండెను. తమరు గూడ దిగి యుద్ధము చేసినచో న్యాయముగా నుండును. బద్దన్నకు గుఱ్ఱము లేదు. బద్దన్న గుఱ్ఱము చచ్చిపోయెను. అతఁడు వేఱొక యుద్ధాశ్వమును కొనుటకుఁ బ్రయత్నించుచుండెను. ఇంకను దొరకలేదు. కావున మనవిచేసితిమి" యనినంతనే వీరభైరవుండనెను "కాదు, కాదు. ఒప్పుకొనినచో వేఱొక గుఱ్ఱము తెచ్చికొనుఁడు. లేనిచో నిట్లే యుద్ధము చేయవలయు" ననెను. పెద్దలు మఱల నేదియో చెప్పఁబోవుచుండఁగా

బద్దన్న యుద్ధమునకు వచ్చి, యుక్తి కొనియున్నాను. జనమెల్లరు వంది గజముల మీఁద దూరదూరముగా నిలువఁబడిరి. ఇది యంతయు జరుగునప్పటికే దూర్పు రేకలు తెల్లవడుచుండెను. కరవాల భైరవుఁడు గుఱ్ఱము బద్దన్న మీఁదికి దూకించెను. సిద్ధమని యనుకొనలేదు. బద్దన్న సిద్ధపడలేదు. బద్దన్న చిఱుతపులివలెఁబడి గజముల కుడికి లంఘించెను. లంఘించి నిలుచున్న బద్దన్న కన్నులు నిప్పులుద్ద లయ్యెను. అతని మొగములో రౌద్ర రసాధిదేవత తాండవించుచుండెను. అతఁడు పైయుత్తరీయ మును దీసి దూరముగా పారవేసెను. అంత లంఘించినను నతని తలపాగ చెదరలేదు. లోన నినుపబిళ్ళతో బిగించికట్టిన తలపాగ యెట్లు సడలును? అతని మేన సన్నని యినుపకవచ ముండెను. దండలకు, ముంజేతులకు బొమ్మనకు నినుపరేకు లొడలికొత్తు కొనునట్లు సన్నని బిగింపఁబడియుండెను. కరవాలభైరవుఁడు పదిసార్లు గుఱ్ఱము నతనిమీఁదికి దూకించెను. పదిసార్లు బద్దన్న లంఘించి తప్పుకొనెను. భైరవుఁడు "ఓరీ బద్దనా! నిన్ను గుఱ్ఱపుకాళ్ళచేత మర్దించెద" ననెను. అన్నమాటలో బద్దన్న దూరమునుండి గుఱ్ఱముమీఁదికి దూకెను. దూకుటయు గుఱ్ఱపు ముంగాళ్ళు నఱుకుటయు నొక్కసారియే జరిగెను. ఒకకాలు ముందు, నొకకాలు వెనుకకు లంఘనవేగమున నున్న యా గుఱ్ఱపు కాళ్ళొక్కసారిగా నఱుకుటలోనే బద్దన్న ఖడ్గకౌశలము నకు బద్దన్నపక్షము వారందఱు జయజయారావములు చేసిరి. గుఱ్ఱము మొగ్గతెల్ల పడెను. కొండంతటి శరీరముతోఁ గరవాల భైరవుఁడు గుఱ్ఱముమీఁదనుండి దూకెను. బద్దన్న 'అద్దా' యని మెచ్చుకొనెను. ఆ మెచ్చుకోలను కరవాలభైరవుఁ డసహ్యించు

కొనెను. అప్పటినుండి యుద్ధము చేసినంతకాలము కరవాల భైరవుఁడు బద్దన్నను తిట్టుచునేయుండెను. "ఓరీ! నిన్ను కండలు కండలుగాఁ గోసి కాకులకు వేసెదను. నీ తలఁగోసి శివునకు హారతి యిచ్చెదను. నీ మొండెమును బల్లెమునఁ గ్రుచ్చి సంవత్సర మట్లే వీధివాకిట నిలఁబెట్టెదను." ఇట్లెన్నియో యనుచుండెను. బద్దన్న, "వీరుఁడా! యీ దెబ్బ మంచిది. అంత దేహముతో నీవు ప్రక్కకు లంఘించుట ప్రశంసనీయముగా నున్నది. నీదెబ్బ నా యొడలుచేతికిఁదాకినది" మొదలైన యుద్ధప్రశంసావాక్యములే కాని మఱియొక డనకుండ యుద్ధము చేయుచుండెను.

ద్వంద్వయుద్ధము కొంతసేపు జరిగెను. అప్పటికి బాగుగా సూర్యోదయమయ్యెను. ఇరువుర దేహములయందు నెత్తురుచారలు కనిపించుచుండెను. బద్దన్న యలసినట్లు కనిపించుటలేదు, కరవాల భైరవుఁడు క్రమముగా నలసిపోవుచుండెను. కరవాలభైరవుఁ డిట్లనెను. "ఓరీ బద్దన్నా! నిన్నీస్థలమునందే చిత్రవధచేసి యడుగు కదలించెదను." బద్దన్న యిట్లనెను. "నిన్ను విజయవాటము దాఁక తరిమి యచ్చట నఱకెదను."

కరవాలభైరవుని యే కత్తిదెబ్బయు బద్దన్నకు దగులుటయేలేదు. తగిలినచో బద్దన్న యేనిముసమునఁబడిన నా నిముసమే రెండుగాఁజీలిపోవును. బద్దన్నకొట్టినప్రతిదెబ్బలో నొక్కటైనను కరవాలభైరవుని వక్షస్థలముననో, బాహువుననో తగులుచునేయుండెను. బలిమీఁదిపామువలె బద్దన్న తిరుగుచుండెను. పెతి కందినట్లే కనిపించి ముసికిలించుకొని పోవును. కాలము గడచినకొలంది బద్దన్న దశదిశాలంఘనము చేయ నారంభించెను. ప్రొద్దెక్కినకొలంది నదివఱకు సమావేశమైన జనమే కాక

వంకలు వేలుగా నానాగ్రామములనుండి జనము ప్రోగుపడు చుండిరి. రెండునైపుల పదిగజముల నెడల్పుతో జనసముద్రము వెల్లివిరిసియుండెను. కరవాల భైరవుడుగాని, బద్దన్నగాని కుడిమెడమలకు విజృంభించుటకు వీలులేకుండెను. ముందు ప్రత్యర్థి పోయినచో వెనుకకే పోవలయును. కాలము గడచిన కొలంది బద్దన్న లాఘవము రెట్లు పెరుగుచుండెను. గజము వెనుకకు లంఘించినవాడు, రెండుగజములు ముందుకు లంఘించును. ఆ లంఘించినప్పు డిచ్చిన యాఘాతము తప్పించుకొనుటకు కరవాలభైరవుడు వెనుకకుబోక తప్పుటలేదు. ఈ విచిత్ర ఖడ్గక్రీడ సూర్యుడు నడిమింటికి వచ్చువరకు జరుగుచునే యుండెను. కరవాలభైరవుని శరీరము రక్తసరస్సయ్యెను. గప్ర్యాతి రెండుగప్ర్యాతులు కరవాలభైరవుడు వెనుకకు దరుమబడెను. బద్దన్న యిట్లనెను. "ఇంకొక్క యుద్ధగప్ర్యాతి మేటిలో విజయవాటమునకు జేరుదువు. ఏ బద్దె ముప్పదిమొంక్షనుండి మీ వీరశైవులు ప్రాణములతో దాటలేదో, నీ వా బద్దెను నేడు ప్రాణములతో దాటితివి." ఈ మాటలోని వ్యంగ్యము ప్రేక్షకులకందఱికి దెలిసెను. అందఱు నొక్కపెట్టున మహాట్టహాసము జేసిరి. తక్కిన వీరశైవుల మొగములలో నెత్తురులేదు. వారిలో నెక్కువమంది పశ్చిమచాళుక్య దేశమునుండి వచ్చినవారు. ఈ దేశమును గెలిచినవారు. వారి మనస్సులలోని క్రోధాగ్నులు ద్వంద్వయుద్ధములోని మర్యాదను పాటించునట్లు లేవు. అందఱొక్కుమ్మడి బద్దన్నపైబడి విరుచుకతినునట్లు కనిపించిరి. కాని బద్దన్న పక్షీయులు తొలుత వందనుండి కటాకుకాంక్షే. ఇప్పుడో, వేలకు మించిపోయిరి. ఎవ్వరిచేతిలో జూచినను

నొఱనుండి వెడలిన దీర్ఘకరవాలములే. ఈ బద్దన్న విజయ వార్తలో వెలనాటి వీరులందఱు తమదేశమును పశ్చిమ చాళుక్యులు గెలిచిన పరాభవమునకు బదులుతీర్చికొనినట్లు భావించిరి. వీరశైవులకు బెసగుటకు వీలులేకపోయెను. మఱల యుద్ధము జరుగుచుండెను.

కరవాలభైరవుని శరీరమంతయు రక్తములోనే కాక చెమ్మటలోఁగూడ తడిసి ప్రవాహములు కట్టుచుండెను. అరచేతులలోగూడ చెమ్మట పట్టుచుండెను. ఒకటి రెండు సారులు కత్తిజారిపోయెను, అతడు మఱల కత్తి గ్రహించులోపల బద్దన్న పైబడి నఱకునేమో యనిపించెను. పైకి శ్వాసము లఘించఁబోవునప్పుడు మార్జాలము భీతితో నోడలు కుదించుకొని వెనుకకాళ్ళమీఁద పిఱిందికి నెమ్మది నెమ్మదిగ జారినట్లు కరవాలభైరవుఁడు జారిపోయిన ఖడ్గమును మఱలఁ దీసికొని మాటాటికి వెనుకకు వెనుకకు సాఁగెను. బద్దన్న పరిహాసముతో నిట్లనెను. "భయములేదోయి, కరవాలభైరవుఁడా! మన మింక విజయవాటము చేరలేము. కత్తి దీసికొమ్ము."

ఇట్లు జరుగఁగా, జరుగఁగాఁ దుట్టతుదకు విజయవాటము యొక్క చివరి యిల్లు వచ్చెను. అటనుండి విజయవాటము యొక్క వీథి ప్రారంభించును. అటనుండి సమావేశమైన వేల జనమునకు నిలుచుండుటకు వీలులేకపోయెను. జనము చెట్లెక్కిరి. ఇండ్ల పైకప్పు లెక్కిరి. పిట్టగోడలమీఁద స్థలములేదు. ఇండ్ల ముంగిళ్లు, వీథియరుగులున్నియు జనముచే నావరింపఁబడెను. బద్దన్న యిట్లనెను. "నీ విప్పుడైనను తిరిగి పోయినచో, నాకభ్యంతరము లేదు. వీరశైవు లీ బద్దెదాటి రాకూడదు

రామని మీరంతయు ప్రయాణము చేసినచో వదలిపెట్టెదను."

కరవాలభైరవునకు, దదనుయాయులకు నీమాటలు విని నంతనే కోపము పట్టరానిదయ్యెను. తామా ! దేశమును జయించినవారు. కరవాలభైరవుఁడా! గండరగండఁడు. ఏనుఁగులను నఱకినవాఁడు. వీఁడా! పిట్టంతమనిసి.

యుద్ధములో నదియేమి చిత్రమోఁ పరాజయము కనులకుఁ గనుపించుచున్నను నే నిముసమెట్టిదో యనియే, భవిష్యన్నిమేషము తన కనుకూలపడునో యని యాశ బలవత్తరముగాఁగనిపించును. కరవాలభైరవునకు నా నిముసమందు తానట్టి శోచనీయమైన స్థితిలో నుండినను, గడచిన రెండుజాములుఁ దాను బద్దన్నమంటు నిలువ లేనట్లు కనుపించుచున్నను తానే గెలిచెదనను నూహయే ప్రబలెను. అది గెల్పుటాశయో, కోపావేశాభాసమో! కరవాలభైరవుఁ డిట్లనెను. "ఓరీ నీ కిదియేదో మంచిదినము, నాయెదుట నింతవఱకు నిలచినవారు లేరు. ఇంక చూడు" మనెను. కాని కరవాలభైరవుఁడు రొప్పుచుండెను. బద్దన్న యిట్లనెను. "నీవు చాల బడలితివి. నీవు పోయి స్నానమాడి మఱల జేపు రమ్ము : ఈ ద్వంద్వయుద్ధము మిగిలినది. జేపు చేయుదము" అని.

ఈ మాటలు కరవాలభైరవున కపార్థము కలిగించెను. అతఁడు నవ్వి యిట్లనెను. "ఏమిరా తప్పించుకొని పోఁజూచుచుంటివా!" యని బద్దన్న యూదాలాపముగ నున్నప్పుడు వానిపై కురికెను. బద్దన్న డాలెంత యడ్డము పెట్టినను దెబ్బ తప్పించుకొన లేకపోయెను. అతని చెక్కిలిమీఁద నొక బలవదాఘాతము తగిలెను. నెత్తురు చిమ్మిన గొట్టముతోఁ గొట్టినట్లయ్యెను.

కరవాలభైరవుఁడు దానిని పురస్కరించుకొని యొకవిచిత్రచంక్ర మణము చేసెను. ఆ విచిత్రఖేలనముయొక్క ధాటి నోడ్డు కొనుటకు బద్దన్న వీధికి కుడి పక్క నున్న యొకయరుగుపైకి లంఘింపవలసివచ్చెను. అదివఱకా యరుగుమీఁద మూఁగిన జనమెల్ల రెచ్చటివా రచ్చట నొడ్డికొనిరి. ఆ యరుగుమీఁద నిలుచున్న బద్దన్నకు వీలిచ్చెను. ఇంతవఱకుఁ జేసిన యుద్ధములో తాడియంత యెత్తునున్న కరవాలభైరవుని యూర్ధ్వకాయ మునందు బద్దన్నకొట్టిన దెబ్బలు సరిగాఁ దగులలేదు. అతని దెబ్బలన్నియు కరవాలభైరవుని వక్షస్థలమునందునను, బాహు వులయందునను మాత్రమే. కరవాలభైరవుని దెబ్బలన్నిటికిఁ దన శిరోభుజములు లక్ష్యములు గాకుండఁ జూచుకొనుటయే పనియైనది. ఇప్పుడు బద్దన్న యరుగుమీఁదనున్నాఁడు, కరవాల భైరవుఁడు క్రిందనున్నాఁడు. ఇద్దరి శిరఃప్రదేశములు సమరేఖగా నుండెను. కరవాలభైరవుఁడప్పుఁ డొక్క పనిచేసిన బాగుగా నుండెడిది. తాను వీధి నడిమికిఁబోయి బద్దన్నను దిగిరమ్మన్నచో నెట్లుండెడిదో! క్రోధావిష్టుఁడై కరవాలభైరవుఁడు బద్దన్నతో నచ్చటినుండియే యుద్ధము చేయ నారంభించెను. బద్దన్న యిది వఱకుశత్రువుయొక్క దెబ్బలాగుటకు వెనకకు లంఘించుచుండెను. ఇప్పు డా వీలు బద్దన్నకు లేదు. అందుచే నచ్చటనుండి బద్దన్నకు వెనుకకు లంఘించువీలు లేకుండఁజేసి యతని నచ్చట సంహరించ వలయునని కరవాలభైరవుని యూహ. బద్దన్న యూహ యేమనఁగాఁ, దాను కరవాలభైరవుని శిరోధిప్రదేశము లంఘన వేళ యందు కత్తి నడిమిభాగముతో నందుకొనవచ్చునని మాత్రమే. వెనుకకు లంఘించుట బద్దన్నకు నిలువఁద్రొక్కుకొను నేర్పు

లేకకాదు. పూర్వమువలె నిప్పుడు తన శిరోభుజప్రదేశముల మీఁద కరవాలభైరవుని కత్తిపడునన్న భయము బద్దన్నకు లేదు. కరవాల భైరవునికత్తి యెప్పుట పడినను నప్పుటనెల్ల బద్దన్న డాలే కనిపించెను. ఇట్లు గడియసేపు జరిగిన తర్వాత కరవాల భైరవుఁడు బద్దన్నకాళ్ళు నఱకవలయునని ప్రయత్నించెను. ఇంతకన్న తెలివితక్కువయూహ యుండదు. అతఁడందుచేత బద్దన్నకుఁ దేలికగాఁ దనకంఠమునప్పగించెను! బద్దన్న కరవాల భైరవుని కత్తిని డాలుతో నడ్డగించి అతని వామబాహువు నఱకెను. ఎడమచేయి పోయినను కలవారభైరవుఁడు కుడిచేతితో సాముచేయుచు విజృంభించెను. కాని డాలులేని తాను, అరుగు మీఁదనున్న బద్దన్నతో తాళుకొనలేనని తెలిసి యరుగునకు దూరముగాఁబోయి, యీపోవుటలో కాలికొకరాయి తగిలి వెనుకకుఁబడిపోయెను. బద్దన్న అతనిమీఁదికి లంఘించెను. వీర శైవులందఱు హాహాకారములుచేసి. అన్యాయ మన్యాయ మనిరి. బద్దన్న లేచిదూరముగాఁబోయి నిలుచుండెను. కరవాల భైరవుఁడు లేచి కత్తిపుచ్చుకొని బద్దన్న కెదురునిలచెను. బద్దన్న యొక విచిత్రగమనరేఖ ప్రకటించికరవాల భైరవుని కుడిమోఁకాటు నఱకెను అట్లు దిగజాఱుచున్న కరవాలభైరవునిమీఁదికి బద్దన్న లంఘించి క్రిందఁబడఁద్రోసి ఱొమ్ముమీఁదఁ గూర్చుండి యడిగెను. "ఒరీ! శివుఁడు శిష్యుఁడంతవు నీవును శైవుఁడవు. నేనును శైవుఁడను. అతఁడు జ్ఞానాకృతి, ఆత్మస్వరూపుఁడుగాని సంఘవ్యవస్థారూపుఁడుగాఁడు. నీ శైవ మేమిటి?" యని యతని మెడ నఱకెను. ఒక లక్ష కంఠములనుండి, "జయజయ మహా దేవ శంభో శంకర" యను మహానినాదములు చెలరేగెను.

బద్దన్న కరవాలభైరవుని శరీరము పడియున్న తావున నిలచి యిట్లనెను. "ఇదిగో నేను శాసించుచున్నాను. ఇదిగో బద్దె. ఈ కట్టడి నెవ్వఁడు నుల్లంఘించరాదు. ఉల్లఘించినచో నిదియే శిక్ష.

## ౨

అది శాలివాహన శకము; ౧౦౮౮ సంవత్సరము

బద్దన్న ఖడ్గపాణియై యొడలెల్ల నెత్తురు కారుచుండఁగాఁ జెక్కిలిమీఁదఁదగిలిన గాయముమీఁద నెత్తురట్టలుకట్టఁగా రౌద్రరసావతారముఁ బలె నా సంవత్సరము శివరాత్రినాఁటి మునునాఁడు సాయంకాలము సూర్యదేవుఁడు పశ్చిమగిరిశిఖర చుంబన క్రీడాలాలసాభిరామబింబముఖుఁడైన వేళ వెనుకనుండి పదివేల ప్రశంసాకంఠములు జయజయ ధ్వానములు సలుపుచుండ నరుగుచుండెను. అతని నడకలోని ఠీవి, యతని కనుల యందలి గాంభీర్యము దాటి వెంట వీరరసలక్ష్మి పోవునంత మేటి రత్నములు వెదజల్లుచుఁబోవుచున్నట్లుండెను. అట్లు నాలుఁగు గవ్యూతుల మేఱ బోయెను. దారిలో నతని నెక్కించుకొని పోవుటకుఁ బలుమంది బండ్లుకట్టుకొని వచ్చిరి. కాని యతఁడు బండి నెక్కలేదు. ఎక్కుమని యడిగిన ప్రతివానితో నిట్లు చెప్పుచుండెను. "మన మాంధ్రులము. ఈ రాజ్యము తూర్పుచాళుక్యులది. పశ్చిమచాళుక్యు లీ రాజ్యము నాక్రమించి యేడేండ్లయినది. మహాపౌరుషశాలులైన వెలనాటిచోడులే శిరస్సులతోఁ గులోత్తుంగ చోడదేవపాదపద్మస్పర్శ చేసిరో యా శిరస్సులతో విక్రమాంకదేవుని యడుగుల కడుగులు లంటుచున్నాము. మనము

ప్రాచ్యులము, పశ్చిమచాళుక్యులు పాశ్చాత్త్యులు. వారికి,మనకు శాలివాహనుల నాఁటినుండియు పొత్తులేదు. శాలివాహనులు గూడఁ బ్రాక్పశ్చిమదేశములు విడివిడిగానే పాలించిరి. శాతవాహనుల మహాచక్రవర్తి మన ధాన్యకటకమునుండి యేలుచుండఁగా యువరాజులు ప్రతిష్ఠానమున నుండి యేలుచుండిరి. ఆఱువందల యేండ్లనుండి మనదేశము మనదేశము. మన సామ్రాజ్యము మనసామ్రాజ్యము. నా కులము పంచమకులము. ఈ సామ్రాజ్యరక్షణకొఱకైదువందల యేండ్లుగా నెన్నికోట్లమంది నా కులమువారు తమ రక్తబిందువుల నోడ్చిరో! వెలనాఁటిచోడులు చతుర్థకులజులు. ఈగడ్డ వారిది. వారు దీనికి రాజులు. వారీ నేలమీఁదియధికారము వదలుకొన్నను, పంచమకులజులము మేము వదలుకోము. శాస్త్రములంతకూడ నుత్తరోత్తరము బలీయమందురు. అన్నిటికన్న నుత్కృష్టమైన బలము కలఁది మా కులము. నే నీరాజ్యముఁ బశ్చిమచాళుక్యుల వశము జేయను. చేసినచో వెలనాటి గొంకయ్య చేయవలయును. నే నీ నడిమేఱులనాటినుండి పశ్చిమచాళుక్యులను తరిమివేసెదను. రాజ్యమంతయు గొంకరాజున కిచ్చెదను. ఆయన తీసికొనిపోయి తన కాయనయే యిష్టమైనచో మఱల విక్రమాంకదేవునకే యిచ్చుకొనిమ్ము. మీ రందఱు నన్నీ బండ్లమీఁద నా స్వగృహమునకుఁ దీసికొని పోవ నెంచుచున్నారు. నాకుఁ గావలసినది యదిగాదు. ఈబండ్ల మీఁద స్వాతంత్ర్యదేవతను గొలుతు. ఈ గాయములు కట్లు కట్టించికొని సమ్మతించినతోడనే నేను మఱల మీ యిండ్లకు వచ్చెదను. ఒక్కొక్కయింటిలో నెన్నిరాత్రు లుండునో యన్ని

కత్తులు నా వెంటరావలయును. మీ బంట్లమీఁద నేనొక్క లేదని మీకుఁ గోపము వలదు. మనమందఱము కలసి యీబంట్లమీఁద నాంధ్రుల స్వాతంత్ర్యదేవత నెక్కించి యూరేగింపవలయు ననుచు గృహాభిముఖుఁడై పోవుచుండెను.

అతని మాటలు ముఖమునుండి ముఖమునకుగాఁ బది వేలమంది జనమునకుఁ దెలిసెను. అదివఱకుఁ జెవ్వ మోతగా జయ జయ ధ్వానులతోఁ బోవుచున్న జన మందఱు నిశ్శబ్దము గాఁబోఁజొచ్చిరి. ఆ సర్వజనముయొక్క మనోంతరాళములందు నా సమయమునసే బద్దన్న యొకమహాసేనానిగాఁ బ్రతిష్ఠింపఁబడెను. బద్దన్నవంటి సేనాని దొరికినచో——! కరవాలభైరవుని వంటి యోధుని తరిమితరిమి పూఁడుగవ్యాతులమేఱఁ బెరిగి పెరిగి యొడనెడ, నెడనెడ ఖడ్గాఘాతములచేత మేనెల్ల తూట్లుపఱచి శిరఃకర్తనము గావించిన సేనాని——యింతటి మహాకార్యముచేసి కొంచెమైనను స్వార్థపరత్వములేని మహాసేనాని——ఆంధ్రుల స్వాతంత్ర్యమే వాంఛించు సేనాని - అట్టిసేనాని దొరకినచోఁ బశ్చిమ చాళుక్యులను పారద్రోలుట నిముసములోని పని. ఈ నిశ్చయము ప్రతివానిహృదయమునందును ముద్రింపఁబడెను. సూర్యదేవుఁడు పశ్చిమగిరిపశ్చాద్భాగమునఁ గ్రుంకుచుండెను. బద్దన్న తనగూడెమునకుఁ బోయెను. వేయిమంది లెంకలను వారు తనయింటిచుట్టునుమూఁగి రాత్రిజాము ప్రొద్దుపోవువఱకు వదలిపోలేదు. బద్దన్న యిల్లు కొద్దిలో భవనము. వాకిటిలో వడ్లపురులు, పశువులు, చొప్పగూళ్లు. కొద్దిలో సంపన్న గృహస్థుని యిల్లుగా నుండెను. బద్దన్నపూర్వులెప్పుడును పాలేరుతనము చేయలేదు. స్వంతవ్యవసాయముతో చేసిరి.

బద్దన్న వయస్సిరువదిరెండేండ్లు. అంతటి చిన్నవయస్సులో నింతటి మహాశూరుఁడై ప్రకాశించుట చూచెడిజనమున కందఱకు మహోత్సవకారణమయ్యెను. అతని కులస్థుల కందఱకుఁ గర్వకారణమయ్యెను. బద్దన్నకుఁ జిన్ననాఁడే తల్లి పోయెను. తండ్రి యెనుఁబదియేండ్ల వృద్ధుఁడు. అతనితండ్రి మఱల వివాహ మాడలేదు. తండ్రియే యన్నమువండి పెట్టును. పొలముపని చూచుకొనును. బద్దన్నకుఁ బదునొకండు పన్నెండేండ్లు వచ్చినప్పటినుండి కఱ్ఱసాములు, కత్తిసాములు, శరీర వ్యాయామము—వీనిమీఁదనే యుండెను. ఒక్కకొడుకు. పోయిన మంగమఱల రూపుకట్టినట్లున్నవాఁడు. బద్దన్నతండ్రి కొడుకుమార్గమున కడ్డుతగులలేదు. కాని నిన్నటిరాత్రి గ్రామస్థులందఱు కొడుకును ప్రోత్సాహముచేసి వానిని కరవాలభైరవుని కెదురు తీసికొనిపోయిరని వినినంతనే తండ్రికిఁ బ్రాణము పైకిఁబోయెను. తండ్రి యప్పుడు పొలముమీఁద నుండెను. అతని కీ సంగతి తెలియువఱకే తెల్లవారవచ్చెను. ఱొమ్ములు గిరెసలు పడగాఁ బరుగెత్తుకొని పోయెను. కొడుకు నింటికిఁ దీసికొని రావలయునని. కాని యప్పటికే కరవాలభైరవుఁడును, బద్దన్నయుఁ గత్తి కత్తి కలిపిరి. మనస్సులోఁ గొడుకునకు నీళ్ళువదలుకొని తండ్రి యింటికి వచ్చెను. కొడుకు తిరిగి యింటికి వచ్చుచున్న యాసయే లేదు. తా నంతకంటె జేయఁదగినది యుఁగన్పించలేదు. సాయంకాలమున కరడుగట్టిన నెత్తురుముద్దగాఁ గొడు కింటికి వచ్చినప్పు డా యనుసరించుచున్న వేయిమంది జనములయొక్క గౌరవదృష్టిలో దేవతామూర్తివలె నున్న తన కొడుకును చూచినప్పుడు తండ్రిప్రాణములు తిరిగివచ్చుటయేగాదు; ఆ

ప్రాణములు స్వర్గసౌఖ్యవీథీసంచారము చేసెను. కాని కొడుకు పైనుండి క్రిందికి నెత్తురు సెలయేళ్ళు ప్రవహించుచున్న గిరి పార్శ్వమువలె నుండెను. అది చూచి చిక్కలి దుఃఖపడెను. వెంటనే వేన్నీళ్ళు గాచిరి. గాయములు కడిగిరి. వ్రణవైద్యుండు వచ్చి పట్టీలు వేసెను. బద్దన్న సుఖముగాం బండుకొనెను. అతని యింటిలో గూడెములోని ప్రతివ్యక్తియు నప్పుడు పరిచారకుడుగానే కనిపించెను. రాత్రి ప్రభాతప్రాయమయ్యెను. జనములందఱును వెడలిపోయిరి. కాని యొక్క స్త్రీ మాత్రము బద్దన్న మంచమువద్దనుండి కదలలేదు. ఆమెపేరు బాదమ్మ.

బాదమ్మ ముప్పదియేండ్ల యువతి. చామనచాయ మనిషి. కోలుపుచువ్వవంటి మనిషి. ఆమెయొక్క శరీరావయవవిన్యాసము భగవంతుడుచూచి మన్మథునకుం గ్రొత్తబండి కట్టినట్లుండెను. ఆమె మొగమున సౌందర్య మెంతయుండెనో ప్రసన్నత యంతయుండెను. ఆమె శరీరమున కాఠిన్యమెంతయుండెనో, సౌకుమార్యమంత యుండెను. ఆమెనేత్రములలో దీక్షత యెంతయుండెనో, దయ యంతయుండెను. బాదమ్మ తండ్రి బాదమ్మనొక వృద్ధునకిచ్చెను. బాదమ్మ మగనిపేరు తిప్పన్న. ఆ యూరిలో తిప్పన్న పెద్ద షావుకారు. ధనవంతుడు. అతనికి మూడవపెండ్లి చేసికొనవలయునని యూహపుట్టెను. బాదమ్మ తండ్రి నిరుపేదవాడు. ఒక్క ఖండుకధాన్యమునకైనను కూతు నమ్మునట్టి నీచుడు. పదివివర్తనముల ధాన్యము, వందనిష్కములను పుచ్చుకొని కూతునిచ్చెననుటలో నచ్చెరువులేదు. తిప్పన్న లక్ష్మీదేవికి ముద్దుబిడ్డ. గ్రామములోని పెద్దపెద్ద కర్షకులుకూడ వానివద్ద ధనము నప్పు తీసికొని పోవుచుండెను.

తిప్పన్న యింటి ప్రక్కనే సాముగరిడీలశాల యుండెను. బాదమ్మ సాముగరిడీలు నేర్చిన స్త్రీ. బాదమ్మ పుట్టినింటివద్ద వారి గూడెములో చిన్నప్పుడు తమకులములోని యువకులందఱు సాములు నేర్చుచుండఁగా బాదమ్మ వారితోపాటు నేర్చినది. వారియూరు కొప్పాక. కొప్పాకగూడెములోని కత్తిసాము, నాఁటి రెండేఱుల నడిమి విషయముమందే కాదు; వెలనాటి విషయమున, కర్మరాష్ట్రమునఁగూడఁ బ్రసిద్ధివహించిన విద్య. పూర్వము భారతదేశమున వేదాంతవిద్యలలోఁగొన్ని క్షత్రియ వంశములయందే యుండెడివి. ఆ యుపాసనావిద్యలు బ్రాహ్మణు లెఱుఁగరు. అట్లే కొప్పాకలోని పంచమవర్ణస్థుల ఖడ్గవిద్య పంచములయందే యుండెను. తక్కినవారి కది తెలియదు. తూర్పు చాళుక్యులు, వెలనాటి చోళులు, బలవంతుఁడైన శత్రువుమీఁదికిఁ బంచముల సేననే పంపించుచుండిరి. ఈ పంచమ దళములకు యావద్భారతమున నెదురు నిల్వఁగల సైన్యముండెడిదికాదు. పల్లవులు సముద్రగుప్తుని దండయాత్రి మళ్ళించినప్పుడు కృష్ణాగోదావరీ మధ్యస్థ పంచమసేనా వ్యూహబలముచేతనే. ఆ సంప్రదాయములోని నిగ్గులు, కొప్పాకలోని మూలభూతములు బాదమ్మకుఁ దెలియును. బాదమ్మ యీ విద్యలో బద్దన్నకు గురువు. బద్దన్నను కరవాల భైరవుని కెదురుపంపింపఁ బ్రోత్సాహముచేసిన వారిలోఁ బ్రథము రాలు బాదమ్మ. కరవాల భైరవునితోఁ జేసిన యుద్ధములో బాదమ్మనేర్పిన ఖడ్గవిద్య బద్దన్న యెక్కువయుపయోగించలేదు. ఆ విద్యలోని యెక్కువభాగము రెండు మహాసైన్యము లెదురు పడ్డప్పుడు ప్రయోగింపఁదగినది. కరవాలభైరవుని గుఱ్ఱము

యొక్క ముంగాళ్ళు నఱకిన మొలఁకువ మాత్రము కొప్పాకవిద్య; బాదమ్మ నేర్పిన యొడుపు. హోయిసాలులు, కాకతీయులు, పాండ్యులు, రాష్ట్రకూటులు, వెలనాటి చోడులవంకఁ దేరిచూడ కుండఁ జేసినది, పంపించిన గుఱ్ఱములన్నియు ముంగాళ్ళు భిన్నములై పడినవి, యీ కొప్పాకవిద్యయొక్క ప్రభావమే.

బాదమ్మ బద్దన్నపజ్జనల్లే కూర్చుండెను. బద్దన్నకు మఱునాఁడు పగలుజాము ప్రొద్దెక్కిన తర్వాత మెలఁకువ వచ్చెను. అతని యొడలు జ్వరముచేత మండిపోవుచుండెను. అతఁడు కన్నులు తెఱచినంతనే బాదమ్మ యతనిఁ జూచి నవ్వెను. ఆమె తనమనస్సులోని విచారమాపుకొని బద్దన్న కుత్సాహము కలిగించుటకు నవ్వెను. బద్దన్నయు నవ్వఁబోయెను. ఆనవ్వఁబోవుటలోఁ జెక్కిలి మీఁద వేసిన పట్టీలోని నరముల భాగమున నొత్తిడి గలిగి బాధపెట్టి యతఁడబ్బాయనుకొనెను. అతఁడు బాదమ్మను జూచినంతనే లేచి కూర్చుండి యేదో చెప్పబోవునట్లు ప్రయత్నించెను. లేవలేక పోయెను; బాదమ్మ నెమ్మదిగా నతనిని లేవఁబోవు ప్రయత్నమునుండి యాపెను. ఒక్క యరగడియ ప్రయత్నము చేసి యతఁడిట్లు చెప్పెను. "అతని గుఱ్ఱపు ముంగాళ్లు నఱికితిని. లేనిచో నేనింటికి తిరిగి వచ్చెడివాఁడను కాను." ఈ మాటలు కొన్ని యస్పష్టముగా మఱికొంత హస్తాభినయముతోఁ దెలియఁ జేసెను. అంత వైద్యుఁడువచ్చి బద్దన్నకు నౌషధమిచ్చి మఱల కట్లుకట్టి వెడలిపోయెను. బాదమ్మ యింటికిఁబోయెను. తిప్పన్న నాఁడు బాదమ్మతోఁ బోట్లాడెను. వారియింటికిఁ బోవలదనెను, అతనికి నామెకు సంబంధ మనెను. వాఁడు చావవలసినవాఁడు, మఱలఁ బ్రబతికివచ్చెననెను. బాదమ్మ యన్నిమాటల కోర్చు

కొనెనుగాని బద్దన్ననన్నమాటకోర్చుకొనలేదు' ఆమె యిట్లనెను. "నేనును; నీవును మన క్షేమము మాత్రమే మనకుఁ గావలసిన వారము. మనము చూచుకొనువారము. బద్దన్న యీ దేశమున కంతకుఁగన్నాఁగావలసినవాఁడు. చిన్నవాఁడు. ఈ తెలుఁగునాటి పౌరుషమంతయు ముక్కుమొగముగా నేర్పడినవాఁడు. అతఁడు నాకు శిష్యుఁడు. నీ వతని నేమన్నను ఓర్చుకొనలేను." తిప్పన్న:- నీకుశిష్యుఁడు కాఁడు,మగఁడు. బాదమ్మ:-అతఁడు మగఁడెట్లగును. అతఁడు మాబాబుకు వందనిష్కము లిచ్చెనా. పదినివర్తనము లిచ్చెనా?" తిప్పన్న:-నేను నీకు మగఁడనగుట యంతమాత్రమే యన్నమాట." బాదమ్మ:-నీ వన్నావు' నే నన్నాను." ఈ ప్రసంగము మఱికొంత రగడ పెరిగెను. తిప్పన్న చివరకుఁ గోపముతో బాదమ్మను కొట్టెను. ఈ కొట్టుట యలవాటుగా జరిగెడు పనియే. ఆమె యేడ్చుచుఁ గూర్చుండెను. అందుచేత నాపగలంతయు,మఱునాఁడును, బాదమ్మబద్దన్న వద్దకుఁబోలేదు. మఱునాఁడు సాయంకాలము మగడింట లేనప్పుడు బద్దన్నను చూడఁబోయెను. అప్పటికి బద్దన్న మూసిన కన్నెరుగకుండ నుండెను. తెలిసీ తెలియని మాటలు మాటాడుచుండెను. కలవ రించుచుండెను. "గొంకయ్యను తరిమెదను, వెలనాటి చోళులు, ప్రభువులు." ఒకదాని కొకటి పొసగని యిట్టిమాటలు, కరవాల భైరవునితో యుద్ధము చేయుచున్నప్పుడు చేసిన ప్రసంగము లోని కొన్ని వాక్యములు నడుమ నడుమ కలవరించుచుండెను.

గూడెములోనున్న వైద్యుఁడుకాక గ్రామములో బ్రాహ్మణుఁ డొక వైద్యుఁడుండెను. బాదమ్మ యాయనను పిలిపించ వలయుననెను. బద్దన్నతండ్రి బ్రాహ్మణుఁడు గూడెములోనికి

వచ్చినా యనెను. బొదమ్మ:—ఎందుకురాఁడు. పూర్వము నా మగనికి జబ్బుచేసినప్పుడు రాలేదా? నేనుపోయి తీసికొనివత్తు నని పోయెను. ఆ బ్రాహ్మణుఁ డప్పుడింటివద్ద లేఁడు. బొదమ్మ యదియొక యపశకున మనుకొనెను. ఆ వైద్యుఁడు కొంచెము సేపటిలోనే, వచ్చెను. బొదమ్మ యాయనను రమ్మనెను. ఆ వైద్యుఁడు ప్రొద్దు క్రుంకినదే. తిరిగి వచ్చునప్పటికి ప్రొద్దు పోవును. అర్ధరాత్రమున స్నానము చేయవలసివచ్చును. క్రొత్త బందెములు లేవు. రేపు వత్తుననెను. బొదమ్మ:— "దొరా, నా గుండె గుండెలోలేదు. తిప్పన్న డబ్బుకలవాఁడు గనుక వచ్చినావు. బద్దన్న పేదవాఁడు. ఎందుకువచ్చెద వనెను. ఆవైద్యుఁడిట్లనెను. "ఓసీ!ఏమిమాట? నాకు డబ్బు కావలసినచో నీవే తెచ్చి యిత్తువు. అదియుఁగాక బద్దన్న పసివాఁడు. వాఁడు రేపు సేనానాయకుఁడు కాఁదగినవాఁడు. వానివంటివాండ్రు బ్రతికియున్ననే రాజులు పాలించుట, ధర్మము మొదలైనవి యుండుట. వారు శైవులు? శైవులైయుండి వీరశైవునిమీఁదికి వాఁడు దండెత్తిపోయెను. వానికన్న ధర్మము నిలఁబెట్టఁగలవాఁ డెవ్వఁడు? నీకా సందేహమున్నచో నిదిగో వచ్చుచుంటి"నని బయలుదేరెను. బద్దన్న తండ్రి బద్దన్నకుఁ గడచినరాత్రి నిద్ర లేదని చెప్పెను. ఆ వైద్యుఁడేదో మందిచ్చెను. బద్దన్న యా రాత్రి సుఖముగా నిద్రపోయెను.

బొదమ్మ మఱల బద్దన్న యింటికి పోయినదని మఱలఁ దిప్పన్నకుఁ దెలిసినది. ఆ రాత్రి తిప్పన్న యేమియు మాటాడ లేదు. మఱునాఁడు సాయంకాలము జాము ప్రొద్దుండఁగా బొదమ్మ బయలుదేరెను. తిప్పన్న:— నీ వీసారి వారి యింటికి

బోయితివా, నేను మఱల నింటికి రానియ్యను. బాదమ్మ:— అట్లే రానియ్యకుము. తిప్పన్న:— నీ యుద్దేశ్యము వానితో నుండిపోవలయుననియా? బాదమ్మ:—నేనింతవఱకేమియు నను కొనలేదు. అతఁడు వీరుఁడు. అతఁడు ఆపదలో నున్నాఁడు. వారి యింటిలో నాఁడదిక్కు లేదు. చూచివత్తమని పోవు చున్నాను. తిప్పన్న:—వారికి శివుఁడు దేవుఁడు. మనము వైష్ణవులము. మనము దాసరులము. వారు జంగములు. నీవు వారి యింటికిఁ బోఁగూడదు. బాదమ్మ:—బద్దన్న జంగము కాఁడు. దాసరి కాఁడు. అతని గురువు బ్రాహ్మణుఁడు. శివుఁడు, విష్ణువు నిద్దఱు నతనికి దైవములే. తిప్పన్న:—నేను జంగముల యింటిలో నీళ్లు త్రాగను. వారినీడ నామీఁద పడరాదు. బాదమ్మ:— నేను నీవు కాదు.

ఈ మాటతోఁ దిప్పన్నకుఁ బట్టరాని కోపము వచ్చెను; మఱలఁ గొట్టఁబోయెను. బాదమ్మ యిట్లనెను. "నీవీ సారి నన్ను కొట్టవచ్చితివా నే నూరకొనను. పోయి యూరిలోఁ జెప్పెదను." తిప్పన్న:— ఊరిలో నున్న సభికులందఱు నన్ను దాటి యెవరు పోవుదురే? "ఊరిలోఁ బదిమంది సభ్యులున్నారు. ఈ పదిమందియు నీమాటవిందురని నాకుఁ దెలియును. ఊరు నా మొఱ వినకున్నచో నేనుపోయి సభలోఁ జెప్పికొందును. ఇందులో నేను చేసెడి తప్పులేదు. కరవాలభైరవుని బద్దన్న గెలిచినచో నది నేను చేసిన గెలిపింపు. వీరశైవులమీఁద కలిగిన యీ గెలుపు ఒక్క శైవులదే కాదు, వైష్ణవులది, బ్రాహ్మణులదియునగును. అన్ని వర్గములవారికి బద్దన్న మేలు చేసెను" అని బాదమ్మ చరచర నడచిపోయెను. తిప్పన్న

నివ్వెరపోయి చూచుచుండెను. తిప్పన్నకు మొదటి భార్యవలన నిద్దఱు కూఁతుండ్రును, ద్వితీయభార్యవలన నొక కొడుకును కలరు. కూఁతులిద్దఱు కాఁపురమునకుఁ బోయిరి. కొడుకు మేనమామల యింటివద్ద నుండెను. తనకుఁ గూడు వండిపెట్టు దిక్కు బాదమ్మ యొక్కతెయే. అతనికి ననుమానము, ననుమానము లేదు. బద్దన్న చిన్నవాఁడు. అతనికి బాదమ్మకు సంబంధ ముండునా? బాదమ్మ కాఁపురమునకు వచ్చినప్పటినుండియు మంచి మనిషి యనిపించుకొనుచుండెను. ఇప్పుడు బాదమ్మను గుఱించి యీ మాట చెప్పినను నెవ్వరు నమ్మరు. బాదమ్మ బద్దన్నకంటె పదేండ్లు పెద్దది అయినను బాదమ్మ యౌవనము చెడలేదు. తానా వృద్ధుఁడయ్యెను. తన, తన భార్యల నడిమి యీడు వాసి తిప్పన్నకు సందేహము కలిగించెను. అప్పటి కేమి చేయుటకు పాలుపోలేదు.

బాదమ్మ చేరునప్పటికి బద్దన్న స్మృతిలో నుండెను. బాదమ్మ మొగము విషాదపూరితమై యుండెను. ఆమె మొగములో సహజమైన యుత్సాహము లేదు. బద్దన్న చూచెను. అట్లుండుటేమని యడిగెను. ఆమె యేమియు లేదనెను. బద్దన్నయైన నిముసము లాగి యేదో మనస్సునకుఁ దగినట్లు సూచించి మఱికొంతసేపైన తర్వాత నీవు వచ్చుట మానివేయుమనెను. బాదమ్మ నీ కిష్టము లేనిచో నట్లే యనెను. బద్దన్న మొగము గంభీరించెను. నా కిష్టము లేకపోవుటయేమి? తిప్పన్న కిష్టము లేకపోయినచో, నీకుఁ దిప్పన్నయే కావలసినచో మానివేయుమనెను.

ఆ మాట యనిన వెంటనే బద్దన్న శరీరములోని రక్త

వంతయు నొక్కసారి కళవళ కాఁగెను. బుగ్గమీఁది గాయము వెంటనే మఱల పగిలి పట్టీ యెగిరిపోయి నెత్తురు స్రవించెను. బాదమ్మ తొందరపడెను. బద్దన్న తండ్రిని పిలచెను. మఱల శస్త్రవైద్యుఁడు వచ్చెను. కట్టు కట్టెను. ఆ రాత్రి బద్దన్నకు మఱల జ్వరము వచ్చెను. మఱల కలవరింప నారంభించెను.

బాదమ్మ తా నింటికిఁబోయెను. తిప్పన్న యామెతో మాట్లాడలేదు. ఆమెకు నిదుర పట్టలేదు. మంచముమీఁదఁబడి పొర్లాడు చుండెను. బద్దన్న యందగాఁడు కాఁడు. అందగాఁడు కాకపోలేదు. తనకు బద్దన్నమీఁదఁ గోరిక కలదా ? లేదని చెప్పుటకు వీలు లేదు. ఉఱుముఱిమినగాని భూమినుండి యొక యంకురము బయలు దేరనట్లు ఆ యుఱుమువి యుఱుమునకు, ఈ మొలవని యంకురమునకు, నా రెంటియొక్క సమకాలిక ప్రాదుర్భావ సమయపూర్వము, సూక్ష్మత్వము కట్టక పూర్వము మనోవిషయికమైన, నిసర్గప్రకృతిగతమైన, యొక సంబంధమువలె, బద్దన్న యీమాట యనకపూర్వము దానిని బట్టి తన మనస్సులో నున్నదేమో యను సందేహపూర్వకమైన కోరికని గూర్చిన యూహ పుట్టకపూర్వము, వారి పరస్పర హృదయాంతరములలో మనస్సును స్పృశించని, రక్తవిలీనమైన యీ కోరిక ప్రకృతి సిద్ధముగా నున్నది కాబోలు. అతనిలోనో, కోరిక యింత దట్టముగా నున్నదా ? ఒక్కసారి నెత్తురంతయు పొంగి యుబికి మూఁడ్నాళ్ళ ప్రాఁతఁబడిన గాయమును పెల్లగించినదే. ఇంతకుఁ బూర్వ మొక్కసారి గూడ లేశమాత్రముగనైన నీ కోరిక స్వీకరింపఁబడలేదే. బద్దన్న పసివాఁడు. బద్దన్నకు యౌవనము తొంగిచూచుచున్నది. పసివాఁడేమిటి !

ఇఱువదిరెండేండ్లవాఁడు. యౌవన ప్రాదుర్భావము కలిగి నాలు గేండ్లయినది. తండ్రి యెన్నిసార్లు వివాహముచేయుదు నన్నను తానంగీకరించలేదు. ఇది యంతయు తనమీఁది ప్రేమచేతనా? తాను తనకన్న పదియేండ్లు పెద్దది. తన్నతఁడు ప్రేమించునా? తా నైనచో నక్కఁగా రగును. తల్లి యగును. ఈ యీడు భేదముతో నతని కోర్కె తనమీఁదనుండునా! మఱి తనకెట్లుం డెను! తనకున్నదా! లేనిచో నీ విచారణ యెందులకు! ఇప్పుడు చూచినచో నిదివఱకతఁడు తనయందు ప్రవర్తించిన ప్రవర్తన యంతయు నీ కోరిక కనుగుణముగాఁ గనిపించుచున్నది. పూర్వ మిట్లు తోఁచలేదేని యెందుకుఁ దోఁచలేదు! తోఁచీతోఁచనట్లు తోఁచెను. కాని యా భావము వ్యక్తముకామి, నది యట్లు పరామర్శింపఁ బడలేదు. ఆ భావపు టెల్లనుండి యెప్పు డది తొలఁగింపఁబడెను? ఇన్నాళ్ళుగా వ్యక్తముచేయని బద్దన్న యీ నాడేల యనెను! బద్దన్న కిదివఱకు ధైర్యములేదు. ఇప్పుడు వచ్చెను. ఇప్పుడేల రావలయును! ఇదివఱకు విద్య నేర్చుకొను చున్నాఁడు. తాను నేర్చిన విద్యలోఁ దాను గట్టివాడ నని తెలి యును. ఆ విద్యకుఁ బూర్వము ప్రకటన లేదు. ఇప్పుడు కరవాల భైరవుని సంహరించుట, యుద్ధములో నేయిమంది శూరులను సంహరించిన జగజ్జెట్టి కెంతధైర్య ముండునో యంతధైర్యము కలిగెను. తాను మహావీరుఁడు. తనకోర్కె నియటపెట్టుటకుఁ దగిన నిద్రాతనము, బలము మనస్సునకుఁగలిగెను. కాని నెత్తురు పసినెత్తురు. ఒక్కసారి యుఱికెను. అతని మనస్సునకుఁ గలిగిన ద్రఢిమకు, నెత్తురులోని లేతదనమునకు, సరిపోలేదు. బాదమ్మ ప్రకృతి కొంత పచ్చియారెను. అతని నెత్తురులోని పచ్చి యార

లేదు. ఈ స్థితిలో తన్నతఁడు ప్రేమించునా? ఇట్టి ప్రేమను నీ దేశములోఁ గొనసాగుదు కలుగునా! ఈ చర్చ యెన్ని పరిషత్తులు నిర్ణయించవలయునో! ఒకఁడా పరిషత్తు! మొదట యూరు, తర్వాత సభ; మఱియు మఱియు గలవు.

మఱికొంత సేపటికి బాదమ్మ యిట్లూహించెను. తాను బద్దన్నను ప్రేమించరాదు. అతఁడు కుఱ్ఱవాఁడు. పైకిరాఁదగిన వాఁడు. సేనానాయకుఁడు కాఁదగినవాఁడు. ఈ జయములో నత డెంత పైకి వచ్చినను వచ్చును. తనతోడి కూటమి యతని శీలమును మచ్చపఱచును. అతనికి రాఁదగిన వృద్ధిరాదు. జనము చెప్పుమాటలనుబట్టి చూచినచో నతఁడు దేశమునకు స్వాతంత్ర్యముఁ దెచ్చు నూహతో నున్నట్లున్నాఁడు. నాకు నతనికి సంబంధము కలిగినచో లోకమున కతని నాయకత్వముమీఁద గౌరవభావమునకు భంగము కలుగును. తిప్పన్న వృద్ధుఁడయ్యు, గోపి యయ్యు మర్యాదగా బ్రతికినవాఁడు. తన కిది న్యాయము కాదు. బద్దన్న యేమి యౌవనముకలవాఁడు! కండలు తిరిగిన దండలు, కన్ను తెఱచినచో సింహము.

## 3

బద్దన్నకు నిమ్మదించి మఱల లోకములో బడునప్పటికి రెండుమాసములు పట్టెను. అతఁడు తన కారోగ్యము చేరినది మొదలు నిద్రపోలేదు ప్రతిదిన మేదో గ్రామము పోవును. బండ్లుకట్టుకొని తన్నెక్కుడుమంచు వచ్చిన యానాఁటి యందఱి నామములు తెలిసికొనెను. వారి యందఱిని పోయి కలసికొని రహస్యముగా మాట్లాడును. ఈ పనిలో బద్దన్నకు రహస్య

మిత్రులు చాలమంది యేర్పడిరి. రహస్యప్రచారకు లేర్పడిరి. ప్రతి గ్రామములోను ఎవరో యొకరిద్దరు బద్దన్న కనుకూలురు కలుగుటయు, వారు తక్కిన గ్రామస్థులను మార్చాడుటయు, రహస్యసభలు చేయుటయు—వానిలో ప్రతి గ్రామమునందును నే గొడ్లసావడిలోననో, యొకరాత్రివేళ పొలముమీదనో ప్రథమ సమావేశములు జరుపుదురు. ప్రతిప్రథమసమావేశమునకు బద్దన్న పోవలయును. ఈ రీతిగా బద్దన్నకు నిదురించుటకు వీలు లేకపోయెను. నేడు దగ్గఱియూరు పోవలయును. రేపు దూరపుటూరు పోవలయును. దీనికితోడు బద్దన్న కారోగ్యము చేసినప్పటినుండి పశ్చిమ చాళుక్యరాజభటులు పదిదినముల కొకసారి బద్దన్న జాడలు తీయుచుండిరి. సరిగా వారేనాడు తన గ్రామమువత్తురో యది తెలిసికొని యానాటికి తన గ్రామములో నుండవలయును. విజయవాటము ఒక రాజప్రదేశము. ధనదపురము వెలనాటి చోళులరాజధాని. చేబ్రోలు మఱియొక రాజప్రదేశము. ఈ మూడు ప్రదేశములయందు పశ్చిమచాళుక్య సైన్యము కొంత నిలువయుండును. వారు విడవిడతలుగా గ్రామములకు, పల్లెలకుబోయి పశ్చిమ చాళుక్యరాజద్రోహము లేకుండ చూచి వచ్చుచుందురు. ఆ రాజభటులు బద్దన్న గ్రామమైన గోశాలకు వత్తురు. అటనున్న పురాధ్యక్షుడు వారికి నబద్ధములు చెప్పును. కరవాలభైరవుని సంహరించిన నాడు బద్దన్న పలుమందితో బశ్చిమ చాళుక్యులను పారద్రోలెనన్న దన్న వార్త విజయవాటములోని రాజభటులకు, వారినుండి ధనపురములోని రాజభటులకు రహస్యవార్తలు వెళ్ళెను. పదిసార్లు వార్తాయాథార్థ్యము తెలిసికొనుటకు రాజ

భటులు గోశాలనెల్లెడ. అప్పటి గ్రామరక్షకులతో ముచ్చటించిరి. ఆవార్త యథార్థమని యెవ్వరును చెప్పలేదు. చుట్టుపట్లనున్న యే గ్రామవాసులును బద్దన్న యట్లనేనని చెప్పినవారు లేరు. ధవళపురకటకములోని పశ్చిమ చాళుక్యసేనాని కరవాలభైరవుని సంహరించినవారలకు, బద్దన్నను పట్టుకొనవలయునని ప్రయత్నించెను. అది వీరవైష్ణవ శైవుల యొక్క కలహ సంబంధి విషయము. ఈ మతవైషమ్యమునకు, రాజకీయములకు ముడి పెట్టినచో నానాటి దేశమంతయు, రెండేఱుల నడిమిదేశమంతయు, వేంగినాడంతయుఁ గ్రొత్తగా రాజకీయ విప్లవమునందు మునిగిపోవు నని భయపడిరి. అందుచే నూరకుండెను. కాని బద్దన్న నెట్లు పట్టుకొనవలయునా యని ప్రయత్నించుచుండెను. విజయవాటము నందలి రాజభటులును, వారిపై నధికారియు సేనాని కెట్లు తెలియజేసిరి. తగినంత సైన్యము లేకుండ బద్దన్నను బట్టుకొనుటకుఁ బోరాదు. గోశాలయు చుట్టుపట్లనున్న గ్రామములును బద్దన్నను బంధింపనీయవు. విజయవాట మంతయు నెదురు తిరుగును. తగినంత సేనాబలము లేక యీపని జరుగదు. సేనాని నాలుగువేల సైన్యమును పంపింపవలయునని తమ రాజునకు వ్రాసెను. అప్పటినుండి సైన్యము రాలేదు. ఈలోపుగా బద్దన్న యేమి చేయుచుండెనో పశ్చిమ చాళుక్య రాజభటులకుఁ దెలియదు. నడిమేరులనాడు, వేంగినాడు, వెలనాడు, ప్రోలనాడు, బద్దన్నను గూర్చిన సర్వవార్తల విషయమున మూగవైపోయెను. ఎక్కడ యేమి జరుగుచున్నదో బహిరంగముగాఁ జెప్పుకొనువారు లేరు. పగటిపూటనే ప్రసక్తియే లేదు. రాత్రులందెచటో సాగించిరి

బోయినట్లు బంధువుల యింటికిఁ బోయినట్లు పొలముమీఁదికిఁ బోయినట్లు కన్పింతురు. మఱియొకప్పుడు ఒక సావడిలో హరికథయందు, భజనలయందును, గారడియందును, పురాణమందును. ఇవి యన్నియు స్థలములు. అచ్చట పౌరాణికు డుండును. చప్పున లోనికిఁబోయినచోఁ బురాణము చెప్పచున్నట్లు కన్పించును. కాని బద్దన్నయో యతని యనుయాయులో నొక్కఁడో, వందమంది తోడనో, రెండువందలమంది తోడనో, రాజకీయములు విచారించుచుండును. ఇట్టి పదిసమావేశములు కలసి యొక సమావేశము; ఇట్లు క్రమక్రమముగాఁ బెంచఁబడుచుండును. ఒక్కొక్క గ్రామమున నేఁబదిమంది కటారికాండ్రు, పది గ్రామములుకలసి యొకదళము. ప్రతియూర నేఁబదిమందికి నొక చిన్ననాయకుఁడు. పదియూళ్లుకలసిన దళమునకు-అనఁగా నైదువందలమందికి నొకదళవాయి. ఏఁబదియూళ్లుకలసిన సైన్యమునకు నొక దుముదారు. నడిమేరుల విషయములోనున్న యీ సర్వసేకకు నొక సేనాని. ఈ సేనాని బద్దన్న. ఈ రీతిగా గ్రామ యోధులు, దళములు, సైన్యములు, మహాసేనయు నేర్పాటు చేయఁబడుచుండెను. బద్దన్న తన యనుయాయుల పదిమందిని వెలనాటి దేశమునకు, పదిమందిని వేఁగి దేశమునకు, పదిమందిని కర్మరాష్ట్రమునకు, పదిమందిని అత్తిలి దేశమునకుఁ బంపించెను. వారందఱు బద్దన్న రెండేరుఁ నడిమివిషయమున నెట్లు సైన్యములను సమకూర్చుచుండెనే యట్లు సమకూర్చుచుండిరి. బద్దన్న తానేపోయి యింకని చేసినచో సులభముగాఁ దెలిసిపోవునని తాను పోలేదు. పైఁగా వెలనాడు దేశమునందు వెలనాటి చోళులు వందలయేండ్లుగాఁ బాలించుచుండిరి. ఆదేశమున మఱి

యొకఁడుపోయి తానుసేనానిననినచో నచ్చటివారికిఁగంటగింపుగా నుండవచ్చును. బద్దన్న శౌర్యపరాక్రమములు రెండేఁబులనడిమి విషయ నివాసులకుఁ దెలిసినట్లుగా, నభిమానహేతువులగు నట్లుగా నితరనాడుల నివాసులకు కావు. అందుచే బద్దన్న యనుయాయు లిట్లు చెప్పుచుండిరి. ఈ సర్వ మహాసేనకు వెల్నాటి చోళభూపతి గొంకరాజే మహాసేనానాయకుఁ డని.

నాదెండ్లలో దుర్జయవంశీయులైన రాజులు పరిపాలించు చుండిరి. వారిలో నాఁటిరాజు దుర్జయమందుఁడు. ఈ దుర్జయ వంశశాఖీయులు నాదెండ్లలోఁ, బ్రధానశాఖయుఁ, జేబ్రోలులో నింకొకశాఖయుఁ బాలించుచుండిరి. చేబ్రోలు రాజుపేరు నంబయ్య. ఇతఁడు కొల్లిపాక పురాధిపతి, శతసహస్రదేశాధిపతి, కృష్ణానదియొక్క దక్షిణతీరమునందున్న మండలమున కీయన యధిపతి. బద్దన్న యాజ్ఞాప్రకారము వాని యనుయాయులు నాదెండ్లచుట్టునను న్న గ్రామములలోని సైన్యమునకు దుర్జయ మందుఁడు సేనానిగను, శతసహస్రవిషయ గ్రామసైన్యమునకు నంబయ్య సేనానిగను చెప్పి చేయించుఁ డని పంపెను. వారు నంబయ్యతో దుర్జయమందునితోఁ గలసికొని బద్దన్ననుగూర్చి మాట్లాడిరి. బద్దన్న యొక్క శౌర్యపరాక్రమాదులు వర్ణించిరి. వారిలోఁ గరవాలభైరవు నెఱుఁగనివారు లేరు. కాకినాఁ రగ కరవాలభైరవుని బద్దన్న తఱిమి తఱిమి చంపుట వారు పూర్వము వినియేయుండిరి. ఇప్పుడు బద్దన్న యనుయాయులు తత్సంహారవార్త సవిస్తరముగఁ జెప్పుటవిని దుర్జయమందుఁడును, నంబయ్యయు సంతోషించిరి. పైఁగా బద్దన్న తాను సర్వసేనాని యగుటకు వాంఛించుట లేదు. తమ దేశములయందలి సేనలకుఁ

దాము సేనానులు. బద్దన్నకుఁ దమ సేనలమీఁద నాధిపత్యము లేదు. మహాసైన్యాధిపతి గోంకభూపతియే. మహాసామంత మండలేశ్వరుఁడైన గోంకభూపతి యధికారము బద్దన్న నివరించుటలేదు. తమ యధికారము కాఁదనుటలేదు. రెండేరుల నడిమివిషయము నాలుగువందల యేఁబది గ్రామముల విషయము. అప్పటికప్పుడే యిఱువదివేల సైన్యము రెండేరులనడిమి విషయమున బద్దన్న యేర్పాటుచేసెను. తాము తమ దేశములోఁ బదివేల సైన్యముకన్న నెక్కువ ప్రోగుచేయ నక్కఱలేదు. అట్లే యని యంగీకరించిరి.

రెండునెలలు గడచు నప్పటికి సర్వదేశములయందును ఈ రహస్యదళములు సిద్ధపడియుండెను. అప్పటివఱకు నీ మహాసన్నాహము గోంకభూపతికిఁ దెలియదు. బద్దన్న కబురు పంపించెను. మందసేనానియు, నంబయ్యసేనానియు పోయి గోంకయ్యను కలసికొనవలయును. ఇట్లు సర్వసైన్యమును సిద్ధపడియున్నదని గోంకయ్యతో రహస్యముగాఁ జెప్పవలయును. బద్దన తనయూరువదలి రాడు. వచ్చినచోఁ బ్రతిపక్షులకు సందేహము కలిగించినవాఁడగును. బద్దన్న ఇంత సైన్యమును సమకూర్చినను నశ్వదళము నెక్కడనుండి తెచ్చును. ఏనుఁగుల నెచ్చట నుండి తెచ్చును? ఏనుఁగులు, గుఱ్ఱములు లేక చాళుక్య చక్రవర్తి దండెత్తివచ్చినచోఁ దానేమి చేయవలయును? అందుచేతఁ గోంకభూపతియు, మందయ్యయు, నంబయ్యయు సాయము తన కవసరము. గోంకభూపతివద్ద నాల్గువేల గుఱ్ఱములు కలవు. వంద యేనుఁగులుకలవు. దుర్జయమండునివద్ద వెయ్యి గుఱ్ఱములు కలవు. కొల్లిపాకాధీశ్వరునివద్ద నెయ్యి గుఱ్ఱములు కలవు.

ఆ ... రుపురివద్దకలసి తొంబదియేన్గులు కలవు. ఈ సైన్య మంతయుఁ గలసినకాని లోను పశ్చిమ చాళుక్యుల నెదుర్కొన లేదు.

దుర్జయమందుడును, నంబయ్యాయు వెలనాటిచోళులకు సామంతులు. వారు పోయి గొంకభూపతి దర్శనముఁ జేసినచోఁ బశ్చిమ చాళుక్య సేనానికి సందేహము కలుగదు. వారుపోయి గొంకభూపతిని దర్శించిరి. ఈరహస్యమంతయు గొంకయ్యతోఁ జెప్పిరి. చెప్పుటలో నీ తిరుగుబాటంతయు బద్దన్న మేధాజనిత మని చెప్పలేదు. బద్దన్ననుకూడ నొక సేనానిగాఁ బేర్కొనిరి. గొంకయ్యకేమి తెలియును. గొంకయ్య తన క్రిందిసామంతు లైన మందయ్య నంబయ్యలను ప్రశంసించెను. ఇంతసైన్యమును సమావేశపరుచుట యెట్లు? ఎక్కడ? ఈ సైన్యమును పోషించుట యెట్లు? ఏగ్రామమునందలి సైన్యమాగ్రామమున నున్నచో సరియే. దళములుగా చేరినప్పుడు కొంత తెలియక మానదు. సైన్యముగాఁ జేరినప్పుడు మఱియుఁ దెల్లమగును. సేనగా నేర్పడి నప్పుడు వీరి నివాస మెక్కడ? వీరి కాహారపదార్థములు సమకూర్చుట యెట్లు? వీరికి వెనుకనుండి సాయము పంపించుట యెట్లు? ఈ విచారణ లేమియు మందయ్య నంబయ్యలు చేయ లేదు. పూర్వము మహాసైన్యమును వెలనాటి చోళులు నడిపించినపుడు ఈ బాధలన్నియు ఆ సామంతులే పడిరి. గొంకభూపతిమీఁద నిత్యము పశ్చిమ చాళుక్య సేనాధిపతి సాక్షిగానుండెను. అతఁడు వీరిని పరామర్శించుటకువీలులేదు. మందయ్య, నంబయ్యలు వీనినిగూర్చి యాలోచింపలేదు.

సైన్యమునకు భోజనాదులు సమకూర్చుటయందును

బద్దన్న ప్రమత్తత వహించలేదు. గ్రామమునకుఁ బుట్టెడు జొన్నలుగాఁ బ్రోగుచేసెను. ఈధాన్యమంతయుకళింగరాష్ట్రము నకు, నుత్తరదేశమునకు నెగుమతిచేయుట యనువీర రాష్ట్రాంతములయందున్న గ్రామములకుఁ జేర్పించెను. అచట నా యా గ్రామవాసులతో సైన్యము లచ్చటికి వచ్చువేళకు భోజనాదుల సమకూర్చుట కేర్పాటుచేసెను.

ఒకనాఁడు బద్దన్న కొప్పాక పోయెను. అచ్చటి పంచములవాడ యంతయు బద్దన్నను చూచుటకు విరుగఁబడెను. బద్దన్న యచట నాల్గుదినము లుండెను. ఆ వాడలోనున్న మేటి మగలైన యెల్లరతో కత్తియుద్ధము చేసెను. అందఱిని కత్తియుద్ధములో నోడించెను.

ఒక ముసలివీరుఁడు బద్దన్న లాఘవము, దెబ్బనొడ్డుకొను నేర్పు, దొబ్బకొట్టుటలో నున్న చొరవ యినియన్నియుఁజూచి బద్దన్నమీఁద మిక్కిలి యభిమానము పొందెను. అతఁడెనుబది యేండ్లవృద్ధు, తాను బద్దన్నతోఁగత్తి యుద్ధము చేయుదునసెను. ముసలివాఁడు దేహముముడుతలుపడి, కూర్చున్నచోటముడుచుకొని కూర్చుండును. అతని కన్నులమీఁదికి రెప్పలు వ్రాలి ముడుతలు పడుచుండెను. అతఁడు లేచి నిలుచుండఁగలఁడాయని పించెను. బద్దన్న యది నవ్వులాటమాట యనుకొనెను. కాని వృద్ధుఁడులేచి గోవతియొక్క కుచ్చెలలు బిగించికత్తిపుచ్చుకొని నిలువఁబడెను. అతని శరీరము వంగియేయుండెను. శరీరము శుష్కించియే యుండెను. కాని కత్తిపుచ్చుకొనిన వెంటనే యాతడానిలుచున్నవైఖరిలోననే యొకమహావీరుని భంగిమయు, కనులయందు ప్రత్యర్థియొక్క గుండియలు త్రవ్వుచున్నట్లు

చూచెడిచూపు ఆశ్చర్యాపాదియయ్యెను. ఈవృద్ధుఁడు వెనుకకు లంఘించఁగలఁడా, ప్రక్కకుదాటుకొనఁగలఁడా! బద్దన్న నవ్వుచుఁ గోల్తలచేసెను. నాలుగైదువరుసలు తిరిగినంతనేబద్దన్నకుఁ దెలిసినది. తానావృద్ధునితాకలేదు. ఆ వృద్ధుని కత్తి తానేమాత్రము పరధ్యానముగనున్నను, అశ్రద్ధగనున్నను తనకాలినో, తొడనో బాహువునో ఛేదించును. మఱల నొకయఱగడియ జరిగిన తర్వాత బద్దన్న బొమ్మ చిరుగాయ మయ్యెను. దండమీఁదఁ గూడ చిరుగాయమయ్యెను. ఇంతలో బద్దన్నకుఁ దెలియకుండ బద్దన్న చేతిలోని కత్తి యెగిరి పదిగజముల దూరమున పడి పోయెను. బద్దన్న దిగ్భ్రాంతి పొందెను. నిలిచినవాఁడట్లే నిలిచిపోయెను. ఒక నిముసము తెప్పిఱిలి బద్దన్న పకాలునవ్వి "తాతా! ఆ కత్తిదెబ్బ నాకు నేర్పు" మనెను.

ఆ నాఁటిరాత్రి తెల్లవారలును, బద్దన్నయు, నా వృద్ధుడును బఱిమీఁదనేయుండిరి. ఆవృద్ధుఁడు ఉత్తర దేశములుగూడఁ జూచెను. కత్తివిద్యలోఁగల మెలఁకువలు, రహస్యములు నొత్తరాహులనుండి నేర్చికొనినవి యీ వృద్ధున కెన్నియో దెలియును. అవి యన్నియు బద్దన్నకు నేర్పెను. ఆ నాఁడు పూర్ణిమ. తెల్లవాఱువేళకు వెన్నెలలు వల్లవారుచుండెను. వృద్ధుఁడు బద్దన్నతో నిట్లనెను. 'తాతా నాకు వేయిమందికిఁ తక్కువ శిష్యులులేరు. వారిలో నీవంటివాఁడొక్కఁడులేడు. ఈ రహస్యములు వారెవ్వరికిఁజెప్పలేదు. నాకువారికిఁజెప్పి ప్రయోజనము లేదు. నేను చనిపోకముందు నీవు కన్పించితివి. నీకు నే నింకఁ జెప్పవలసినది లేదు' అని కత్తితో బద్దన్న భుజముమీఁదఁ గొట్టెను. భుజముమీఁదఁ గొద్దిపాటిగాయము తగిలెను. నెత్తురు.

బయటకువచ్చెను. బద్దన్న నవ్వెను. వృద్ధుడు నవ్వెను. ఇది ఖడ్గ విద్యలో గురువు శిష్యుని ముద్దుపెట్టుకొనుట.

ఆ మఱునాడు బద్దన్న కొప్పాక పంచములవాడలో మూడువందలమంది సైన్యమును ప్రోగుచేసెను. తనవృద్ధగురువు యొక్క శిష్యు లెచ్చటెచ్చటనుండిరో వారందఱను వెదకి వేయి మంది సైన్యమును కొప్పాక పంచములవాడలో నిలువయుంచెను. ఈ సైన్యమును దళముగా విభజించలేదు. అంతయు నొక్క టియే సైన్యము. వారందఱిమీఁద నొక్కడే సేనాధిపతి. ఈ పదమూడు వందలమందికి భోజనాదులకొఱకు బద్దన్న కొప్పాక మహాగ్రామములోనికిఁ బోయి యచ్చటి ధనవంతు లతో నేర్పాటుచేసెను. ఈ యేర్పాటులు చేయుటకు బద్దన్నకు వీలిచ్చెను. కొప్పాక వేంగినాటిలోనిది. తూర్పున కాళింగులు. అనంతవర్మ చోడగంగమహారాజు పశ్చిమ చాళుక్యులు వెల నాటి చోళులను గెలుచుటచూచి గోదావరివఱకు వచ్చి యాక్రమించుకొనెను. అందుచేత పశ్చిమచాళుక్యుల యధి కారము ప్రోలనాడు వెలనాడులమీఁదనున్నంత, వేంగినాటి మీఁదలేదు. వేంగినాడు మధ్యస్థలముగా నుండెను. పశ్చిమ చాళుక్యరాజాధికారుల యాకళింపులేకుండ బద్దన్న యీ పని చేయుటకు వీలిచ్చెను.

బద్దన్న యీ పదుమూడువందల సైన్యమును తన యొక్కని యధికారముక్రిందనే యుంచుటకు, వారందఱకు తనమీఁద లక్ష్యము కుదురుటకు, నొకనాఁటి సాయంకాలమున నొక యెత్తువేసెను. సైన్యమంతయుఁ బదివరుసలుగా నిలువఁ బెట్టెను. వారితో నిట్లనెను. 'మీలో నెవ రైనసరే కత్తి

యుద్ధముచేసి గెలువవచ్చును. నన్ను గెలిచినచో గెలిచినవాఁడు సేనానాయకుఁడగును'అని. ఇట్లన్నతరువాతపదినిమేషములవఱకు నెవ్వఁడును కదలిరాలేదు. అప్పుడొక్కఁడు వచ్చెను. అతనివెంట మఱి పదిమందియు వచ్చిరి. ఆ వచ్చిన పదునొకండుగురును ఆచుట్టుపట్ల గొప్ప కటారికాండ్రుగా ప్రసిద్ధిగాంచినవారు. వారిని మించినవారు వేఁగినాటి విషయమునలేరు. తొలుతటి సారి ముందునకువచ్చినయాతఁ డిట్లనెను. అతనిపేరు బుంగయ్య. "బద్దన్న! నేను నిన్ను గెలిచినచో నేను దళవాయినికాను. దళవాయి కుండవలసిన గుణములు నావద్దలేవు. నీవలె నే నింత సైన్యమును ప్రోగుచేయలేను. దేశము నింత కట్టుదిట్టముగా నడుపలేను. కాని మన గురువునకు నేను మొదటి శిష్యుఁడను. నీవు చివరిశిష్యుఁడవు. మన యుద్ధవిద్యలో వాఁడిచూపింపు"మనెను. ఇద్దఱును యుద్ధముచేసిరి. ఒకజాము గడచెను. తగిలినచోఁ గొద్ది దెబ్బలు బద్దన్నకుఁ దగిలెను కాని బుంగన్నకుఁ దగులలేదు. బద్దన్నకు బుంగన్నమీఁద చాల గౌరవ మేర్పడెను. తా నతనిని గెలువలేనని వదలిపెట్టినచో బుంగన్న యేమియు ననుకొనఁడు. కాని తక్కినవారి దృష్టిలో తాను కొంచెముపడిపోవును. అట్లగుట తాను చేయఁబోవు మహాకార్యమునకు లోకువైనపని. అప్పుడు బద్దన్న కోపము తెచ్చికొన్నట్లు నటించి యిట్లనెను. 'బుంగన్నా! నేనెల్లవేళల నిచ్చట నుండుటకు వీలులేదు. నేను లేనప్పుడు · నీ సైన్య మంతటిమీఁదను నాతరువాతిదళవాయిని చేయుచున్నాను. నీవు శత్రుఁడవైనచో నీ శిరస్సు [illegible] కన్ను తెరచి నంతటిలో నరకియుందును. కాని నీవు నాకు మిక్కిలి నేస్తుఁడవు. సేనానాయకుఁడనైన నాతో నీవు యుద్ధము

చేయుటకు వచ్చుటయేతప్పు. దీనికి నిన్ను శిక్షించవలయును. నీ తల నెగురవేయవలయును. నీవు చనిపోయినచో నాకుఁ గుడి భుజముగా నుండఁదగినవాఁడు లేడు. వీరునకుఁ దన తల యెటువంటిదో తన చేతిలోని కత్తియు నటువంటిదే. ఇదిగో నీకత్తి నెగురవేయుచున్నాను' అని యా వృద్ధునివద్ద నేర్చిన యొడుపుతో బుంగన్న చేతిలోని కత్తి నెగురవేసెను. ఆ కత్తిపోయి బదిబారలదూరమునఁ బడెను. పడినవెంటనే బద్దన్న బుంగన్నను కౌఁగిలించుకొని "చెలికాఁడా, నేనీ యూరిలో నుండుటకు వీలులేదు. నీ వెప్పుడెప్పుడెట్లు చేయవలయునో వార్తలు పంపించుచుందును. మన యీ సైన్యము రాఁబోవు యుద్ధములో నెచ్చట పెద్దసైన్యము లోడిపోవునని యనిపించునో యచ్చటికి సాహాయ్యము చేయుటకు మాత్రమేపోవును. ఈపదమూఁడు వందల మందియు మనకులమువారు; పంచములు. ఈ సైన్యములో చతుర్థకులజుఁ డొక్కఁడేయుండెను. అతఁడు మనగురువునకు శిష్యుఁడు. ఆయనతో మనకు పొరుపులేదు. మనయందఱికి నొకగురువు విద్య. ఆ గురువును మించిన కత్తి జోదు ఈ పదివిషయములలో లేడు. మనసైన్యమునకు 'హనుమదళ'మని పేరు పెట్టుచున్నాను. ఈ హనుమదళమునకు బుంగన్న సేనాపతి, నేను మహాసేనాపతిని.

ఈ విచిత్రమైన సన్నివేశముతో బుంగన్న బద్దన్నకు భక్తుఁడైపోయెను. తక్కిన బంటులకు బద్దన్న దేవుఁడైపోయెను. ఆ నాఁటి సాయంకాలమున బద్దన్న గోశాలకుఁ బ్రయాణమయ్యెను. అతనిమనస్సులో కొప్పాక వచ్చినప్పటినుండియు నొక యూహకలదు. అది చేయుదమా, వలదా యని యున్నా

ళ్ళలను అతఁడు సందేహపడుచుండెను. చేయకుండఁగనే పోవలయునని నిశ్చయపరచుకొనెను. కాని యతనికిఁ దెలియకుండ నది చేయుటయు జరిగెను. ఆనాఁడు బాదమ్మతోఁ దానామాట యన్నతర్వాత బాదమ్మ తనయింటికి రాలేదు. తాను బాదమ్మను చూడలేదు. తదాది తా నాయూరియూరు పోవుటయే. గోత్రాలలో నున్న దినముల సంఖ్యయే తక్కువ. ఆ తక్కువ దినములలోఁగూడ బాదమ్మ కనిపించుటకుఁ దగిన వేళ లేదా! బద్దన్న కొక సందేహము. మనస్సులో భయము. తా నన్న మాటకు బాదమ్మకుఁ గోపము వచ్చెనేమో! తిప్పన్నతోఁ జెప్పెనేమో! ఇన్నాళ్లు తనను బిడ్డవలె చూచిన బాదమ్మగూర్చి తా నట్లనవచ్చునా! పదుమూఁడు పదునాలుగేండ్లనుండికూడ బాదమ్మమీఁద తన కీభావము కలదు. అది యామె కెట్లు తెలియును! ఇఁక నామె తనతో మాటాడదు. తన మనస్సులో నామెమీఁది యీ భావము తనకుఁ బోదు.

బద్దన్న తనకుఁ దెలియకుండ బాదమ్మ తండ్రి యింటికిఁ బోయెను. మరల బాదమ్మను కలసికొనినప్పుడు మీ పుట్టింటి వారిని చూచివచ్చితి నని మాటాడవచ్చు నని యతనియూహ. లేకపోయినచో నేమి మాటాడును? నీ! నీవు నాతో మాటాడి వల దన్నచో నేమిచేయుదు? అప్పుడిది యొకవంకగాఁ బనికి వచ్చును. ఈ యూహతో నామె పుట్టింటికిఁబోయి తండ్రితో మాటాడెను. తాను బాదమ్మను చూచి నాల్గు నెలలైనను ఆమె సుఖముగానే యున్నదని చెప్పెను. ప్రొద్దుగుంకు వేళ బద్దన్న కొప్పాక వదలి పోవుచుండెను.

౪

బద్దన్న యింటికివచ్చి తాను దుర్జయమందునికొఱకు, నంబయ్యకొఱకుఁ, గొంకభూపతికొఱకు పంపించిన మనుష్యులు వచ్చిరేమోయని విచారించెను. వారప్పటికి రాలేదు. బద్దన్నకుఁ దేళ్ళు ప్రాకినట్లయ్యెను. ఈ విషయములో నాలస్యమైనకొలఁది రహస్యము బయటపడునేమో యని, బయటఁ బడినచోఁ బ్రయత్నమంతయు వ్యర్థమగు నని యతఁడు భయపడసాఁగెను. తన జీవితమునుగుఱించి యతనికి భయము లేదు. దేశస్వాతంత్ర్యమునుగూర్చి మఱల నంత ప్రయత్నముచేయువారు తొందరలో దొరకకపోవచ్చును. ప్రజలకు విశ్వాసముగల సేనానాయకుఁడు లభించుట కష్టము. తనయదృష్టమువలన కరవాలభైరవుని సంహారముతోఁ దనయెడఁ బ్రజల కట్టి విశ్వాసము గుదిరెను. రెండేరుల నడిమి దేశమువారును, వేంగినాటివారును, శతసహస్రవిషయమువారును తా నెట్లు చెప్పిన నట్లు చేయుదురు. శతసహస్రవిషయమున కృష్ణదక్షిణపు టొడ్డు నంటియున్న సగము దేశమునందే తనకుఁ బలుకుబడిగలదు. ఆ పలుకుబడియు చెదిసగముగా నుండెను. తత్ప్రాంతీయులకుఁ దనయందు కొంతవిశ్వాసముకలదు. తక్కిన సగము తమ మండలాధీశుఁడైన నంబయ్యయందు విశ్వాసము కలవారు. నంబయ్యయు, దుర్జయమందుఁడును తన కనుకూలురు కానిచోఁ గొంకభూపతికిఁ దనయందు విశ్వాసము కలుగదు. తాను పంపించిన మనుష్యులు రాలేదు.

తానేపోయి వారిని కలసికొందునా యనిపించెను. బద్దన్న వారివద్దకుఁ బంపించునప్పుడు తినకుబస్సుబను సంక్షేపించ

లేదు. ఇద్దఱు చతుర్థకులజులు. ఒకఁడు బ్రాహ్మణుఁడు. తనకులస్థులను పంపించినచో వారి కనుమానముగా నుండునేమో యని యట్లు చేసెను. తానే స్వయముగాఁ బోయినచోఁ బశ్చిమ చాళుక్య సేనాని విక్రమభల్లాలుఁడు తన్ను పట్టుకొనునేమో! బద్దన్న మనస్సులో నున్న యింతటి యాందోళనము కుదించుకొని యూరకుండెను. అతఁడు తాత్కాలికముగా నిర్వ్యవసాయుఁడయ్యెను. అయినది మొదలు మనస్సు బాదమ్మమీఁదికే ప్రసరించెను. బాదమ్మను పోయి కలిసికొనుట యెట్లు! ఆమె తనమీఁద గోపముగా నున్నదో లేదో తెలిసికొనుట యెట్లు! ఆమెకుఁ గోపమే వచ్చినచోఁ దన జీవితమంతయు వృథాయగునట్లు తలఁచెను. తాను బాదమ్మను కామించుట చాల విచిత్రముగా నుండెను. ఇది దేవతలు మెచ్చరు. మనుష్యులు మెచ్చరు. ఎవరు మెచ్చినను, మెచ్చకున్నను బాదమ్మ మెచ్చిన చాలునని పించెను. ఆ బాదమ్మయు మెచ్చినట్లు లేదు. తాను వ్యాధిగ్రస్తుఁడై యుండి యిప్పటి పేరమవస్థలోఁ దనకోర్కెను జారవిడిచెను. తన కట్టివ్యాధి రానిచోఁ దా నామాట యనుటకు సాహసించెడివాఁడు కాఁడు. తన కా ధైర్యము కలిగెడిది కాదు. తనకోర్కె వ్యక్తీకరింపఁబడకుండ జీవితములోని యుత్తమభాగమంతయు వ్యర్థమైనను అయియుండెడిది. మంచికో, చెడ్డకో తన కోర్కె బయటఁబడెను. కానున్నది కాకమానదు. తనకు బాదమ్మతోడి సౌఖ్యము వ్రాసియున్నచో నామెకుఁ దనయెడల ప్రసన్నత కలుగును. లేనిచోఁ దనకు వ్యాధి రానట్లే, తన కోరికను తెలియచేయనట్లే.

బాదమ్మతో నెట్లయిన కలిసికొనవలయు నని బద్దన్న

బాదమ్మ యెచ్చటెచ్చట నుండెనో వచ్చి చిక్కి పోఁగొట్టెను. ఆమె కనిపించరాని స్థలములయందెల్ల కనిపించును?

బద్దన్న తండ్రి కొడుకుసంగతి యంతయుఁ జూచుచుండెను. తండ్రికిఁ గొడుకు మనస్సులోని బాదమ్మ కనిపించదు. కాని ఆ బాదమ్మ వలనఁ గలిగిన మనోవికారమంతయుఁ గనిపించుచునే యుండెను. ఈ వికారము కామజన్యమా? రాజకీయ వ్యవహారసంభూతమా? కామజన్య మనుకొనుటకుఁ దండ్రికి యాధారము కనిపించలేదు. తనకొడుకు బాదమ్మమీఁదఁ గోరిక కలదని తండ్రి యెట్లనుకొనును! ఊరిలో మఱియొకఁడు మాత్ర మెట్లనుకొనును? ఒక్క తిప్పన్నమాత్ర మనుకొనెను.

తండ్రికి భయముకలిగెను. తనకొక్కఁడే కొడుకు. తల్లి లేదు. మహావీరుఁడు. ఈ రాజకీయములలోఁ దగుల్కొనెను. తన కొడుకుఁ దనకు దక్కునా! ముక్కుపచ్చలారని వాఁడి యీడులో నింతటి రాజకీయవ్యవహారము లెందులకు! కొడుకుతో నొకసారి యనెను! "బాబూ! పూర్వము మనకులములో నెవరైన సేనానాయకులైనచో రాజులు చేసిన సేనానాయకులు. కొట్ట మొదట బంటులుగాఁ జేరి యుద్ధములలోఁ దమ శౌర్యమును చూపించి రాజుల మెప్పులుపొంది దళవాయులు నైనారు. ఎంత మంది యైనను, దళవాయులే యైరిగాని, సేనానాయకులైన వారు లేరు. సేనానాయకులైనవారి సంఖ్య కొద్ది. సేనానాయకులు మనకులములో లేనేలేరు. నీవు మొదలుపెట్టుచునే సేనానాయకుఁడ వగుచున్నావు. నాయన!" బద్దన్న యిట్లనెను. 'అయ్యా! నేను ఈ యుద్ధమైపోయిన తర్వాత పశ్చిమ చాళుక్యులనుండి యీ మన తెలుఁగుదేశము సముద్ధరించిన

తర్వాత నాకీ సేనలతోఁ బనిలేదు. అప్పుడు సామాన్యభటుని వలెనుందును. నా శౌర్యమునకు మెచ్చి నన్ను సేనానిని చేయు స్వతంత్రరాజే లేనప్పుడు నన్నెవరు చేయుదురు! నా యంతట నేనే కావలయును." అప్పుడు తండ్రి యిట్లనెను. "బాబూ! యింతపెద్దపని నెత్తిన పెట్టుకొంటివి. ఇది కొనసాగునో లేదో! ఈ రహస్యము శత్రువులకుఁ దెలిసినచో నీవే మగుదువో యని భయముగా నున్నది." అనఁగా బద్దన్న నవ్వి "అయ్యా! కరవాలభైరవుని చేతిలోఁ జనిపోయినచో నే మయ్యెడిది" యనెను. తండ్రి మఱల మాటాడలేదు.

బద్దన్న బాదమ్మకొఱకు బాదమ్మ కనిపించు నేమో యని పొలములవెంటఁదిరుగ నారంభించెను. పగటిపూట బద్దన్నతో నెవ్వరును మాటాడరు. అతఁడు యుద్ధవిషయములాలోచించుచుండు నని యందఱియూహ. గోశాలకు దక్షిణపు దిక్కున నర్ధగవ్యూతి దూరములో కృష్ణానది ప్రవహించుచుండెను. అది వేసంగి యగుటచేత కృష్ణ నీటిపాయ మఱి యొక్క యర్ధగవ్యూతి పోయినగాని లేదు. ఈ నడుమ నెప్పుడును లంకలు పెట్టును. ఒకలంక జనము లెఱిఁగియున్నప్పటి నుండియు నట్లేయుండెను. ఆ లంకమీఁద దున్ని పైర్లు వేయుదురు. ఆ లంకలోఁ గొంతభాగము తిప్పన్నది. అతనిపొలములో పుచ్చకాయలు సమృద్ధిగాఁ బండును. లంకలోఁబడమటి దిక్కు తిప్పన్నది. దూర్పుదిశ యూరిలో నితురులది. తూర్పు కొనయందు బద్దన్న తండ్రికి నొకయెకరము మేఱ యుండెను. అందులో బద్దన్నతండ్రి మొరపతోఁట వేయును. వేసఁగిలోఁ గూరలపాదులు పెట్టును. ప్రొద్దుట, మాపటు కాపిడి

కట్టుకొని కృష్ణపాయనుండి నీరుతెచ్చి పాదులకుఁ బోయు చుండును. ఇది ప్రతియేటఁ జేయుపని. ఈ యేడాది మాత్రము మూ యెకరములో నఱటిపిలక లంటించెను. అఱటితోఁట కొంచెము పెరిగి కొన్ని మొక్కలు, పూవులను వదలెను. ఈ తోఁట నానుకొని యొక పెద్దరావిచెట్టుండెను. పాతిక ముప్పది యేండ్ల చెట్టు. లేతపారుచెట్లవలె గుబురుగా నుండి క్రింద చల్లగా నుండును. బద్దన్న వేసంగిలో మధ్యాహ్న వేళలయందు పోయి యాచెట్టుక్రిందఁ గూర్చుండుట యుండెను. తోఁటకుఁ కాపలాకూడ నున్నట్లుండెను. బద్దన్న యీ సంగతియే మఱచి పోయెను. నాల్గునెలలనుండి తాను జరుపుచున్న రాజ్య కార్యములలో వేసంగి వచ్చినట్లే యతనికిఁ దెలియలేదు. పొలములవెంటఁ దిరుగుచుండఁగా నతనికి వేసంగ వచ్చిన దని యనిపించెను. తమ యఱటితోఁట చూచిపోవలయు ననిపించెను. అప్పుడు రావిచెట్టు జ్ఞాపకమునకు వచ్చెను. బయలుదేరి పోయి రావిచెట్టుక్రింద కొంతసేపుండెను. దొరికినచో నొక పుచ్చకాయ తినవలెననిపించెను. లంకలోఁ దూర్పుభాగమంతయు వెదకెను. ఎవరు పాదెచ్చుటను కనిపించలేదు. తిప్పన్న పొలములో నుండెను. పోయి యొకటి కోసి తెచ్చికొనవలయు ననిపించెను. తాను పోయి కోయవచ్చునా? ఇదియేమి యూహ! పూర్వ మెన్నిసార్లు పోయి కోసికొని తినలేదు? పల్లెటూండ్లలో నీ భేద మేమున్నది? బద్దన్నకిప్పు డట్లుసపించలేదు. నాల్గునెలల క్రిందటి వఱకు బద్దన్న యొక కుఱ్ఱవాడు, నేఁడొక సేనాని. ఆ గ్రామమునకే కాదు, విజయవాటపురమునందు, రెండేఱుల నడిమి విషయమునందు, వేంగినాటియందు తా నొకమహాపురుషుఁడు.

తాను పోయి మఱియొకని పాలములో కాయఁగోయరాదు. తత్కాలమున, తత్కాలయోగ్యపరిస్థితులవలన నతని మనస్సు నకుఁ దానొక గొప్పపురుషుఁడన్న భావము, తదనుగుణ గౌరవభావము కలిగెనే కాని, యతని వయస్సులోని చిన్నతన మెచ్చటికిఁబోవును? మనస్సు వలదనుచున్నను, కాళ్ళు పుచ్చ తోఁటవద్దకే లాగెను. పుచ్చతోఁటలో నెవరో యున్నట్లు కని పించెను. మఱికొంత దగ్గఱకుఁబోగా నా యున్నది స్త్రీ యని పించెను. పోనుపో నా స్త్రీ బాదమ్మ యనిపించెను. బాదమ్మను చూచినంతనే యతఁడు వెనుదిరిగిపోవలయు నన్నభావము కలుగు టయుఁ, దిరుగకుండఁగనే తిరిగితి ననుకొనుటయు, వెనుదిరిగి పోవుచున్న కొలఁది బాదమ్మను సమీపించుట యేమో యని యాశ్చర్యపడుటయు జరిగెను. సమీపించిన బద్దన్నను బాదమ్మ చూచెను. ఆమె దిగ్భ్రాంతయై నిలచి పోయినట్లు కన్పించెను. ఇతఁడును దిగ్భ్రాంతుఁడై నిలచియుండెను. రెండుజాముల ముందుకుంచె వారి యిద్దఱి మొగములయందు, నొడళ్ళయందు చెమటపట్టించెను. బద్దన్న నిలచియున్నవాఁడు నిలచియున్నట్లు సిగ్గుపడెను. భయపడెను. అతని నోటివెంట మాటరాలేదు. కరవాలభైరవుని కడుసనిలచి "ఓయీ! నిన్ను విజయవాటమువద్ద నఱికెద"నని సింహనాదముచేసిన బద్దన్న, నాల్గువందల యూళ్ళలో వందలు వందలుగా జనము సహా నేకమైన సభలలో నిలుచుండి దేశముయొక్క స్వాతంత్ర్యమును గూర్చి యుపన్యసించిన బద్దన్న, మొన్న కొప్పాకలోఁ బదు మూఁడువందలమంది రాటుతేలిన సైన్యముముందు నిలుచుండి తన సేనానాయకత్వమును తాను సిద్ధాంతైనపసు వృద్ధా...

యెదుట స్థిరపరచుకొన్న బద్దన్న బాదమ్మ యెదుట నిలుచుండి యొక్క మాట మాటాడలేకపోయెను. బాదమ్మ బద్దన్న వంకఁజూచిన చూపు కోపముగాఁ జూచెనా, పరిహాసముగాఁ జూచెనా, అతనికి మనస్సులో భయము వేసెను. తా నచటి కేఁదుకువచ్చెను? పుచ్చకాయకొఱకు వచ్చితి నని చెప్పునా? అతనిలోనున్న కాముభావము నీవట్లు చెప్పరాద నెను. అట్లు చెప్పినచో నామెముందు తా నొకపసివాఁడుగాఁ గనిపించు నని తోఁచెను. తాను పెగల్చుకొని చివర కిట్లనెను. "నేను మొన్న కొప్పాకపోయితిని. నీ పుట్టింట నందఱును క్షేమముగానేయున్నారు" అని. ఈ మాటలువినుచునే బాదమ్మ పగులఁబడి నవ్వెను. 'ఈమాట చెప్పుటకా సేనానాయకు లిచ్చటికి వచ్చినా' రనెను. ఆ మాటతో, ఆ నవ్వుతో బద్దన్నయొక్క నాల్గునెలల భయము, నాల్గునెలల యనుమానము, నాల్గునెలల బాధ ముప్పాతిక విచ్చిపోయెను. అతఁడును విఱుగఁబడి నవ్వెను. ఇద్దఱును కదిసిముసము లట్లే నవ్వుచు నిలుచుండిరి.

కొంతసేపటికి బద్దన్నకు 'పుచ్చకాయ కోసికొని తిన వలయు ననిపించినది. అందుచేత నిచ్చటికి వచ్చితి' ననెను. బాదమ్మ 'దొంగతనము చేయుటకు వచ్చితి' ననెను. బద్దన్న 'నీవున్నావుకదా, యింకను దొంగతన మేమున్నది!' యనెను. బాదమ్మ యిందులో మాత్రము దొంగతనము లేదా యనెను. బద్దన్న:—నీ మాట నాకర్థమగుట లేదు. బాదమ్మ:—నీవు తిప్పన్న సొత్తును దొంగిలించవచ్చితివి. బద్దన్న:—అడిగి తీసికొనవచ్చితిని. బాదమ్మ :— అడుగుము. బద్దన్న :— అడుగుచున్నాను. బాదమ్మ :— ఎవరిని? బద్దన్న :—నిన్ను. బాదమ్మ :—నే

నీవనను. బద్దన్న:—బాదమ్మవు. బాదమ్మ:—ఏమడుగుచున్నావు? బద్దన్న:—ఎప్పటి కప్పుడే క్రొత్తయా? బాదమ్మ:—ఇదివఱ కనేకసార్లు అడిగినట్లు చెప్పుచున్నావు. బద్దన్న:—ఒకసారి యడుగుట చాలదా? బాదమ్మ:—ఏమడిగినావో తెలియలేదు. బద్దన్న:—తెలియకయేమి? తెలియుట కిందులో నేమియున్నది. బాదమ్మ:—ఏమున్నది? మఱల నడుగరాదా? మఱల నడిగినచో సరిగా తెలియును.

అంత నిద్దఱును కొంతసేపు నవ్వుకొనిరి. మఱల బద్దన్న:—'ఇంతకు పుచ్చకాయ యిచ్చెదవా లేదా? బాదమ్మ:—అదేనా యడిగినది? బద్దన్న:—ఇప్పుడదే యడిగినది. బాదమ్మ:—ఎప్పుడేది యడిగినది?

మఱల నిద్దఱును మఱికొంతసేపు నవ్వుకొనిరి. బద్దన్న:—నేను వెళ్ళిపోవుచున్నాను. బాదమ్మ:—నేనును నీ వెంటనే వచ్చెదను. బద్దన్న:—ఎందుకు? బాదమ్మ:—నీవు కావలెనంటివి. కదా? తీసికొనివచ్చెదను. బద్దన్న:—నా చేతి కీయరాదా? బాదమ్మ:—నీవే తీసికొనరాదా? బద్దన్న:—ఏమిటి? బాదమ్మ:—ఏమో నీకు తెలియవలెను. బద్దన్న:—నాకొక పుచ్చకాయ కావలయు ననుకున్నాను. బాదమ్మ:—ఇంత చేనున్నది నీకెన్ని కావలసిననన్ని తీసికొనవచ్చును. బద్దన్న:—అది యిచ్చెడి మాట కాదు. బాదమ్మ:—అది యెట్లుండును? బద్దన్న:—ఈయదలచిన వారిత్తురు. ఇతరులు మాటలు మాటాడెదరు. బాదమ్మ:—కొందఱు మాటాడి యిత్తురు, కొందఱు మాటాడకుండ నిత్తురు. బద్దన్న:—అయినఁబోనిమ్ము. బాదమ్మ:—నీవు తీసికొమ్ము.

బద్దన్న మాటాడకుండ వెనుదిరిగి పోవుచుండెను. బాదమ్మ నవ్వు వెనుకనుంచి యెల్లమెవలో గంటలసడివలెఁ జైడిగంటలకూతలవలె, బంగరు పిచ్చుకల కిచకిచలవలె, సన్ననిముమ్వల మ్రోతలవలె, కీచురాల నిస్వనమువలె విను పించెను. బద్దన్నపోయి రావిచెట్టుక్రిందఁ బండుకొనెను. అతఁ డిదివఱ కెప్పుడును బాదమ్మతో నిట్లు మాటాడలేదు. బాదమ్మయుఁ బూర్వము నిట్లు మాటాడలేదు. ఈ మాటాడిన మాట లన్నింటికి వేఱే యర్థమున్నదా! తాను వేఱే కల్పించు కొనుచున్నాఁడా! అహో! బద్దన్నయొక్క మనస్స్వరూపము! శౌర్యవిషయమున, పరాక్రమవిషయమున, రాజనీతి విషయ మున, పరిణతమై పండి ప్రౌఢమై యుండెను. స్త్రీ విషయమున పసరు మొగ్గవలెనుండెను. పూపకాయవలె నుండెను. బాదమ్మ మాటాడిన మాటలలోని యర్థములు తన కోరిక కనుకూల ముగా నున్నట్లు భావించును. వెంటనే కాదనుకొనును. అతని యెడదలిలోని నెత్తురు దుడికిపోవుచుండెను. అతని కేమి చేయు టకుఁదోఁచలేదు. కోరిక బాదమ్మనుపోయి కౌఁగిలించుకొమ్మను చున్నది. ముద్దాడు మనుచున్నది. మనస్సు తొందరపెట్టు చున్నది. భయము లేదనుచున్నది. ఇది యిట్లుండఁగా దేహము లోని రక్తము కలవఱపడి యొక భయమును పుట్టించుచుండెను. ఆ భయము తనకోరిక కొనసాఁగ దని చెప్పుచుండెను. 'ప్రతి మాటకు నీవు నీయర్థమును చెప్పుకొనుచుంటివి. తొందరపడి బాదమ్మను తాకినచో నామె నిన్ను విదలించును తిప్పన్నతోఁ జెప్పును. ఊరందఱికిఁ దెలియును. నీవు సంపాదించిన గౌరవ మంతయును నశించును'అని చెప్పుచుండెను. బద్దన్నకు బాదమ్మ

మీఁదఁగోపము వచ్చెను. ఆమె తన్నెందుకుఁ బ్రేమించదు? ప్రేమించినచోఁ దనయంతట నామెవచ్చి నన్నేలఁ గౌఁగిలించుకొనదు. నేనామెను కౌఁగిలించుకొన్నచో, నామె యేమనునో యను భయము నాకుఁగలదుకదా! ఆమె కా భయముండ నక్కఱలేదుకదా! ఆమె యేల వచ్చి కౌఁగిలించుకొనదు? కామవిద్యయందు పరిచయములేని పసిబుద్ధి బద్దన్నను వేయి విధములుగా నిట్లు భావింపఁజేసెను. ఇంతకుఁబూర్వము నాలుగు నెలలనుండి బాదమ్మ యనినచో భయముగా నుండెను. ఇప్పు డా భయముపోయి బాదమ్మమీఁదఁ గోపము వచ్చెను. తనకున్న యంతటి భయమును పోఁగొట్టి మంచిగా మాటాడిన బాదమ్మమీఁదఁ గోపమెందులకు? నిజానికి బాదమ్మ యీనాఁడు తనతో నట్లు మాటాడుట యామె మంచితనమే గదా? తాను గాయపడియున్నప్పుడు తా నన్నమాటకు నామె 'ఛీ! నీమొగము చూడరా' దనవచ్చునే? అట్లనలేదు సరికదా తనతో చమత్కారముగా మాట్లాడెను. ఈ మాత్రము చమత్కారముగా మాట్లాడిన స్త్రీ లందఱును వచ్చి కౌఁగిలించుకొందురా? నవ్వుచు మాట్లాడినంతనే యా స్త్రీకి తనయందు కోరిక యుండునని యెట్లు చెప్పవచ్చును? పుచ్చకాయకోఁతకు పోయినవాఁడు తన కీ మాటలేల? ఆమెయందు తనకింత ప్రేమ యున్నదని యామె కెట్లు తెలియును? తాను చెప్పెనా? తాను చెప్పఁగలఁడా? తన కంతధైర్యము కలదా? అట్టిమాట నోటికి రాఁబోయినంతనే తన యొడలెల్లయుఁ గంపరమెత్తుచున్నదే! నాల్క తడియాఱు చున్నదే! ఇంక నేను బాదమ్మతో మాటాడును. ఆమెతో మాటాడినకొలఁది నా

గుండె చెఱువగుచున్నది. ఆమెకుఁ దేలు కుట్టిన ట్లున్న నేదు. ఆమె పది పదునేనేండ్లనుండి భర్తతోఁ గాపురము చేయుచున్న స్త్రీ. తానేమందగాఁడనియా? ధనవంతుఁడనియా? తన్నామె యేలఁ బ్రేమించును? తన్నామె ప్రేమించినచో నది జారత్వమే కదా? ఆమె కంత నీతిలేదా? ఇంతకును తన్నామె యేల ప్రేమించును. తాను ఖడ్గవిద్యలో నధికుఁడనియా? ఆ విద్యలోఁ గొన్ని మెళకువ నామెయే తనకుఁ జెప్పెను. తాను కరవాలభైరవుని సంహరించెనుగదా! మగవాఁడైనచో నామెయు సంహరించి డివి. కొప్పాకగూడెములోఁ గత్తివిద్య నేర్చిన స్త్రీలు చాల మందికలరు. వారందఱును సైన్యముగాఁ జేర్చినచో నిల్లుండును! పురుషులు యుద్ధములో నోడినతనే శత్రువులువచ్చి దేశము నాక్రమించుకొనుటయేల? స్త్రీలుకూడ యుద్ధము చేసినరు! స్త్రీలనుకూడ గెలిచినగాని దేశము శత్రువశము కాదు. ఇంటింటఁ బ్రతిస్త్రీయుఁ గత్తిదాల్చి నిలచినచో నే దేశమును నింత సులభముగా శత్రువశముకాదు. పురుషు లోడినంతనే, స్త్రీ బాలురందఱు శత్రుసైన్యమునకు లోకువ యగుటయేల! కొప్పాకగూడెము మాత్ర మట్లు శత్రువశము గాదు. అచ్చటి స్త్రీలలో సగానికి సగము యుద్ధము చేయఁగలరు.

ఇట్లూహించుచు బద్దన్న రావిచెట్టుక్రిందఁబడి నిదుర పోయెను. అతఁడెంతోసేపు నిదురపోయినట్లు లేదు. ఒడలంతయు చెమ్మటపోసి ప్రక్కకొత్తిగిల్లుటతో నేదో స్పర్శతగిలి కన్నులు తెఱచి చూచెను. ప్రక్క బాదమ్మ కూర్చొనియుండెను. తన చీరచెఱఁగు వాని మొగమునీఁదఁబడు నెండ సోఁగ నడ్డముగాఁ బట్టియుండెను. అతఁడు కనులు తెఱచినంతనే యామె యతని

మొగములోఁ జూచి నవ్వెను. అతఁడును నవ్వెను. అతఁడు లేచి కూర్చుండెను. అతని ముందొక యఱ్ఱిటాకొసాఁకలో నెఱ్ఱని పుచ్చకాయ బద్దలు కోసి యుంచఁబడెను. అతఁడు బద్దలువంకఁ జూచెను. బాదమ్మ వంకఁ జూచెను. బాదమ్మ నవ్వుచు నొక బద్ద యతని నోటికి నందించెను. బద్దన్న కండకొఱికి నములి గింజ లుమిసెను. బాదమ్మ—అందించినచో కండ కొఱుకగలవు. గింజ లుమియఁగలవు. బద్దన్న:—ఆ, చేయఁగలను.

బాదమ్మ లేచి తాను పోవుచుంటిననెను. అంతకుముందు ప్రసన్నమైన ముఖముతో మందహాసము చేయు బద్దన్న మొగములోనికిఁ గోపము వచ్చెను. ఆమె పోవుచుండెను. బద్దన్న తాను కండకొఱికిన పుచ్చబద్ద యామె వీపునకు వేసి బాదెను. ఆమె వెనుదిరిగిచూచెను; బద్దన్న బాదమ్మని బిగ్గఱగా నఱచెను. అఱచి లేచి నిలుచుండి మిగిలిన బద్దలు కాళ్ళతోఁ దన్ని కృష్ణ నీటిపాయనైపునకుఁబోవుచుండెను. బాదమ్మ యతని వెంటఁబడి పోవుచుండెను. అప్పటికిఁగొంత ప్రొద్దుతిరిగినను కృష్ణయిసుకలు చల్లఁబడలేదు. బద్దన్న కాళ్ళు కాలుచుండెను. బాదమ్మ యిట్లనెను; కృష్ణలోఁబడి చచ్చిపోవుటకుఁ బాయలోని నీరు గొంత లోతైనరాదు. బద్దన్న:—నేను చచ్చిపోను. కావలసినచో నీవు చచ్చిపొమ్ము. నాకు వేఱేపని యున్నది. బాదమ్మ:—ఏమిటా పని! బద్దన్న:—నీ కెందుకు? బాదమ్మ:—నాకుఁగాక మఱియెవరికి!

బద్దన్న నిలుచుండి బాదమ్మవంకఁ దీక్ష్ణముగాఁజూచెను. బాదమ్మ నిశ్చలముగాఁ జూచుచుండెను. బద్దన్న:—నీవు తిప్పన్న భార్యవు. బాదమ్మ:—ఇదివఱకు. బద్దన్న:—ఇప్పుడును. బాదమ్మ:—కానచ్చును. బద్దన్న:—ఇఁక ముందు! బాదమ్మ:— ఇఁక ముందు

మందుటిసుకలు, కృష్ణపాయె. నీ కాళ్ళులు మండుచున్నవి, నా కాళ్ళులు మండుచున్నవి, రావిచెట్టుక్రిందకుఁబోవుదము రమ్మా.

బద్దన్న ముందు నడచెను. బాదమ్మ వెనుకనుండివచ్చు చుండెను. ఇద్దఱును రావిచెట్టుక్రిందికిఁబోయిరి. బద్దన్న చెట్టు నానుకొని కూర్చుండి కాళ్ళు ముడుచుకొని చేతులు కాళ్ళకుఁ గట్టి తన ముందుగాఁజూచుచుఁ గూర్చుండెను. బాదమ్మ యతని కెదురుగా నిలుచుండెను. అట్లు కొంతసేపు గడచెను.

బాదమ్మ:—"నన్నేమిచేయమందువు?" బద్దన్న:—నాకేమి తెలియును. బాదమ్మ:—నామీఁద నీకింత కోపమెందులకు? బద్దన్న:—నీవు నన్ను ప్రేమించుచుంటివా లేదా? బాదమ్మ:—ప్రేమించు చుంటిని.

ఆ మాట వినినతోడనే బద్దన్న బాదమ్మవంకఁ జూచి యూఱకే యేడ్వ నారంభించెను. బాదమ్మ యతని దగ్గఱ కూర్చుండి యెడమచేయి యతని భుజము పైవైచి కుడిచేతితో గడ్డముపుచ్చుకొని 'యెందు కేడ్చెద'వని యడుగ నారంభించెను.

బద్దన్న యేడుపును తమాయించుకొని యిట్లనెను. 'నా జబ్బులోనియొక్క మాటయంటిని. దానికి నీకుఁ గోపమురాలేదా?' బాదమ్మ:—నాకు కోపమును రాలేదు. వచ్చినచో నిన్నుకొట్టుటకు నావద్ద పుచ్చబద్దలును లేవు. బద్దన్న:—నా కిప్పు డెన్ని యేండ్లో తెలియునా? ఇఱువదిరెండేండ్లు. నీవు మా యూరు వచ్చి పదునేడేండ్లయినది. నాకు బన్నెండు పదమూఁడేండ్లు వచ్చినప్పటినుండియు నేను నిన్ను ప్రేమించుచుంటిని. నీవే నా భార్య వనుకొనుచుంటిని. తిప్పన్న యెప్పుడైనను చచ్చియైన పోవును. లేదేని యెప్పుడో నిన్ను తీసికొనివచ్చి, యిదిగో నీ

భార్య, తీసికొనిపొమ్మని యప్పగించియైనపోవు నని యనుకొను చుంటిని. బాదమ్మ:—నేను నిన్ను పదియేండ్లుగాఁ బ్రేమించు చుంటిని. బద్దన్న:—మఱి యేల నాతో చెప్పలేదు. బాదమ్మ:—నీ వేల చెప్పలేదు. బద్దన్న:—నేను చిన్నవాడను. ఏమని చెప్పుదును? బాదమ్మ:—నీవు చిన్నవాడవు, ఏమని చెప్పుదును.

ఇద్దఱును విరుగఁబడి నవ్విరి. క్రిందనున్న దుమ్ము గుప్పిళ్లతోఁ దీసి యెగురఁబోసిరి. గాలికిఁ బోయినది పోగా మిగిలిన దుమ్ము వారి శిరసుమీఁద, మొగముమీఁదఁ బడెను. ఇద్దఱు బదుళ్లుగాఁ గూర్చుండి యొకరియరకాళ్లొకరియరకాళ్లతో నానించి త్రోసికొనిరి. కిలకిలా నవ్విరి. లంకమట్టిమీఁదఁ బరుగులు పెట్టిరి. పరుగులతో నొకరిబుజము లొకరు రాచుకొని త్రోసికొనిరి. ఒకరి వీపు లొకరి కానించి త్రోసికొనుచు వంగి నవ్వుకొనిరి. చివరకుఁ జట్టాపట్టాలు పట్టుకొని కృష్ణ యిసుకలవెంట నడచి పోవచ్చిరి.

౧౫

మఱునాఁడు బద్దన్న కొల్లిపాకాధిపతివద్దను, నాదెళ్ళ రాజువద్దను, గొంకభూపతివద్దకుఁ బంపించిన మువ్వురు రాయబారులు వచ్చిరి. గొంకభూపతివద్దకుఁ బోయిన యాతఁడు బ్రాహ్మణుఁడు. అతని పేరు నన్నయ్య. నన్నయ్య బద్దన్నను రమ్మని కబురంపించెను. బద్దన్న వెళ్ళెను. నన్నయ్యగారి పసువులు కట్టివేసిన సావడిలో నిద్దఱును కలిసికొనిరి. సావడిలో పసువులు మేయుచుండెను. బద్దన్న నన్నయ్యను రెండుగజముల దూరమున గూర్చుండెను. నన్నయ్య ముప్పదియేండ్లవాఁడు.

కత్తిసాము, కఱ్ఱసాము నేర్చినవాఁడు. బద్దన్న విద్యను మిక్కిలి మెచ్చుకొనువాఁడు. కరవాలక్షౌరవృత్తి వధానంతరము బద్దన్న దేవుఁడైనవాఁడు. అతఁడు వేదాధ్యయనము చేయలేఁడు. చదువు రాదు. గోశాలముత్తముమీఁద విద్యావంతుఁడుగాని బ్రాహ్మణ యువకుఁ డతఁడొక్కఁడే. అతనికిఁ గఱ్ఱసాము కత్తిసాములలో నున్నంత చొఱవ చదువులో లేదు. అతని తండ్రు లధ్యయనముతోపాటు కొంతవ్యవసాయమును చేయుచుండిరి. అందుచేత నతని కన్నోదకములకు లోపములేదు. ఎవఁడు గొప్ప శూరుఁడో, యెవఁడు బలశాలియో వాని వెంటఁబడి తిరుగుచుండుట యతని కలవాటైనది. చదువు రాకపోయినను పండితునివలె మాటాడగలఁడు. రాజకార్యములు నిర్వహింపఁగలఁడు. ఆయూరి సభలో నతఁడొక సభికుఁడు. బద్దన్న యతనిని గొంకభూపతి వద్దకు రాయబారిగాఁ బంపించెను.

బద్దన్న:—నన్నయగారూ, ఏమి చేసినారు?

నన్నయ్య:—మొదట మేము ముగ్గురము కలిసియే పోయితిమి. నాగన్నయు, పాపయ్యయును వారిద్దఱికడకుఁ బోయిరి. నేను కొన్నాళ్ళు వారితోఁ గలసియుంటిని. నంబయ్య ప్రక్కకు పాపయ్య పోయెను. నేను కొన్నాళ్ళతనితో నుంటిని.

బద్దన్న:—నంబయ్య యెటువంటివాఁడు?

నన్నయ్య:— మంచిరూపసి; ఆజానుబాహువు. పొడుగైనముక్కు, విశాలములైన నేత్రములు. వయస్సేఁబదియేండ్లుండును. కొంచెమెక్కువ కావచ్చును. ముత్తానికి నేఁబదికిలోవాఁడు. పాపయ్య నంబయ్య దర్శనముకొఱకుఁ బ్రయత్నము చేయుచుండఁగా, నేను నంబయ్యను గాంచి చెఱబోలలో

వర్తమానములు తెలిసికొనుచుంటిని. ఊరిలోఁ దెలిసికొన్న సంగతులు నీతోఁ జెప్పుచుంటిని. నంబయ్య చాలస్వార్థపరుఁడఁట. దురహంకారియఁట. తన యధికారము, తనధనము, వీనియొక్క ప్రసక్తి వచ్చినచో స్నేహితుఁడైననుసరే, బంధువైననుసరే, వానిని మోసముచేయుటకు, వానిని కొంచెపఱచుటకు వెనుదీయని స్వభావముఁట. కాని సమర్థుఁడు. వీరుఁడు. ఆసామర్థ్యము, ఆ శౌర్యము, నిరాఘాటములైనవికావు. క్లిష్టముకాని సందర్భములో నతనిని పెట్టుము, ఆ పని నితరులు చేయలేనట్లతఁడు చేయును. క్లిష్టమైన పరిస్థితులవంకఁ బోఁడు. జీవితమునందు సుఖవాంఛ యెక్కువ. ఎంత సుఖవాంఛయో, యంత యధికారవాంఛ. బద్దన్న:—నన్నయ్యగారూ! రాయబారమునకు వెళ్ళినచో మీరు వెళ్ళవలయును. అందు కనియేకదా పాపయ్య నాగయ్యల వెంట మిమ్ము పంపించితిని. నన్నయ్య:—ఓరీ బద్దన్నా! నన్ను పొగడకుము. నన్ను పొగడుట నీ కలవాటై పోయినది. బద్దన్న:— నే నొక మహావీరుఁడ ననుకొనుట నీ కలవాటై పోయినది. నన్నయ్య:—అలవాటా? పూర్వ మట్లన్నచో నేమో యనుకొనెడివాఁడను. శతసహస్రవిషయము, వెలనాడు చూచివచ్చినతరువాత నాకు మఱీ తెలిసినది. బద్దన్నా! నీవంటివాఁడు మఱియొకఁడు పుట్టఁడు. పూర్వము పుట్టెనో, ముందు పుట్టునో, నాకిది యెఱుకఁగాని బ్రతికియున్న వారిలో లేడు. ఓరీ! నేను దేశమంతయు చూచివచ్చితిని చాల కత్తియుద్ధములు చూచితిని. నీవంటివాడు నాకుఁ గన్పించలేదు. బద్దన్న:—నగే కాని, నేను మొన్న కొప్పాక పోయితిని. అచ్చట నొక ముసలివాఁడు హాకలస్థుఁడే యున్నాఁడు. అతనికత్తి విద్య యెంత

విద్య! మఱికొన్ని మెలఁకువలు నేర్చికొనివచ్చితిని. అన్నింటికన్న శత్రువుచేతిలోనున్న కత్తినెగురఁగొట్టుట నేర్చెను. నన్నయ్య:- నీకు నన్నియు నట్లు సమకూడి వచ్చును. సరేకాని నీ వేదో చాల యుత్సాహముగ నుంటివేమి? నిన్ను చూచినతోడనే నా కనిపించెను. మీ యయ్య సంబంధమేమైన కుదిర్చెనా? బద్దన్న:- అది యేమియు లేదు కాని గొంకయ్యగారివద్దకు వెళ్లితివా? నన్నయ్య:- వెళ్లితిని. ఆయన దర్శనము కాలేదు. నేనే రాజు రాయబారిగా వెళ్ళితినని చెప్పుదును? బద్దన్నసేనాని నుండి వచ్చితి నని చెప్పుదునా? బద్దన్న సేనానియా? అతఁడు సేనాని యగుటయెవ్వరికిఁ దెలియును? పైగా బద్దన్న పేరు ధనద పురములోఁ జెప్పి నేను బ్రతుకుదునా? బద్దన్న:- మఱి యేమి చేసినారు? నన్నయ్య:- ఏమి చేసితినా? బ్రాహ్మణు లేమిచేయ లేరు. కుండలములు, పండితశాలువయు సంపాదించితిని. ఆఱు శాస్త్రములయందు నేనుపండితుఁడనంటిని. మంత్రశాస్త్రములో నా కన్న ఘటకుఁడు లేఁడంటిని. మహారాజదర్శనము కావలయు నంటిని. గొంకరాజునకు మంత్రశాస్త్ర మన్నచోఁ బిచ్చి నాకు రాజదర్శనము సులభముగా నయ్యెను. బద్దన్న:- మీ కా సంగతి తెలిసియే చేసితి రనుకొందును. నన్నయ్య:- తెలిసియే చేసితినో లేదో! అసలుసంగతి చూడుడు. రాజదర్శనమైనంతనే ప్రభువు నన్ను మంత్రశాస్త్రములో ప్రశ్నలు వేయ నారంభించెను. నే నేమి చెప్పుదును? బద్దన్న:- ఏమి చెప్పుదువు. కత్తి కైకొని యెదురు నిలుచున్నచో చెప్పుదువు. నన్నయ్య:- ఔను నిజమే. కొంత కాకపోయిన కొంత చెప్పియుందును. నే నేమి చేసితినో తెలియునా, నేను మౌన మవలంబించితిని. తాటి

యాంకునిఁ దరహస్యప్రదేశమునకు నైనచో మాటాడుదునని వ్రాసి యిచ్చితిని. రాజును నేనును ప్రత్యేకముగా నొక గదిలోనికిఁ బోయితిమి. ఆ పశ్చిమచాళుక్యసేనాని యున్నాడే – విక్రమ భల్లాలుఁడు– వాఁడు చండప్రచండుఁడు. న న్నొక్కనిని రాజుతో రహస్యమందిరమునకుఁ బోనీయలేదు. నేను విభూతితీసి, కన్నుఁ లుఁటిమి 'హ్రాం, హ్రీం, క్లీం, ఫట్, ఫట్, ఫట్' అని యుఁటిమి తిని. దానితో వాఁడు కొంచెము భయపడెను. రాజు కొంచెము సర్ది చెప్పెను. అప్పుడు పోనిచ్చెను. ఈ మాట వినినంతనే బద్దన్న కడుపుబ్బ నవ్వసాఁగెను. నన్నయ్య యిట్లనెను: నీ వింత నవ్వాపట్టుకొనలేని వాఁడవు, తేపు సేనానాయకత్వ మేమి చేసెదవు! సేనానాయకుఁ డింత నవ్వరాదు. అందుతో నేను సేనానిని; నీవు సేనానాయకుఁడవు. నేను నీ క్రింది ఉద్యోగస్థుఁడను. నా యెదుట నంత తెఱ్ఱగా నుండరాదు. బద్దన్న:– అదికాదయ్యా! నీవు సేనాని వైనను మన మిద్దఱ మున్నప్పుడు నీవు రాజువు. నేను బంటును. ఇంతకు గొంకభూపతి యే మనియెను?

నన్నయ్య:– ఏమనియెనా? నీవు పంచముకులస్థుఁడ వని నంతనే మొగము చిట్లించెను. బద్దన్న:– కరవాలభైరవుని వధిం చితి నని చెప్పలేదా. నన్నయ్య:– నేను చెప్పట యెందులకు? వారందఱకదివఱకే తెలియును. బద్దన్నా! ఒకసంగతిచూడుము. ప్రతివాఁడును ఖడ్గవిద్య తెలిసినవాఁడే. తన కెంత తెలియునో వాని కేమి తెలియును. తనకుఁ దెలిసినదియే సంపూర్ణవిద్య యను కొనును. ఎవుటివాఁ డొక మహాకార్యమును చేసినచో నా కార్యకరణమున తనకుఁ గొంత పరిచితి కలిగినచోఁ దానుకూడ నా పనినిచ్చుచేయఁగలడనుకొనును. అది వారి పెయ్యులను కాచి

నట్లు. క్షత్రియరుకులు తెలిసిన మాత్రతో నరిపోయెనదా? మని సిలో ఊపు, అప్పటి కప్పటికిఁ దోఁచుట, దైవ సుముహూర్తిఁ చుట యీ మూఁడును నుండవలయును. ఈ మూఁడు నియమం దున్నట్లుగా మఱియొకనియమం దుండవు. బద్దన్న:—తర్వాత కథ చెప్పుము.

నన్నయ్య:—నేను రాజుతో చెప్పితిని. బద్దన్న మహా పురుషుఁడంటిని. రాజు నీ వయస్సడిగెను. నేను కొంచెమెక్కువ వేసి చెప్పితిని. పాతికయేండ్లన్న మాత్రమున నాఁటికి నచ్చునా? నలుఁబదియేండ్లని మఱి యబద్ధమెట్లు చెప్పుదును. నీవు చిన్న వాఁడ వనుటచేత మఱికొంత నిరాదరణ కలిగెను. నీ విరువది రెండువేల సైన్యము నప్పుడే సమకూర్చితివని చెప్పితిని. అప్పటి కాయనకుఁ గొంత యానితివి. ఏమైనను నాయనకు నంబయ్య మీఁద కొంత యభిమానము. నంబయ్య గొప్ప వీరుఁ డనును. ఎంత మహాసైన్యమునైనను నంబయ్య నడిపించఁగలఁడనును. ఈ మహాయుద్ధములో రాజు నంబయ్యనే సైన్యాధిపతి చేయును. నిన్ను జేయించుటకుఁ జాల ప్రయత్నము చేసితిని.

బద్దన్న:—నన్నయ్యగారూ! మనకు కావలసినది నేను సైన్యాధిపతినగుట కాదు. రెండేఱుల నడిమి విషయము యొక్కయు, వేంగినాటియొక్కయు సేనలకు నేనే సేనా నాయకుఁడను. నా కిది చాలు. అదియుగాక పశ్చిమ చాళుక్యులు మన దేశము నాక్రమించి యేఁడేండ్లయినది. ఈ నంబయ్యయు మందరాజును అప్పుడు లేరా? నే నప్పటికి చిన్నవాఁడను. ఐనను వారి వ్యూహము, వారి యుద్ధనైపుణ్యము ఏన మెఱుఁగమా? మన మిద్దఱము కలసి వారు పన్నిన వ్యూహముల దోషములు, నడిపించిన సైన్యములయొక్క నడకలు చెప్పికొనలేదా! జేపు

మాత్రము వారంతకన్న నెక్కువ చేసెడిది యేమియుండును. మహాసైన్యాధిపతి యాయనయే కానిమ్ము. పశ్చిమ చాళుక్య సైన్యము మాత్రము నాచేతిమీదుగా, నీచేతిమీదుగా తఱుము బడుచున్నది. విష్ణువర్ధన మహారాజు కొడుకు కులోత్తుంగ చోళదేవుడు మనకు ప్రభువు. ఆయనకొడుకు ప్రభువు. ఆ కొడుకులు మన దేశమును వదలిపోయిరి. మన రాజులు చోళచక్రవర్తుల కూతుండ్రను చేసికొనుట మన కపాయమయ్యెను. కులోత్తుంగ చోళదేవునకు తండ్రి రాజ్యముకన్న తాతరాజ్య మెక్కువ యిష్టమయ్యెను. ఆయన కొన్నాళ్లు కొడుకుల నిచ్చటికి ప్రభువులుగా పంపించెను. తరువాత వారును రాజమహేంద్రనగరము వదలిపోయిరి. మనకు వెలనాటి చోళులు ప్రత్యక్షప్రభువులు. వారిని దాటి మనము పోలేము. నంబయ్యనే మహాసైన్యాధిపతిని కానిమ్ము. ఆరెండునాళ్ళలో సైన్య మెంత ప్రోగుచేసెను. గొంకరాజు అశ్వసైన్యమును గజసైన్యమును మన కిచ్చునా?

నన్నయ్య:—సైన్యమెంత ప్రోగుచేసిరో నాకు తెలియదు. నాగయ్యపాపయ్యలకు తెలియును. గజసైన్యము నశ్వసైన్యము నీక్రింద నుండుననట్లేర్పాటు చేసితిని. అది చేయుటకు నా తల ప్రాణము తోకకు వచ్చినది. నే నెంతటి వీరుడనో, నీవు నాకు పదింతల వీరుడ వని చెప్పితిని. నీవంతటి వీరుడవు కాకున్నచో నిన్ను నే నేల యంగీకరింతు నని చెప్పితిని.

బద్దన్న.—నీ వెంత వీరుడవో వారికి తెలియునా?

నన్నయ్య:—తెలియునా? తెలిపితిని. వెలనాటి చోళుల యాస్థానములో నాలుగురు కటారిగాండ్రు కలరు. వారిని మించిన జోదులు శతసహస్రవిషయమునను, వెలనాటివిషయ

మునను లేరట. నేను వారి యూర్గురతో యుద్ధము చేసితిని. కట్టినకాసె విప్పకుండ పదిగడియలు పట్టెను. నాయొడలిమీద కొంచెము గీరైనను పోలేదు. ఆఱుగురి నోడించితిని. రాజు విస్తుపోయెను. ఈ నీవు ప్రోవుచేసిన సైన్యమునకు నన్ను సేనా నాయకుని చేయుదు ననెను. బద్దన్న:—అట్లే కానిమ్మనక పోయితిరా. మన యిద్దరిలో నెవరైననేమి? నన్నయ్య:—ఒరే బద్దా! నేను మూఢుడ ననుకొంటివా? నిన్ను చూచి లేదు గనుక రాజునకు తెలియదు. నీవు నాకు తెలియదా? ఓరి దొంగా! నేను నీకన్న దొంగను. ఇక్కడికి రాకముందు కొప్పాకవెళ్ళి వచ్చితిని. వార్తలు కనుగొని వచ్చితిని. నేను కొప్పాకవాడలో హనుమదశమును సమకూర్చగలుగుదు నందువా? సమకూర్చి తిని పో! అచ్చటి ప్రతివాడును నన్ను దేవునిగా చూచు నందువా? ఇంతకు నీవు పంచములలో పుట్టుటవచ్చినది. లేనిచో నిన్ను రాజును చేసెడివాడను. బద్దన్న:— బాబోయి, అట్టి మాటలు మాటాడకుము. మేము మంటిజీవులము. మాకు రాజ్యము లెందులకు? కాదు దొరా, రాజ్యము చేయుదును. అన్ని కులములవారిని పాలింతుము. బ్రాహ్మణుల నెట్లు పాలింతుము, మీ యజ్ఞములు, మీ వేదములు మాచేత పాలింపబడునా? నన్నయ్య:—ఎందుకు పాలింపబడకూడదు? చతుర్థ కులజులు రాజులైరి. వారు సంధ్యావందనములు చేయుదురా? క్రతువులు చేయుదురా? వానియం దభిమానముకలవారు. ఆ యభిమానము మీకులమున కున్నయది. బద్దన్న:— దానిమాట పోనిమ్ము. అది మన మిచటఁగూర్చుండి యనుకొన్నంత తేలిక గాదు. నన్నయ్య:—పోరా, పో. అది నీకులముయొక్క కర్మము.

నీవంటివానియొక్క భయముయొక్క ఫలితము. బద్దన్న:—భయముకాదు. స్వామీ! ఈ దేశము వైరాగ్యము గల దేశము. జాతితః చూచినచో నా కులము వైరాగ్యము గల కులము. మేము మంటిజీవులము. యుద్ధము వచ్చినచో మేము సేన. లేనిచో పాలేరులము. వరాలో దేవుడు పుట్టినను మీకు బంటులము. సరే, దానికేమిగాని రాజు గజదళము నశ్వదళము మన కెట్లు చేకూర్చును. నన్నయ్య:—అది నన్నడిగెదవేమి? నీవే యాలోచించవలయును. బద్దన్న:—నీ వాలోచించకుండ వచ్చితివా యేమి! నన్నయ్య:—ఇద్దఱము కలసియే యాలోచించితిమి గదా. అట్లే చేయుదము. మన సైన్యమంతయు గోదావరి యొడ్డున కొంతయు, హాయిసాలుల రాజ్యపుటెల్లలమీద కొంతయు నుంచుదము. మన సైన్యములు తీర్చినంతనే పశ్చిమ చాళుక్యరాజు తన సైన్యమును పంపును. అప్పుడు మనము ధనదపురమునను పోయి యచ్చటి పశ్చిమచాళుక్యాధికారము తొలగించి యా సైన్యమును వశము చేసికొందము. బద్దన్న:—అప్పుడు నంబయ్య యుద్ధమురాడా? నన్నయ్య:—యుద్ధము చేయునప్పుడు రాడు, యుద్ధములు మనచేతనే చేయించును. సైన్యాధిపతిత్వమాత్రము ప్రవర్తించును. బద్దన్న—సరే.

ఆనాఁటి రాత్రి బద్దన్న నాగయ్య పాపయ్యలను తనను కలసికొమ్మని వార్తలంపెను. ఆ రాత్రి కృష్ణయొడ్డున యిసుక తిన్నెలమీద ముగ్గురును గలసికొనిరి. పాపయ్య యిట్లు చెప్పెను. "నంబయ్య చాల భక్తుఁడు. ప్రొద్దున లేచినతోడనే స్నానముచేసి ప్రొద్దెక్కువఱకును జపము చేయుచుండును. శనివారములు, ఏకాంతముగ నుండును. ఆ రెండుదినములు లేకభుక్తమే.

చాలమంచివాఁడు. మాటాడునప్పుడు తననుగూర్చి గొప్పగా మాటాడును. అంతవాఁడామాత్రము మాటాడవచ్చును. గొప్ప వీరుఁడు. ఆయన కత్తిసాము చూచితిని. తీర్చినట్లుండును. చాల సుకుమారముగా నుండును. గొప్ప భోగి కాని పేదవాఁడు. పేదవాడనగా తన భోగములకు తగినంత సంపదలేనివాడు. ఎవరు వచ్చినను నాదరించును నోటివెంట నొక్క కోపము మాట యనఁడు. ఊరిలో నెవ్వరిని చూచినను నంబయ్యను మెచ్చుకొందురు. గొప్ప వీరుఁడందురు! ప్రజారంజకుఁడందురు. నన్నొకపూట భోజనమునకు పిలచెను. ప్రక్కన కూర్చుండి భోజనము చేసితిని. శతసహస్రవిషయమున నారాజు పదివేల మంది సైన్యమును ప్రోగుచేసెను. దళములు సేనలు సమకూర్చెను. ఆ మహాసైన్యాధిపతి మన సైన్యములనుకూడ తెచ్చి యాయన సైన్యముతో కలుపుమనెను. బద్దన్న:—ఈ సైన్యములు చేబ్రోలులో పెట్టుకొని యేమిచేయును. అచ్చట వీరందఱకు భోజనము లెక్లేర్పరచును. ఈ సైన్యములను నడిపి మనము చేబ్రోలునకు తీసికొని పోయినచో ననుకొన్న శిళకు ముందు రహస్యము శత్రువులకు తెలియదా? శత్రుసైన్యమెచ్చటికి నచ్చునో యచ్చటికి మన సైన్యము పోవలయును గాని చేబ్రోలున కేందుకు? పాపయ్య:—నాకు తెలియదు. నాకు చెప్పినమాట చెప్పితిని. బద్దన్న:—సరే. నాగయ్యగారూ! మీరేమిచేసితిరి? నాగయ్య:—నాదెండ్ల పోయితిని. పోకముందు దేశమును విచారించితిని. దేశము సుభిక్షముగా నున్నది. ప్రజలు రాజునుగూర్చి పొగడరు. తెగడరు. మంచివాఁడందురు. నేను కొందఱితో స్నేహముచేసి వారికి రహస్యముచెప్పి మర్జము

మందుని దర్శనముచేయకమునుపే కొన్నియూళ్ళలో నూటికి ముప్పదిమందిగా నేబదియూండ్లలో నొక దళము నేర్పాటు చేసితిని. అచ్చట నా కొకస్నేహితుఁడు కుదిరెను. అతనిని దళవాయిని చేసితిని. తరువాత మేమిద్దఱము కలసి రాజదర్శనము చేసితిమి. రాజు మన ప్రయత్నము విని చాల సంతోషించెను. నీవు కరవాలభైరవుని సంహరించితివన్న వార్త విన్నానననెను. ఆయన సహజముగా కొద్దిమాటలే మాట్లాడును. తనకు భాగుగా నచ్చినవారితోఁ గాని యెక్కువ మాటాడఁడు. నిన్ను గూర్చి నాతో పొగడలేదు. కాని నా మిత్రునితోఁ బొగడినాడఁట. "కరవాలభైరవుని నే నెరుగుదును. వాఁడు తాటకికొడుకు, సుబాహువంతటివాఁడు. కొండంత మనిసి. వెనుక మనసేన లోడిపోయినపుడు వాఁడుచేసిన ప్రళయసంహారము నాకిప్పటికిని జ్ఞాపకమున్నది. వానిని బద్దన్న సంహరించినచో నితఁడును ప్రళయరుద్రుఁడే యగును. మనిసి పాతికయేండ్లలోపువాఁడఁట. స్థూలశరీరుఁడు కాఁడట. అతఁడు చూడఁదగినవాఁడే. పట్టి కత్తిసాము నేర్పుటే కాదు. ఆనాగయ్య చెప్పినమాటలను బట్టి చూచినచోఁ జాలవినయవంతుఁడువలెఁ గనిపించుచున్నాఁడు. కరవాలభైరవునితో యుద్ధముచేసినంతసేపు నతఁ డెంత తూలి మాటాడినను నితఁడు మర్యాదాతిక్రమముచేయలేదఁట. అదియుఁ గాక యింత యెత్తుగడయెత్తి యిరువదిరెండువేల సైన్యమును సమకూర్చి రాజులతో రాయబారమెత్తినాడు. నామిత్రుఁడు పురుషుఁడనిపెప్పవలయును" అనెనఁట. ఈమాటలునామిత్రుఁడు నాతో జెప్పెను. బద్దన్న.-మఱి యితరగ్రామములయందు సైన్యములసమకుర్చుట యేమిచేసెను? నాగయ్య—ఆపని కొండకు

రహస్యాధికారులకు నిర్ణయించెను. దుర్జయమండుడు చాల ధనవంతుడు. దేశము సుభిక్షముగా నున్నది. సుంకములు వతనుతప్పక చెల్లుబడి యగుచున్నవి. తా నెప్పుడు భోగలాలసుడై యుండును. ఎప్పుడును సంగీతములు, సాహిత్యములు. బద్దన్న-మఱియుద్ధములో మనకుసాయపడుట లేదా? నాగయ్య-అబ్బో! బద్దన్నా!! ఆయన చాల గొప్పవీరుడు. సహజముగా యుద్ధాభిలాషి కాడు. బరిలో దిగినచో నంతటి కటారికానిని నేను చూడలేదు. పైగా నీవుచేసిన యీ ప్రయత్నమునంత మెచ్చుకొన్నాడనగా నతడుగూడ నిట్టిప్రయత్నము చేయఁదగిన సమర్థుడై యుండవలయును గదా! ఇంకొక్క సంగతి చూడు. మఱియొక్కడైనచో నీవు చేసిన పని కసూయపడి యుండును. వాడు ప్రారంభించుటయేమి, మనము దానికి సహాయకారులముమాత్ర మగుటయేమి, యని యసూయ పడడా! బద్దన్న-మంచి దొరయేయై యుండును. తక్కిన దళములను సమకూర్చుట మాటయేమి? నాగయ్య-తక్కినదంతయు నేనును, నా స్నేహితుడును చేసితిమి. దుర్జయమండలమున పదునేనువేలసైన్యము సమకూర్పఁబడి యున్నది. ఒక్క సంగతి పొక్కలేదు. బద్దన్న-మఱి యీయన గొంకరాజుగారితో మాట్లాడెన ననేనా? నాగయ్య-నంబయ్యగారిని మాటాడుమనెను. బద్దన్న-నంబయ్యగారెందుకు? నాగయ్య-ఆయనకు, నంబయ్యగారికి బంధుత్వము కలదు! ఇద్దఱు దుర్జయవంశీయులే కదా. తాను నంబయ్యకన్నగొప్ప ఖడ్గవిద్యావిశారదుఁడైనకూడ దుర్జయమండుఁడు నంబయ్యను మెచ్చుకొనుచుండును. నంబయ్య గొప్పవాఁడనుచుండును. నంబయ్య కత్తిత్రిప్పను తెచ్చినట్లుండి

మెత్తగానుండు ననును. సైన్యాధిపతి కాఁదగినచో నతఁడే కావలయు ననును. నాకుఁ దెలిసినంతవఱకు దుర్జయుండును నంబయ్య కన్న వందరెట్లెక్కువ శూరుఁడు. మందయ్య తన శూరత్వమును గూర్చి చెప్పఁడు తాను శూరుఁడ ననుకొనఁడు. ఆయన విడివడి నచో పశ్చిమచాళుక్య సైన్యమును నీవలె తానుగూడ నిర్జించఁ గలఁడు. కాని యాయనకు నంబయ్యమీఁద నభిమానము. యుద్ధములో నంబయ్య ప్రక్కనుండి యుద్ధము చేయవలయు ననును. పూర్వముకూడ నట్లేనఁట. ఇద్దఱును చెలిమికాండ్రఁట. ఇద్దఱును కలసి యుద్ధము చేయుచుండెడివారఁట. శత్రువులను సంహరించినది దుర్జయుండును, త్రివదలిపెట్టినది నంబయ్యయును. బద్దన్న—నీవు చాల తెలివిగొనివచ్చితివే. నాగయ్య—నీవు నన్ను పంపించితివి. నీవుంచరిపత్రికము నా చెప్పుమాటల మీఁద నాధారపడి యుండును. నీకు సరియైన వార్త తేవల యునా? వలదా! బద్దన్న—నాగయ్యా! చాలమంచిపని చేసితివి. మీ యిద్దఱు చేసినసహాయము నే నెన్నటికిని మరువలేను. మీ యిద్దఱిని యిదివఱకే దుముదారులుగా నేర్పాటుచేసితిని. మీరు మీ సైన్యమును చూచుకొనవలయును. పాపయ్య—నన్నయ్యగారు వచ్చిరా? బద్దన్న—వచ్చిరి. పాపయ్య—ఆయన గూడ నింకొక దుముదారుగదా? బద్దన్న—కాదు. ఆయన దళవాయి మాత్రమే. నాగన్న—అదియేమి? బద్దన్న—ఆయన బ్రాహ్మణుఁడు. దళముమించి సేననాయకక్రిందఁ బెట్టినచో నాకు నమ్మకము లేదు. మీరు జోదుల బిడ్డలు. మీరు దుముదారులైనట్లు ఆయన కాదగునా? అదియుఁగాక ఆయన యడుగ లేదు. నాగన్న—మనస్సులో నేమైన ననుకొనునేమో? బద్దన్న—

ఏమియు ననుకొన్నట్లు కనుపించలేదు, సంతోషించినట్లే మాట్లాడినాడు.

వీరి యీ ప్రసంగ మగువఱకు రాత్రి ప్రొద్దుతిరిగెను. బద్దన్న తానేదో యాలోచించవలయునని వారిని పంపించెను. అది కృష్ణపక్షము. ఆ వేళకుఁ జంద్రోదయ మగుచుండెను. ఉదయించుచున్న చంద్రుని యెఱ్ఱనికాంతి ప్రక్కనున్న లంక లోని నల్లని మట్టిమీఁదఁబడి చీకట్లను, తెల్లనియిసుకలమీఁదఁబడి యెఱ్ఱనిజ్వాలలను సృష్టించెను. ఆ యెఱ్ఱని కాంతులు దూరమున నున్న నీటిపాయమీఁదఁబడి యచటఁగూడ చీకట్లే కనిపించెను. అందుచేత బద్దన్న రెండంధకారప్రదేశముల మధ్య నగ్ని జ్వాలలోఁ దగుల్కొన్నట్లు తోఁచెను. కాని కొంతసమయము గడచువఱకు చంద్రుఁడు బారెడెక్కి యిసుక తిన్నెలును, నీటి పాయయుఁ దెల్లఁబడెను. లంకమట్టి నల్లతనము మాత్రము నల్ల గానే యుండెను. అక్కడ వెన్నెలలు కాసినట్లే లేదు.

౬

బద్దన్నయు, బొదమ్మయు నానాఁడు రాత్రి రెండుజాముల వేళ తూర్పువైపు పొలములో నొకచోటఁ గలసికొనవలయునని నియమము చేసికొనిరి. బద్దన్న నాగయ్య, పాపయ్యలతోఁ గలసి మాటాడుచు నా రాత్రి యచటికిఁ బోనేలేదు. బొదమ్మ యచ టికిఁబోయి యతనికొఱకు తెల్లవారువఱకు ప్రతీక్షించి యింద కింటికిఁబోయెనుఁ. అంతవఱకు వారిరువురకు బరిచయము, స్నేహము, నిన్ను ప్రేమించుచుంటి ననఁగా, నిన్ను ప్రేమించు చుంటి నన్న మాటలు, నిన్నటి దినమున కృష్ణయిసుకలలోఁ

జేసిన విహారములు, యీ మాత్రమే సంబంధము. ఈ రాత్రి కలసికొను నేర్పాటు బాదమ్మ చేసినదే. అచ్చటి కతఁడేమో రాలేదు.

తెల్లవారి బాదమ్మను తిప్పన్న జూచెను. బాదమ్మ కను లెఱ్ఱని జ్యోతులవలె నుండెను. ప్రతీక్షాగ్నిచేత నామె మొగ మంతయు వాడి నత్తలై యుండెను. ఆమె నిశాపరభాగమున మిక్కిలి దుఃఖించెను. ఆమె కన్నులవెంట నీరుకారి చెక్కిళ్ళన్నియు మలినములై యుండెను. ఆమె మొగములో నుత్సాహము లేదు. తిప్పన్న యామెను చూచెను. తిప్పన్నకు రాత్రి యామె యింటిలో లేదనిమాత్రమే తెలియునుగాని యామె మొగములో నున్న దైన్యము చూచి సంగతి గ్రహించఁగల నేర్పులేదు. బాదమ్మ పదునేడేండ్లనుండి కాఁపురము చేయుచుండెను. ఆమె పూర్వ మొక్కసారియైనను రాత్రిపూట నిలువెడలి పోలేదు. అది యిదియే మొదటిసారి. తిప్పన్న యెట్లు భావించినను భావించవచ్చును. కాని తిప్పన్న భావము బద్దన్న ముఖము గానే సాఁగెను. తిప్పన్న బద్దన్ననుగూర్చి వందవార్తలు వినుచుండెను. అతఁడు కరవాలభైరవుని సంహరించిన విషయము తిప్పన్నకుఁ బాగ స్తహేతువుకాలేదు. బద్దన్న సైన్యములు సమకూర్చుచుండెను. ఇదియంతయు రాజద్రోహముగాఁ గనిపించెను. వాఁడేమో కుఱ్ఱవాఁడు. ఒకసన్ని వేశముచేతఁ దళుక్కుమన్నాఁడు. దానికై జనమందఱు వాని నొకదైవముగాఁ జూచుట తిప్పన్నకు గిట్టలేదు. దీని కంతకుఁ గారణము బాదమ్మ బద్దన్న యందు కోర్కికలదిగాఁ గనిపించుటయెమో! తిప్పన్న వచ్చిన బాదమ్మను నీవెచ్చటికిఁ బోయితివని యడిగెను. బాదమ్మ సమా

ధానము చెప్పలేదు. తన పని యేదో తాను చూచుకొను చుండెను. తిప్పన్న యిట్లనెను. 'నీవా మిండగానికొఱకుఁ బోయి తివి. వాఁడు నీకన్న పదితరాలు చిన్నవాఁడు. మీ రందఱుకలసి వాఁడొక పెద్దశూరుఁడనుకొను చున్నారు. వానితండ్రి వానికి వివాహము చేయలేదు. వాఁడిట్టివేషములు వేయుచున్నాఁడు. నీవు వానికొఱకుఁబోయితివి. నే నెరుగుదును. నిన్నేమిచేసెదనో చూడుము. నిన్ను పుట్టింటికిఁ బంపివేసెదను.' ఈరీతిగాఁ దిప్పన్న యెంత చదివినను బాదమ్మ సమాధానము చెప్పలేదు. సమాధానము లేకపోయిన కొలఁది తిప్పన్న కోపము మండు చుండెను. చివరకుఁ దిప్పన్న యొక కఱ్ఱఁదీసికొని బాదమ్మను పసరమును బాదినట్లు బాదెను. తిప్పన్న యెంతకొట్టినను బాదమ్మ మాటాడలేదు కుయికుయ్యి మనలేదు. చేయి యడ్డము పెట్టను లేదు. ఆమె మొగమునందు మాత్రము బాధకడుచుండెను. తిప్పన్న కొట్టికొట్టి చివరకు విసుగుపొంది కఱ్ఱ దూరముగా పారవేసి నీవు నా యింటిలో నుండవద్దు పొమ్మని బాదమ్మను గెంట నారంభించెను. బాదమ్మ నోరుపట కదలలేదుగాని చివరకు వాని ముంగిలి వదలిపోక తప్పినదికాదు. బాదమ్మ కెచ్చటికిఁ బోవలయునో తెలియలేదు బద్దన్న యింటికిఁ బోవునా! బద్దన్న తండ్రి రానిచ్చునా? నిజానికి బద్దన్నకు తనకు నంత వఱకు సంబంధము లేదు. బద్దన్న యింతవఱకుఁ గుఱ్ఱతనమునే ప్రకటించెను. ఇట్లు పోయిన బాదమ్మను బద్దన్న తన యింటిలో నుంచుకొనునా? అంత ధైర్య మతనికిఁ గలదా? రాజకీయము లలో వాని మనస్సు పరిపక్వమైనట్లు కామవిషయమున పరి పక్వము కాలేదు. తానిప్పుడు పుట్టినింటికిఁ బోయినచో కొన్నాళ

వాడవారు పౌరుషము బ్రతుకుగాఁగలవారు. తన్ను పొడిచి చంపినను చంపవచ్చును. కొప్పాకకుఁబోవు ప్రసక్తి లేదు. కృష్ణలోఁబడి చనిపోవుటకును కృష్ణలోఁ దగినంత నీరులేదు. లేదని మొన్న తానేకదా బద్దన్నతోఁ జెప్పినది. ఆమెకుఁ దన ప్రాణమంతయు బద్దన్నగాఁ గనిపించెను. తనకు వయసువచ్చినప్పటి నుండి ఆ వయసుయొక్క పంట కనిపించలేదు. తన తండ్రి తిప్పన్నకు డబ్బుకోస మిచ్చినాఁడు. ఆ తిప్పన్న పురుషుఁడే కాడు. వానివద్ద భోగలక్షణములే లేవు. వానికి ప్రేమయన్నఁగా నేమో తెలియదు. తన జీవితమంతయుఁ దన ప్రేమయంతయుఁ బదియేండ్లుగా బద్దన్నకోసము ముడుపుకట్టి యుంచెను. అది యిప్పటికిఁ బంటమొగము తిరిగెను. ఇప్పుడుపోయి యాత్మహత్య చేసికొని యక్కడికిఁగాక, యక్కడికిఁగాక యగుట యెందులకు! బద్దన్న యింటికిఁబోయెదను. ఏమి జరుగునో చూచెదను అనుకొని బాదమ్మ, కఱ్ఱదెబ్బలచేత నొడలు కందులుకట్టిన బాదమ్మ, కొంకుముల్లాఁడుచోట్ల దెబ్బలచేత నొడలుచిట్లి నెత్తురుకారుచున్న బాదమ్మ, తెల్లవారలు నిదురలేమిచే నేడ్చుచుండుటచేఁ గన్నులుబ్బి యెఱ్ఱవడిన బాదమ్మ, తల చీకిరి బాకిరిగానున్న బాదమ్మ, ఒకతెల్ల నాత్మహత్యాభిముఖముగా నున్న బాదమ్మను తన వాకిటిముందు కూర్చుండియున్న బద్దన్న చూచెను. చూచిన వెంటనే బద్దన్నకు స్మృతి కలిగెను. ఆమెను తాను గడచిన రాత్రి తూర్పు పొలములో నొకచోటికి రమ్మనెను. కాదుఁ కాదు, ఇద్దఱు నచ్చోట కలిసికొందమనుకొన్నారు. ఆమె తన కోసము తెల్లవారలచటనుండెను కాబోలు. ఏదో యడవి జంతువు వామెను తాకియుండును. ఆమె దాని మొగమునుండి

తప్పించుకొని యిట్లు వచ్చియుండును. బద్దన్న యామెను చూచుటతోడనే లేచి యామెను కౌఁగిలించుకొనెను. వారి కదియే ప్రథమపరిష్వంగము. వారిప్రేమ యెట్లున్నదో వారి ప్రథమ పరిష్వంగ సమయముకూడ నట్లేయున్నది. బద్దన్న యిట్లనెను. "నీవు తెల్లవారలచ్చటనే యుందు వనుకొనలేదు. కొంతసేపు నాకొఱకుచూచి యింటికిఁబోయెద వనుకొంటిని. అచటనే యుంటివి కాబోలు. ఏ మృగమువచ్చి నీమీఁదఁ బడెను? అయ్యో! నేను రాత్రి రాజాకపోతిని. నేఁడు వేఱే రాచకార్యముండెను. దానితో నాకుఁ దెల్లవారెను. నాకు నీవును, ఆ రాచకార్యమును ఒక్కసారి తటస్థించిరి. నీకోసము మూఁడేండ్లెదురుచూచితిని. నాలుగేండ్లెదురు చూచితిని. అప్పుడింతైన నీసంగతి నాకుఁ దెలియఁజేసితివి కావు. దేశమంతయు నానెత్తిన పెట్టుకొన్నప్పుడు నీసంగతి నాకుఁ దెలియఁజేసితివి. నేనీ కృష్ణాగోదావరులమధ్య నల్లలనాడుచుంటిని. నేనీ రెంటికిని కాకపోదునేమో? నిన్నే మృగము కొఱికెను' చెప్పుమనెను. బాదమ్మ యేడ్చుచు నన్ను కఱికినమృగము నేను తిప్పన్నయని చెప్పెను. బద్దన్నకు వెంటనే పట్టరానంత కోపము వచ్చెను. అతఁడు చరాలున యింటిలోనికిఁబోయి గోడ వంకకుఁ దగిలించియున్న కత్తిని తీసికొని ప్రయాణమయ్యెను. బాదమ్మ వానిని పట్టుకొనెను. ఎచ్చటికిఁబోవుచుంటి వని యడిగెను. బద్దన్న:—తిప్పన్నను నఱికివచ్చెదను. వానికీనీమీఁద నధికార మేమిగలదు? వాఁడు నిన్నెందులకు కొట్టెను. వాఁడునా స్త్రీని తాకవలసిన యవసర మేలవచ్చెను!" బాదమ్మ నవ్వియిట్లనెను. "ఓయి! నేనింతవఱకతని స్త్రీనే. నీవు నన్ను నీస్త్రీగా

నెప్పుడు చేసికొంటివి? నీవు చేసికొన్నచో నతఁడు కొట్టబడివాఁడే కాఁడు. నీవు చేసికొనలేదు. కనుకనే యతఁడు కొట్టెను. ఇంటి నుండి గెంటివేసెను. అతఁడు గెంటివేయఁగా నేను పోఁదగిన స్థలములు మూఁడే కనిపించెను. అందులో బ్రతికినచో బ్రతుక దగినదొక స్థలము. నిస్సందేహముగాఁ జచ్చిపోవునవి రెండు స్థలములు. ఆ రెండును ఒకటి కొప్పాకయు, ఒకటి కృష్ణయు. అచ్చటికిఁబోయినచో మరణ మెట్లును తప్పదు. ఆ మరణము స్థిరపఱచుకొనుటకు ముందు నీ కడకు వచ్చితిని. ఇంక నీ యిష్ట మనెను.

బద్దన్న వయసు చిన్నతనముచేత, ప్రణయము విషయములందలి ప్రౌఢి యెఱుఁగకపోవుటచేతఁ దాను స్వతంత్రించి యేమి చేయలేఁడో, వానిని పరిస్థితులు బలవంతిపెట్టి చేయించు చున్నట్లుండెను. బద్దన్నకు మనస్సుచేత నూహించు విషయము లందు నెంత సునిశితత్వముకలదో కొన్నిలోకవ్యవహారములు తెలిసికొనుటయందంత మాంద్యముకలదు. తాను బాదమ్మను స్వీకరించుట యంత తేలిక యనుకొనెను. చుట్టుపట్ల నున్న లోకమునుండి కొందఱు విషయములు గ్రహింతురు. బద్దన్న కొలఁబద్ద వేఱు. అది యతని యూహ. అతని యభిప్రాయము, అతనికి యిష్టానిష్టములు, అతని కోర్కెలు, వానిమీఁద నాధారపడి యుండును. తాను బాదమ్మను ప్రేమించెను. అతని యుద్దేశ్యములో నది ధర్మము. అది యెవ్వరు కాదన రనుకొనెను. అతని కందులో దోషము కనిపించదు. తాను ప్రేమించెను కావున నెవ్వరును దానిని దోషమనరాదు. అతని యహంకారము, స్వాభిమానము వాని మూర్ఖతలో మునిఁ

వడెను. ఈ ప్రపంచమునకు మొట్టమొదటివాఁడు తాను. ఈ జగత్తు తనకోస మున్నది. ఇది తాను శాసించినట్లు నడువ వలయును. మనస్సు ఈపద్ధతిమీఁద నడచును. ఒక్కొక్కప్పుడు విచారించినచో నొక శకపురుషుఁడు, ఒక జేత, ఒక మహాశిల్పి యీ తరఁగతికిఁ జెందినవారుగాఁ గన్పింతురు. వానియందు నిట్టి భావమే లేకున్నచో వారా మహాకార్యము లు చేయఁజాల కుందురు. అందుకనియే లోకోద్ధారకములు, లోకోపకారక ములు, నైన మహాకార్యములు చేసినవారందఱు కొన్ని విష యములలో మిక్కిలి స్వార్థపరులుగాఁ గన్పింతురు. నిరంకుశు లుగాఁగన్పింతురు. వారు లోకాతీతులు. లోకమువారికొఱకుఁ గాదు. వారు లోకముకొఱకు.

బద్దన్న బాదమ్మను తన యింటిలోఁ బెట్టుకొనినచోఁ దండ్రి యేమనునో, ఊరేమనునో యని విచారించలేదు. ఆమె వచ్చుటనుండి పొమ్మనెను. ఇరువురును గలసి లోనికిఁబోయిరి. బాదమ్మ స్నానము చేసెను. తల సర్దుకొనెను! కట్టుకొనుటకు వేఱే చీరలేదు. ఆ చీరయే తాల్చెను. ఇంతకు నా తెల్లవారు కడలేచి బద్దన్న తండ్రి యేదో పనిమీఁద పొరుగూరికిఁబోయెను. అతఁడు వారము పదిరోజులవఱకు రా నని కొడుకుతోఁ జెప్పి పోయెను. బద్దన్నకూడ నా ప్రొద్దునసే పొరుగూరు పోవలయు నని కొండజితోఁ జెప్పెను. బాదమ్మరానిచో నతఁడును పోయెడి వాఁడే. ఈ రీతిగా వా రిరువుర కింటిలో నేకాంతము దొరకెను.

తిప్పన్న బాదమ్మ వెడలిపోయినతర్వాత మధ్యాహ్నము వఱకు నామెనుగూర్చిన ప్రసక్తి కలిగించుకొనలేదు. మన స్సులో నామె యేమైనదో, యేమగునో యన్న భయములేక

పోలేదు. కాని బిగువుగొలిపెడి నామెముగూర్చి వెదుకలేదు. మధ్యాహ్నము దాటినతర్వాత వెదుక నారంభించెను. ఎచ్చటికిఁబోయినదో యెవరును చెప్పినవారులేరు. బద్దన్న యింటికి పోయి చూడవలయు ననుకొనెను. కాని మనస్కరించలేదు. ప్రొద్దుగ్రుంకు వేళ కెవరినో పోయి బద్దన్న యింటిలో నున్నదేమో చూచి రమ్మనెను. బద్దన్నయు, బద్దన్న తండ్రియు నూరిలో లేరని వారు వీరు చెప్పిరి. అప్పటికిని నిశ్చయములేక తిప్పన్న తానే ప్రొద్దుగ్రుంకువేళ చూచెను. బద్దన్న యింటికి బయట గొళ్ళెము వేసియుండెను. అతని మనస్సులో తహతహ ప్రారంభించెను. కాని కొంతవేళకు మొండిచేసికొని పుట్టింటికిఁ బోయి యుండునని కొంతసమాధానపఱచికొని యూరకుండెను.

బాదమ్మ వేడినీళ్ళు పెట్టి యొడలెల్ల కాచికొనెను. బద్దన్న కూడ కాచెను. అదివఱకు బద్దన్న యెఱుఁగని యామె శరీరము బద్దన్నకుఁ గనుపించెను. అతఁడు తత్పూర్వమెఱుఁగని యొక విచిత్రానుభూతి పొందెను. ఆయనుభూతివిశేషములో, గరవాల భైరవుని తాను సంహరించి పొందిన ప్రతిష్ఠాసౌఖ్యముగాని, గడించిన శౌర్యరేఖాప్రాచుర్యానుభూతిగాని, లభించిన సేనానాయకత్వమర్యాదగాని, యనుసరించుచున్న సేనాని జనములు చూపు గౌరవముయొక్క సుఖముగాని శతాంశమునకు రాలేదు. అతనికిఁ దన మొదలు తనకుఁ దెలియదు! అదివఱకుఁ గాలము నిముసములుగా, గడియలుగా, జాములుగా గడుచుచుండెను. ఇప్పుడా కాలమునందు విభేదమే పోయెను. ఇప్పుడా కాలము నందిచ్చట మొదలు పెట్టెను, నింత పరిణమించె నన్న విభేదజ్ఞానమే పోయి కాల మొక యఖండప్రోతస్సై విడంబించెను.

బాదమ్మ యొడలు తీప్పన్న కొట్టిన దెబ్బలచేతఁ దాకుటకు సీలులేకుండ నుండెను. తాకినప్పు డామె బాధపడుచుండెను. ఆమె బాధనుండి ,యొక సౌఖ్యమును ప్రకటించుచుండెను. శరీరమునకు సంబంధించినట్లు బాధ, ఆ బాధకు ముఖములో కొంత వ్యక్తీకరణము; ఈ బాధకు దాటిన మనస్సులో నొక సుఖము, మొగములో నా సుఖమునకు సంబంధించిన మనోజ్ఞ హాసము. బద్దన్న యొకచోట తాకును. అచ్చట నామెకు బాధపెట్టును. బద్దన్న యాచేయి తీసికొనబోవును. బాదమ్మ యా చేతిని పట్టుకొని యచ్చటనే యుంచును.

బద్దన్న బాదమ్మలకు బయట సూర్యుఁడు కాలమును పొడుచుచున్నాడని, యెండలు ముదిరి గుత్తులు సడలి విరవిర పోయి చెదరి చల్లఁబడి రాత్రివచ్చి, యాకాశవీధులు శిశిరములై బయట చలివేసి యేమో యేమో మారుచున్నవని తెలియదు. లోపలనే వంటఁజేసికొనిరి. భోజనము చేసిరి. ఈ సంగతియు, వారికిఁ దెలియదు. రాత్రి కొంతవేళకు నిద్రించిరి. ఆ సంగతి తెలియదు. మెలఁకువ వచ్చినంతనే మఱల నిద్రకుఁ బూర్వము జ్ఞానముకల లిప్తవఱకు ప్రవహించుచున్న సౌఖ్యానుభూతి ప్రవాహము, మెలఁకువవచ్చిన లిప్తలోనే ఖండింపఁబడినట్లు, అంతటి యుచ్ఛస్థాయిలో నందుకొని ప్రవహించుచుండెను. అదియొక ప్రవాహము. ప్రవహించుచున్నది. అప్పు డాగినది. మఱల నందుకొన్నది. ఈజ్ఞానమే లేదు. అది యనూనస్మృ లేదు. నిద్రకూడ నీ ప్రవాహములో భాగము: సౌఖ్యానుభూతికి సంబంధించినంతవఱకు నిద్ర తత్ప్రవాహైకదేశముగా కనిపించును. దుఃఖానుభూతిసమయములో నిద్ర కేటాయింపుగా

నుండును. ఒకదుఃఖము ననుభవించుచుండును. బడలి నిద్రపోదురు. మెలఁకువగందురు. ఆ నిద్రాసమయమున నా దుఃఖ మనుభవించలేరని విచారింతురు. అనఁగా నిద్రావేళలయందు దుఃఖానుభూతి లేదన్నమాట. నిద్ర సుఖానుభూతిసంబంధము కలది. సుఖానుభూతిసమయములోఁ బడసిన నిద్ర యనుభవించినట్లుండదు. కాలవ్యయము జరిగినట్లుండదు. ఆ సమయముకూడ ననుభవింపఁబడినట్లే యుండును. మఱియు స్త్రీ సౌఖ్యసంబంమున, నిద్ర మెలఁకువ వచ్చిన సమయమున, తదనుభూతివిశేషము మిక్కిలిదట్టమై నిద్రాసమయము తత్కాలము పరిభోగవిషయమున నష్టమైనదిగా గాన్పించదు. సంపాదితాధికశక్తిసమన్వితమై నిద్ర తత్సుఖానుభూతికి దోహదప్రాయమై యుండును. అందుచేత బద్దన్న బాదమ్మకు నిద్రపోయితిమని మేల్కాంటిమను విచక్షణ లేకపోయెను. దినము లూఱకే గడచుచుండెను. వారిరువు రా యింటిలో నున్న సంగతి యూరికిఁ దెలియదు. వారికిని తెలియదు. పరస్పరము వారి యొడళ్లు వారికిక్షుఖండములవలె పర్వపర్వమధురములై యుండెను. వారి మనస్సు లొకరొకరి కొకరొకరికి నెప్పటికప్పుడు క్రొత్తవి క్రొత్తవిగాఁ గన్పించుచుండెను. ఆ క్రొత్తదనములోఁ గొంత ప్రాతదన మున్నట్లుండెను. ఆ క్రొత్తదనము సిగ్గుచే, ప్రాతదనము ప్రత్యక్షచే సూచింపఁబడుచుండును. బద్దన్నకు నదియంతయు నొక క్రొత్తగా నుండెను. ప్రథమయౌవనదశావిర్భావమున తన శరీరసన్నికర్షము చేయు నిష్కంచుకము, నిశ్చలమైన వరారోహాశరీరము పురుషుని మనస్సునను నిదమిత్థమని నిర్ణయింపరానట్లుండును. ఆ మోహము దాని కదియే సాటి. లోకము

నందు సర్వభ్రాంతు లోకమెత్తు. ఆ భ్రాంతి యొకమెత్తు. బ్రతుకు బ్రతుకెల్ల పరమార్థదశ పొందినట్లు పురుషుఁడు భావించును. బద్దన్న అశిక్షితుఁడు. బాదమ్మ శిక్షితురాలు. తన యౌవనము ఫలించిన దన్న యనుభూతి విశేషమునందు బాదమ్మకుఁ గ్రొత్తదన మున్నది గాని బద్దన్నకు సర్వము క్రొత్తయే. బాదమ్మ బద్దన్నకు ఖడ్గవిద్యలోనే గురువుగాదు. ఈ విద్యలోనను గురువే. బద్దన్నకు బాదమ్మయందు పూర్వము కల గురుభావములో నామె వేఱు, తాను వేఱు. ఇప్పటి గురుత్వ భావనలో నామెయు తా నొక్కటే. ఆ యొక్కటియైన తన యందు నామె యెంత మేఱ గురువు; తా నంత మేఱ శిష్యుఁడు? ఈ మేఱ నిర్ణయింపఁబడలేక యది వట్టిభావనగా నిలచిపోయెను. తాను శిష్యుఁడైన మేఱగూడ తానే గురువుగా భావించెను. బాదమ్మ గురువైన మేఱ బాదమ్మ యధికారము కనిపించెను. ఆ యధికారమునకుఁదాను లొంగికూడ నాయధికారముమీఁద తన కధికారమున్నట్లు భాసించెను. ఇంత భావనలేదు. లేకపో లేదు. దీనిని తలఁచుకొన్నచో నదియు నీ మహాసౌఖ్యప్రవాహమున గలసిపోయి విడఁదీయకున్నది. ఇవి యన్నియు చిన్న బిందువులు. మహాప్రవాహమున బిందుపరిశీలన సాఁగనే సాఁగదు; చేయుటయు వివేకహీనత.

ఒకనాఁటి ప్రొద్దున నా నాఁడు తన తండ్రి వచ్చు నని బద్దన్నకుఁ దోఁచెను. బాదమ్మతోఁ జెప్పెను. ఇద్దఱును నివ్వెఱపోయిరి. వారికి నాశ్చర్యము వేసెను. ఈ లిప్తపూర్వమువఱకు నీ భావమే లేదు. ఇందుకుఁ బూర్వము నివ్వెఱ లేదు. ఇప్పు డీ నివ్వెఱ యెచ్చటనుండి వచ్చినది. ఈ వార్త నాల్గుదినముల

క్రింద దెలిసినచో నిట్లుండునా? అప్పటి తమయెడ శ్లైభుఁగని స్థితిలోఁ బెఱభావముయొక్క ముద్ర వారి మనస్సులమీఁదఁ గలిగియుండునా; ఏడు దినములు గడచినతర్వాత పెఱభావముయొక్క ముద్ర తమ మనస్సులమీఁదఁ గలుగునంత విరళత తమ ప్రేమభావమునకుఁ గలిగెనా? అట్లు కలిగినచో మఱికొంత కాలమునకు నా ప్రేమభావము మఱెన్నని యితరభావములకుఁ జోటిచ్చునుగదా! అంత చిక్కని యీ ప్రేమభావము వారము దినములలో నిట్లు సంగుపడలుట యేల! ఈ దోష మెచ్చట నున్నది. అనుభూతిలో నున్నదా? ఒక భావము చిక్కగానుండి యనుభూతిచేతఁ బలుచఁబడుట చిత్రముగా నున్నది. ఒక ద్రవ్యము కొంతభాగము వ్యయమై విరళవిరళమగును. అది కంటికిఁ గనిపించును. ఒక భావము అనుభూతివశనందుట వ్యయమగుటవంటిది కాబోలు. అంశకనియే తరువాత దానికి విరళతావశ ప్రాప్తించుట.

బద్దన్న తాను దుర్జయమునందునిపోయి చూడవలయు నసుకొనెను. నాగయ్య చెప్పినది దానికి సాఁపోయినది. నాగయ్య వార్త తేకమునుపే నంబయ్య, మంచయ్య, గొంకయ్యలలో నతని మనస్సు మంచయ్యమీఁద నిలచుట యతని పక్వమైన యంతఃకరణమునఁ గనిపించెను. ఇదివఱకు తానొక్కఁడే మంచయ్యకడకుఁ బోనెంచెను ఇప్పుడు బాదమ్మతోసహా పోనెంచెను. తన తండ్రి ఆ రాత్రి తెల్లవాఱినవేళ వచ్చును. తానును బాదమ్మయు నా రాత్రికే వెడలిపోవునట్లు నిర్ణయించుకొనిరి. బాదమ్మయొక్క సుఖమునకు మేఱ లేదు. బద్దన్న యున్నచోఁ గల విశ్వాసము పూర్వమునకుఁ బదిరెట్లయ్యెను.

ఆ నాఁటిపగ లెల్ల నెండలు గడచిన వారముదినముల కన్న నిబ్బడిగాఁ జల్లనైనట్లు కనిపించెను.

## ౭

అర్ధరాత్రమున కృష్ణమీఁద ప్రయాణము, తరువాత తెల్లవారలు శతసహస్రదేశమున నడక. తెల్లవారు నప్పటికి బద్దన్న బద్దన్నయని యెరిగిన యూళ్ళలో లేడు. తరువాత నెవరైన నీపేరేమని యడిగిన నాగన్నయని చెప్పుచుండెను. ఆమె తనకు భార్య. చూచినచో బాదమ్మ ముప్పదియేండ్ల మనిసివలె కనిపించదు. ఇరువదియేండ్లుగాఁ గనిపించును. వయస్సు పారువోనిది. భార్యాభర్తలు కావచ్చును. ఇద్దరినడుమ కొన్ని నెలలు భేదము. చేసికొన్నారు కాబోలు. బాదమ్మ పేరు వెంకమ్మ. ఆ నాఁ డొకయూరిలో మజిలీ. కృష్ణలో నర్ధరాత్రమున చెట్టాపట్టాలు పట్టుకొని తొడలలోతు నీళ్ళలో నడచునప్పుడు బాదమ్మ భయము, బద్దన్న యాలంబముగుట, శరీరముల మిక్కిలి దగ్గరతనము, తాను బాదమ్మ కాలంబముగుట, బాదమ్మకు బద్దన్న యాశ్రయమైనాడన్న భావము, దారివెంట నామె యతని భుజముపై చేయివేసి నడచుట, యతఁ డామె కట్యాదుల నిరంతరస్పర్శసుఖ మనుభవించుచుఁ బోయినంత మేఱ పోవుట; బద్దన్నకా ప్రయాణము గొప్ప రాజకీయవ్యవహారముమీఁద పోవుచున్నట్లు లేదు. ఏదో వేల్పుపేటికి పూల తెరువు వెంటఁ బోవుచున్నట్లుండెను.

ఈ ప్రయాణ మేడుదినములు సాఁగెను. రాత్రులయం

దేదో యుకోయూరక నిలుచుచుండిరి. బాదమ్మ కోపికగా లేనప్పుడు మఱునాఁడు ప్రొద్దుటిపూట నాయూరిలోనే యునికి. ఏ గొడ్లపాకడిలోనో వండుకొని తినుట; పండుకొనుట. ఆ పూటకుఁ గావలసిన ఉప్పు, పప్పు తాను కోమటింటికిఁబోయి తెచ్చుట బద్దన్నకు మొదటిసారి సంసారానుభవము. ఆమె యది తీసికొనిరమ్మనును. ఇది తీసికొనిరమ్మనును. బద్దన్న యొకటి మఱచిపోవును. ఆమె మఱల పొమ్మనును. మొదటి సారియే యామెను వదలిపోవుటకు బద్దన్న కిష్టములేదు. రెండవసారి యసలులేదు. ఇట్లొకపూట యేదో పదార్థము లేని తిండి. ఆ తినుచు సయించకపోవుట. సయించకపోయినను సయించినట్లు నటించుట. ఆలోపము తమ ప్రేమకొక యంగము. ఆ యుంగానుభూతికి కిలకిలారు నవ్వులు. భుజములు భుజములు రాచుకొనటలు. నాకక్కఱలేదని త్రోసివేయుటలు. చిరు కోపగింపులు. ఎంగిలి చేతులతో నొకరియొడులలో నొకరు పండుకొనటలు. చూడని యెవరో చూచుచున్నారని శంక రించుకొనుటలు.

వారము దినములకు నాదెండ్ల చేరిరి. బద్దన్న నాదెండ్లలో నున్న క్రొత్తగా నేర్పాటైన సైన్యముయొక్క నాయకుఁ డెవరో తెలిసికొనెను. అతనితో స్నేహము చేసెను. తనది కొన్వాక యని చెప్పెను. ఆయూరి సైన్యములోఁ దానొక బంటని చెప్పెను. ఆనాయకుఁడు క్షత్రియుఁడు. తాను పంచముఁడు. అయినను నిద్దఱికి స్నేహము కుదిరెను. ఆ నాయకునిపేరు గంగచోడుఁడు. వారిది పూర్వము కళింగదేశము. వారి తాతలాయూరు వచ్చి దుర్జ యులవద్ద నుద్యోగము కుదుర్చుకొనిరి. బద్దన్న తనపేరు చెప్ప

కుండ వార్తలు తెలిసికొనెను. తన్ను గుఱించి గంగచోడునకు గొప్ప సదభిప్రాయము. గంగచోడునకు బద్దన్న తన కులము వాడని తాను ఆ సైన్యములో నొక్క డని, స్నేహము చేసితి నని చెప్పెను. దుర్జయుఁడు డీ దండయాత్రనుగూర్చి యే మనుచుండె నని యడిగెను.

గంగచోడుఁ డిట్లు చెప్పెను. "ఆయన కింతవఱకెది యేమియుపట్టలేదు. బద్దన్న యెవరినో యింకొక రాయబారిని పంపించును, లేదా నంబయ్యవద్దనుండి యేదో వార్త వచ్చునని యూరకుండెను. బద్దన్న తానే యా రాయబారి ననెను. గంగ చోడుఁడు పూర్వము చెప్పలేదేమి యనెను. బద్దన్న క్రమ ముగాఁ దానే బద్దన్న నని చెప్పి యిది రహస్యముగా నుంచు మని చెప్పెను. గంగచోడుని సాహాయ్యముతో బద్దన్న కొక నాఁడు రాజదర్శనము కలిగెను.

బద్దన్న-దొరా! గంగచోడుఁడు దుముదారు కాదగిన వాఁడు. మందయ్య-అట్లే చేయుదము. మఱిముందు చేయవలసి నది యేమి. బద్దన్న-ఆషాఢమాసము వచ్చినది. వర్షములు ప్రారంభించును శ్రావణాంతమునకు వర్షములు విజృంభించ వచ్చును. ఆ నడివర్ష కాలమున మనదేశములో నచ్చట నున్న చళుక్యసైన్యము నచ్చట బంధించుటయో, నాశనము చేయు టయో జరుగవలెను. వెంటనే మనసైన్యములను రాష్ట్రపు టెల్లలయందు సిద్ధము చేయవలయును. ఇప్పటి కిఱువది రెండు వేల సైన్యము నాది. పదునారువేల సైన్యముమీఁది. పదివేల సైన్యము సైన్యాధిపతిది. మొత్తము నలుఁబది యెనిమిది వేల సైన్యము. పదునేనువేలసైన్యము గోదావరి దాటించి యనంత

వర్మ చోడగంగుని సైన్యము నెదిరించుటకును, పదునేను వేల సైన్యమును నాగార్జునుని కొండవైపునకు పశ్చిమ చళుక్య సైన్యము నెదురించుటకును బంపవలెను. తక్కిన పదు నేనిమిదివేల సైన్యమును పశ్చిమ చాళుక్యుల నెదురించు సైన్యమునకు బాసటగానుంచవలెను. మందయ్యా—అట్లయినచో అనంతవర్మ చోడగంగుని నెదిరించు సైన్యమునకు బాసట యేది? బద్దన్న—కొప్పాకలో పదుమూడువందలమంది మా కులస్థుల సైన్యమున్నది. అదిబాసట. మందయ్యా—పదుమూడు వందలమంది చాలుదురా? బద్దన్న—ఆ సైన్యము పేరు హనుమ దళము. దానిని నడుపువాఁడను నేను. బుంగన్న యని నాక్రింది సేనాని. ఆ పదమూడువందలమందియు పదునేను వేల సైన్యము పెట్టు. మందయ్యా— (నవ్వి) నా కేమియు తెలియదు. నీవును నంబయ్యగారును నెట్లుచెప్పినచో నట్లు చేసెదను. బద్దన్న— ప్రభూ! మీరు చెప్పినచో చేయవలసినవాఁడను నేను. గోదా వరియవతలకు తక్కువ సైన్యము పంపించుచున్నాము. అచట సేనానాయకులు తమ రుండవలయును. మందయ్యా—నీ వుండ రాదా? బద్దన్న—నే నుండవచ్చును. ఉండరాదు. మీరైనచో నంబయ్యగారు కాదనరు. నే నన్నచో వారికి నమ్మక ముండ వచ్చును, లేకపోవచ్చును. మందయ్యా—ఈసంగతి నంబయ్య గారితో చెప్పుము. బద్దన్న—ఇది నేను చెప్పినట్లు చెప్పను. తమరే యిట్లని రని చెప్పెదను. మందయ్యా—నిన్ను చూడక మునుపే నీ వెంతవాఁడవో నాకు తెలియును. బద్దన్న—ప్రభువుల యనుగ్రహము. మందయ్యా—ఈ నాడెందులవిషయమున పశ్చిమ చళుక్యుల జాగ్రత్త తక్కువ. ఈ క్రొత్తసైన్యము సగానికి

పగము క్రొత్తది. సైన్యముగా తీర్చి నిలుచున్న స్థితి నడుమ వలసిన సంగతులు తెలియనిది. కనుక వారికి శిక్షణ తొందరగా ప్రారంభింపవలయును. మావైపు సైన్యములశిక్షణ వెంటనే ప్రారంభించుటకు వీలు లేదు: వర్షాకాలములోగాని యది ప్రారంభింపబడదు. చేబ్రోలు వేంగినాడుల సైన్యములలో నెక్కువ మంది ప్రాతశిక్షితులుందురు. మా సైన్యములలో పదివేలవఱకు ప్రాతసైనికులు. ఈ ప్రాతసైనికులందఱను తీర్చి సేనగా నాగార్జునకొండ రంగమునకు పంపింతము. తక్కిన సైనికులకు వెనుక శిక్షణము జరుగుచుండును. పశ్చిమ చళుక్యసైన్యము వచ్చునప్పటి కాలస్యమగును. అనంతవర్మ చోడగంగుని సైన్యముతో వెంటనే యుద్ధము చేయవలసి యుండును. కనుక నీ పదునారువేల సైన్యమునకు నీలోపుగా శిక్షణ జరిగినచో వెంటనే తూర్పునకు పంపించవచ్చును. మండయ్యా—ఇది యంతయు నంబయ్యగారితో నేను చెప్పినట్లే చెప్పుడువా? బద్దన్న—తమరు చేబ్రోలు రావలయు నని నా మనవి. మండయ్య—నీవు ముందర పొమ్ము. నేను తరువాత వచ్చెదను. బద్దన్న— నే నిచ్చట నొక పదినెనము లుండవలెను. అన్ని గ్రామములకుఁ బోయి యూరిగుంపులు దళములు సేనలై ట్లేర్పాటు చేయబడినవో పరీక్షింపవలెను. దానికి మీయనుజ్ఞ కావలయును. మండయ్య—బద్దన్న ! నీ వంటివాఁడు చేసినపనిని నేను కాదనను. మే మేడేండ్లు నిదురపోయితిమి. నీవువచ్చి మేల్కొల్పితివి. మేల్కొన్నతర్వాత మా యహంకార మెందులకు? బాదన్న—ప్రభూ! నేను సేవకుఁడను. నే నూరక యిట్లు చేసినచో బాగుగా నుండు నని మనవిచేయుచుంటిని. తమం

యనుజ్ఞ లేకుండ ముందడుగు వేయను. నేను చెప్పిన మాటలకు తమ యంగీకార మైనచో, సైన్యాధిపతివద్దనుండి నా కనుజ్ఞ యిప్పించినచో నేనిట్లు చేయుటకు వీలుండును. ప్రభువువారి దర్శనము చేయుటకు నాకు భయముగా నున్నది. తమరి యనుగ్రహము నాయందున్నచో నిది కొనసాగగలదు. మందయ్య- ఇది యంతయు నీయిష్టము వచ్చినట్లు చేయుము. నేను నంబయ్య గారిచేత 'ఊఁ' అనిపించెదను. గొంకభూపతిచేత నొప్పించెదను. బద్దయ్య- నేను తమరి దర్శనము చేయుకముందు పాపయ్య తమ వద్దనుండి వచ్చి తమకు నా యెడగల దయ నాతో చెప్పక ముందు, తమరికి నాయందింత యనుగ్రహము కలదని నే నెరుగుదును ప్రభూ! కళింగదేశములో నీగడచిన సంవత్సరము పంటలు సరిగాలేవు: అచ్చటి కెగుమతి చేయుమిషతో తమ రాష్ట్రమునుండి నాల్గుయిదు పుట్లధాన్యము గోదావరి యవతలకు రాజమహేంద్రవరము చేర్పించినచో మనసైన్య మచ్చటికి చేరునప్పటికి భోజనసదుపాయము లేర్పాటగును. నే నిట్టిదేదో ప్రయత్నము చేయుచున్నానని విజయవాటమునందలి రాజాధికారులకు నలికిడి కలదు. రెండేరుల నడిమినాటినుండి ధాన్యమెగుమతి జరిగినచో నా రాకట్టుదురు. అందుచేత మనవిచేసితిని. మా దేశములో నేనును ధాన్యముల వాగ్దానము కొంటిని. అది యీలోపుగా కృష్ణ దాటించెను. తరువాత వేంగిదేశపు టెల్లలయందు సమకూర్చెదను. అచ్చటి సైన్యములకు నది యుపయోగపడును. మందయ్య-(నవ్వుచు) మీ తిండి మీరు తిందురు. మా తిండి మేము తిందుము. బద్దన్న-ప్రభూ! నాకట్టి భావము లేదు. రహస్యము రక్షింపఁబడుటమాత్రమే నాయూహ.

మందయ్య—కాదయ్యా! నిన్ను నేను మనసులో మెచ్చుకొనుచుంటిని. బద్దన్న—దొరా! మఱియొక మనవి. ఈ యేడేండ్లనుండి మా సీమలోని జనులు తమ యాయుధములను బైటికి తీయలేదు. క్రొత్తఖడ్గములు కావలయును. డాలులు కావలయును. దీనికి కావలసిన ఉక్కును, ఇనుమును, తోళ్ళును కావలయును ఇంతపని యొకచోట జరుగఁదగినదికాదు. మందయ్య—నీ కాభయమక్కఱలేదు. చోళదేశములో నేను కొందఱినెరుఁగుదును. వారు తొల్లిఁటినుండియు మనకు దీనిని పంపించుచుండిరి. మనదేశములో ప్రస్తుతము దీనిని బహిరంగముగా చేయించుటకువీలులేదు. ఆపని నామీఁద వదలిపెట్టుము. బద్దన్న—చిత్తము. తమరు మనసైన్యమును గోదావరి దాటించుటను, తగినవేళచూచి తమరే చేయవలెను. నేనీసారి వెడలిపోయిన తర్వాత మరలివచ్చుట వీలగునో కాదో! మందయ్య—దానికంత తొందర యేమున్నది! బద్దన్న—అట్లుకాదు. అనంతవర్మ చోడగంగుడు మనకు సమీపస్థుడు. పశ్చిమచాళుక్యులు దూరగులు. మన మిట్టి ప్రయత్నములమీఁద నుంటిమని తెలిసినంతనే గాంగుఁడు మనమీఁదికి తొందరగా రావచ్చును. అందుచేత మన మతనిని ముందుగానే యరికట్టవలయును మందయ్య—నీవు వచ్చుటకు వీలులేకపోవచ్చును. ఆ సమయముచూచి యెవరిచేతనైన కబురంపింపుము నేనీ లోపుగా నన్నియు సిద్ధపరచెదను. కత్తులు, డాళ్లు, నీ కెన్ని పంపించు మందువు! బద్దన్న—పదివేల జతలు చాలు. మందయ్య—వానినెల్ల నీవు పంపించవలయును. బద్దన్న—చిత్తము. మందయ్య—తరువాత గొంకభూపతివద్దనుండియో, మహాప్రభువులవద్ద నుండియో

నీకు మతిల నిప్పించును. బద్దన్న-చిత్తము. మంచయ్యా-ఈ ఖడ్గ ములు, డాళ్ళు, కవచములు నీ కెట్లు చేర్పించు మందువు. బద్దన్న-విజయవాటము పశ్చిమదిశయందు చర్మవర్తకు లున్నారు. ఇవి నాగార్జునకొండచేర్చి యచ్చటి పడవలమీఁద వేసి తోళ్ళచేతకప్పి తోళ్లుగా కనిపింపచేసి పంపించినచో బాగుగా నుండును. మంచయ్యా-ఒకవేళ పట్టుబడినచో! ప్రతి రేవువద్ద పశ్చిమ చాళుక్యాధికారులు పరిశీలనాశాఖ వారున్నారు కదా! బద్దన్న-బాగుగా మసురుపట్టినరాత్రి పంపించవలెను. పడవలు ప్రసిద్ధమైన రేవుకడ దింపనక్కఱలేదు. రేవున కొక గవ్యూతి మొగువనో, దిగువనో దింపించెదను. మంచయ్యా-మఱి నీవు పోకముం దిచ్చటి సైన్యములన్నింటిని చూచుకొని పోవలయును. బద్దన్న-(నవ్వుచు) చిత్తము. మంచయ్యా-నేను సహజముగ సోమరిని. నీకు భయమక్కఱలేదు. ఒకసారి నీ పనిలో ప్రవేశించిన తరువాత నీవలెనే యుందును. బద్దన్న-నాకంటె నెక్కువగా నుందురు. ఈ పని నా పనియేమి! ప్రభువులని చేయుచున్నారు. మంచయ్యా-ప్రభువుల పనియేమి? ప్రజలపని. ప్రభువులకేమో... పైవాఁడైనను వాని సుంకము వానికి కట్టుదురు. తమ భోగముల కెప్పుడును లోపము లేదు. ప్రజలదుఃఖములు, వారి ధర్మములు, వారి యాచారములు, వారి పాలనములు - ప్రజలవి ప్రజలకే పట్టును. రాజుల కెంతసేపటికి తమ యధికారము మాటయే. దేశము, సంప్రదాయము ప్రజల యిష్టానిష్టములు వారికి పట్టవు. ప్రజలే పట్టించుకొనవలెను. మన దేశములో గ్రామటికలుగాని, గ్రామములుగాని, నగరములుగాని, తమ తమ సభలచేత స్వతఃపాల

నమే చేయించుకొనును గాని రాజ్యములు, యుద్ధములు, వీనిజోలికి పోవు. రాజువచ్చి సైన్యములో చేరుమన్నచో చేరు దురు. సేనలకు విడుదల చేసినచో పోవుదురు. ఈనాటికి ప్రజ లకుకూడ రాజ్యవిషయము పట్టవలెనన్నవాడవు నీ వొకడవు కనిపించినావు. బద్దన్న-క్షమించవలెను ప్రభువులలో ప్రజా దృష్టితో మాటాడువా రెంతమంది యుందురు. మందయ్య-నీ కొక్క మాట చెప్పెదను. ఈ దేశము మోటుదేశము. నిన్ను తో లుత లెక్క చేయరు. ప్రసిద్ధులైన కటారికాం డ్రందఱితోడను నవసరమైన యప్పుడెల్ల కత్తియుద్ధముచేసి నీ శక్తి చూపించుము. అప్పుడు నిన్నంగీకరింతుము. నీ వెవరవో వారెరుగకుండ నుండ రాదు. చివరకు నేను నా సేనలతో యుద్ధము చేయుచది మీ ప్రాంతములో సనుచుంటివి కదా! వారు నిన్నుకూడ బాగుగా నెరిగియుండవలెను. ఈ సైన్యములచ్చటికి జేర్చుట యెట్లూహిం చితివి? బద్దన్న-కూర్మక్షేత్రములో శ్రావణపూర్ణిమకు పెద్ద యుత్సవము జరుగును. సైన్యమంతయు యాత్రికులవలె నచ్చ టికి పంపించవలెను. అక్కడికి చేరినతరువాత నాయుధములు మొదలైనవి వారికి చేర్పింపవచ్చును. మందయ్య-కృష్ణయొద్దను నుండి గోదావరికి పోవలయును. బద్దన్న-విజయవాటము రియొక్క పశ్చిమదిశయందు సన్నియు పర్వతపంక్తుల వరుసలే. అవి యున్నియు నడవులే. ఆ యడవులలోనుండి పాపికొండలకు చేర్పింతును. ఆ ప్రదేశము పశ్చిమ చాళుక్యులయు, గాంగులయు నిద్దఱి యధికారము పలుచ పలుచగా నున్న దేశము. పాపి కొండలనుండి గోదావరిమీదుగా రాజమహేంద్ర నగరము జేర్చుట సులభమైన పని. మందయ్య-సైనికులుగా జనకును

పంపింతుము. అందఱు పురుషులే పోవుదున్నచో నది సందేహ భాజనమగును. స్త్రీ బాలురనుకూడ పంపించినచో వీరిని మఱల వెనుకకు తీసికొనివచ్చుట కష్టమగును. బద్దన్న— కాంతాశిశువులు మానాటిలోనుందురు. అచ్చటినుండి పురుషులు మాత్రమే పోవుదురు. మందయ్య—ముందు శత్రునాదులు కానిమ్ము. తరువాతచూతము. బద్దన్న—మఱియొకరీతిని చేసినచో నెట్లుండునో విచారించుడు మహారాజులు గొంకభూపతులే తీర్థయాత్రకు బయలుదేరినట్లు చూపించవచ్చును. వారివెంట నీ పదునారువేల సైన్యము పరివారముగా పోవచ్చును. పోవునది గాంగదేశముపైపు. పశ్చిమ చాళుక్య సైన్యమున కనుమానము కలుగనక్కఱలేదు. ధనదపురములో నున్న పశ్చిమచాళుక్య సైన్యము నా సమయమున మనము నిర్మూలింపవచ్చును. ప్రభువు రాజధానిలోనుండగా నట్టిపనిచేయుట ప్రభువునకు మనమమర్యాదచేసినట్లుండును. ఎటుపోయి యెటువచ్చునో, జయాపజయములకు మనము నిర్ణేతలముకాదు. ఒకవేళ మన మోడిపోయినచో ప్రభువున కపఖ్యాతియుండదు ఈసంగతియే ప్రభువులకు తెలియదు. వారు తీర్థయాత్రమీద పోయిరి. ఈలోపుగా ప్రజలలో కొందఱిట్టిపని చేసిరి. ఇట్లు కొంత తప్పుకొనవచ్చును. మందయ్య—అది యంత తేలికకాదు. ఐనను ఊహకాకపోదు. ఇది మంచిమార్గమే. కాని ప్రభువు లంగీకరింపవలెను గదా! బద్దన్న—అది నంబయ్యగారిమీద నాధారపడియుండును. మందయ్య— నంబయ్యగారొక పెద్దమనిసి. ఆయనను తోచినదే కాని చేయడు. ప్రతి సంగతియు తనకే తెలుసుననుకొనును. లేకపోయినచో నేనక్కడకు గానక్కఱలేదు. నిన్ను

పంపించినచో చాలును. అయినను వేళావేళలు, కాలాకాలలు. బద్దన్న—ఇంత ప్రయత్నము చేసితిమి. అంతయు దైవముపైనాధారపడి యున్నది. మే మేమి చేయగల్గుదుము? కృష్ణయవతలి దేశము స్వాతంత్ర్యము చేయుదునా? చేసి నా భాష మాటాడు వారు, నా యాచారములు గలవారు నా వారైన మీతో గూడ పోరాడుదునా? గెలిచి వేంగినాడును రెండేరుల నడిమి నాడును ఏ రాజు చేతిలోఁ బెట్టుదును? వెలనాటి చోళు లాంధ్రులకు ప్రభువులు. వారికే యిష్టము చేసినచో నీ యుద్ధ మెవనికొఱకు చేయునది? స్వాతంత్ర్య మెవరికి కావలయును? మంచయ్య—బద్దన్నా! నీవు కష్టపడకుము. నేనును నంబయ్యగారును నీ వంటివార మైనచో నీ దేశమునకు నస్వాతంత్ర్యమే లేకుండెడిది. నా సర్వశక్తులు వినియోగించి నంబయ్య గారును మహారాజును నీ ప్రయత్నమున కభిముఖులౌనట్లు చేసెదను. కాని నీ కోర్కె—సంగతి తెలిసికొనవలయును. చివర కిది యంతయు నంబయ్యగారు చేసిరందురు. గొంకభూపతి గెలిచె నందురు. దుర్గయనాయుడు జయించెనందురు. నీ పేరు చెప్పినచో చెప్పుదురు, చెప్పకపోయినచో చెప్పరు. బద్దన్న—ప్రభూ! నా పేరెందుకు? నే నెవరను? వెలనాటి చోళమహారాజుల సేవకుడను. ఈ యుద్ధములో నా ప్రాణముపోయినచో నేను వీర స్వర్గము ననుభవింతును. ఆ స్వర్గము వెలనాటి చోళులది కాదు. ఈ శరీరము వెలనాటి చోళులది. ఈ శరీరముకలవాని పేరు బద్దన్న. ఈ బద్దన్న పేరుండి యేమి? లేక యేమి, నేను పేరు కోసము దిగులుపడుట లేదు. ఐదేండ్లనుండి, నాకు కొంచెము బుద్ధి తెలిసినప్పటినుండి చూచుచున్నాను. విజయపు రాజ్యము

౮

బద్దన్న పోయి గంగచోడుని కలిసికొనెను. తనయందు దుర్జయమందునకుఁ గలిగిన యభిమానము రాజకార్యవిషయము సానుకూలపడుటకుఁ బనికివచ్చును గాని వ్యవహార విషయములు నడుపుటకు చాలదు. రాజనుకూలుఁడుగా నుండవచ్చును. క్రింది యధికారులు మాత్సర్యగ్రస్తులై ప్రతికూలురు గావచ్చును. అప్పుడు కార్యము సరిగాఁగొనసాగదు. అందుచేత క్రింది యధికారులలోఁ దనకు పలుకుబడి సంపాదించుకొనవలయును. గంగ చోడుఁడు క్షత్రియుడు. నాదెండ్లసైన్యము గాంగులతో యుద్ధము చేయఁదగినది. గంగచోళుడు కళింగదేశీయుడు. ఆ రాజులతో నితని కేదో బీరకాయపీచుండకపోదు. ఇతని యభిమానము, ప్రేమయు గాంగులవంక నున్నచోఁ, దనకెక్కువ లాభము లేదు. బద్దన్న యిట్లనెను. 'మిత్రుడా! మందయ్యగారు నాదెండ్ల సైన్యము పదునారువేలు పుచ్చుకొని అనంతవర్మ చోడగంగు నితో యుద్ధముచేయ నెంచుచున్నా రనెను.

గంగచోడుడు వెంటనే యిట్లనెను: "వీలుగా నున్నది గదా యని గాంగులు తెలుఁగుదేశమును గదుముకు వచ్చినారు. మొట్టమొదట వారి నదుపులో పెట్టినగాని పశ్చిమ చాళుక్యుల మీఁదికి మనము పోరాదు."

బద్దన్న:-మీరు క్షత్రియులు. మీకు యుద్ధనీతి తెలియనిది కాదు. గంగ:-బద్దన్నా! నీ యుద్దేశ్యము, నా యభిమానము గాంగులవైపున నుండుననియా? ఈ దేశమునకు మా తాతగారు వచ్చిరి. మేము మూఁడుతరములుగా దుర్జయుల

యుప్పు తినుచుంటిమి. నా తెలుఁగుమాటలో. బరదేశీయులు మాటాడు యాస నీ కేమైన గనిపించుచున్నదా! నాకది లేగోయీ! నీవంటి వీరునిప్రక్క నిలుచుండి యుద్ధముచేయుట నాకొక గౌరవము. బద్దన్న:—ఎంతమాట. మైత్రి యౌచిత్యమును పాటించనీయుము. దుర్జయముందుకు నన్ను దళవాయిని చేయుదు నన్నారు. నా యుద్దేశ్యము సేనానిని చేయవలయు నని. నీ వంటివాడు నాయకుఁడుగా నుండుట మంచిదిగాదు. గంగ:—నావంటి వాఁడనగా! బద్దన్న:—నీవంటి వీరుఁడు, యుద్ధనీతి తెలిసినవాడు నని నా యూహ. గంగ:—యుద్ధనీతి యేదో యందఱకు తలాకొంచెము తెలియవచ్చును. కవిత్వము, సంగీతము, వైద్యము నెట్టిదో యుద్ధనీతియు నట్టిదే. అందఱకు తెలిసినట్లుండును. నేను వీరుడనని నీ కేమి తెలియును! బద్దన్న:—నీ యాకృతినిబట్టి తెలిసికొనలేనా? గంగ:—పైకి పొన్నకాయవలె నుండవచ్చును. లోన డొల్లకావచ్చును.

అని గంగచోడుఁడు బద్దన్నను తనవెంట రమ్మనెను. అప్పటికి ప్రొద్దు వాటారబోవుచుండెను. తన యింటి వెనుక పెద్ద ఖాళీస్థల ముండెను. గంగచోడుడు బద్దన్న నట నుండుమని తాను పోయి పదినిముసములలో రెండుఖడ్గములు, రెండు డాళ్లును తీసికొని వచ్చెను. బద్దన్న నొకఖడ్గము, నొకడాలును తీసికొమ్మనెను. బద్దన్న యనుమానించెను.

గంగచోడుడు:—'కానీవయ్యా! నీకో, నాకోను. ఒక చిన్నగాయము తగిలినచో తగులనిమ్ము. వీరున కా మాత్రము తగులదా? బద్దన్న:—ఇది మన మైత్రికి తగినదికాదు. గంగ:—

ఏమి తగినదికాదు! నీవు నన్ను గెలిచినచో నే సహాయపడుదు నని నీ యుద్దేశ్యమా?

బద్దన్న మరుమాటాడకుండ కత్తిని తీసికొనెను. ఇద్దరును బరిలోనికి దిగిరి. మొదట కొంతవఱకు స్నేహముగా సాగెను. యుద్ధసహజములైన యావేశము లెక్కెను. ఒకరి కన్న నొక రధికులమని చూపించుకొన నారంభించిరి. బద్దన్నకు గాయములు తగిలెను. గంగచోడునకు గాయములు తగిలెను. గంగచోడుడు ప్రదర్శించిన కొంత నైపుణ్యము బద్దన్న తెలిసి కొనలేకపోయెను. బద్దన్న పటిలాఘవముతో దాని కొడ్డు కొనెను. బద్దన్న యాగి యిట్లనెను: 'రాజా! నీ విద్యలో నీ కొంతభాగము మా దేశసంప్రదాయములో లేదు. గంగ:— ఇది కళింగదేశ సంప్రదాయము. మా తాత మా తండ్రికి చెప్పెను: మా తండ్రి నాకు చెప్పెను. బద్దన్న:—నీవు యుద్ధములో నెప్పుడును దుర్జయుముందు నంటియుండవలెను. గంగ:— లేకపోయిన నేను నా రాజును వదలిపెట్టి యుందునా?

బద్దన్న మఱల యుద్ధముచేయ నారంభించెను. ఆరంభించుచునే గంగచోడుని చేతిలోని కత్తి నెగురగొట్టెను. కొట్టుచునే యాకత్తివద్దకు దూకి యా కత్తి తాను తీసికొని తన చేతికత్తి గంగచోడున కిచ్చెను. గంగచోడుడు మహానందవికసితవదనారవిందుడై బద్దన్నను కౌఁగిలించుకొనెను.

"బద్దన్నా! పదిదినములనుండి నీకు దూర దూరముగా నుంటిని. ఇంక నుండలేనోయి! స్నానముచేసి మఱల యుష్ణోపవీతములు వేసికొనెదను. సహస్రగాయత్రి చేయుదును. కాని నిన్నిప్పుడు కౌఁగిలించుకొనకుండ నుండలేను.

బద్దన్న:—"రాజా! నేను నీకీ విషయము నేర్పెదను. నీవు నీ విశేషసైన్యమును నాకు నేర్పుము". తరువాత వారిరువురు రాత్రి రెండుజాములవఱకు సాము చేయుచునే యుండిరి. చివరకు బద్దన్న యిట్లనెను: "నే నీ మెలకువలు మఱికొందఱకు నేర్పుటకు నీవు నా కనుజ్ఞ నీయవలయును. గంగ:— ఎవరికి? బద్దన్న:—గాంగులసైన్యము నీదానికి మించియుండగాదు. పదునారు వేల సైన్యముతో మాత్రమే పోవును. మన సైన్యమంతయు గాంగులమీదికి పంపించలేము. ఇటు పశ్చిమ చాళుక్యులతోఁ గూడ నొక్కసారియే యుద్ధము చేయవలయును. గాంగులసైన్య మధికసంఖ్యాకులు కావచ్చును. నీవు కోసాపక పేరు విన్నావు గదా! గంగ.— విన్నాను. బద్దన్న ఆ యూరిలోని పూకులస్థుల సైన్యము పదుమూడు వందలు పోగుచేసితిని. గంగ:— ప్రళయ సైన్యమును సిద్ధముచేసితి వన్నమాట. బద్దన్న:— ఆ సైన్యములో సగము దుర్జయమునకు సహాయముగానుండును. ఎచ్చట మన విచ్చిదల చూపునో యచట నీ సైన్యముండును. దానిని నడుపునది నేను. వారిలో కొందఱకు నేర్పవలయు నని. గంగ:—కళింగసైన్యములో ప్రతిభటునకు నివి తెలియవు. ఇవి రాజవంశీయులకు మాత్రమే తెలియును. బద్దన్న:—నేను అందఱకు నేర్పను. బుంగన్న యని నాక్రింది సేనానియున్నాడు. అతనికి మాత్రమే నేర్పెదను. నేనును, బుంగన్నయు నా పదునారువందల మందిని రెండు భాగములుగా చేసి ఇద్దఱము చెఱియొక భాగమును నడుపుదుము. నేను గోదావరివద్ద నున్నప్పుడు బుంగన్న నాగార్జునకొండవద్ద నుండును. నే నట నున్నచో నాతఁ డిట నుండును. ఈ సైన్యభాగములకు రెండే పనులు. సేనా

నాయకుల కంగరక్షకుగా నుండుట, దళములు విచ్చినచోట యాదుకొనుట. గంగ:— బద్దన్నా! అట్లే చేయుము. నీవు నా కన్న పదియేండ్లు చిన్నవాడవు. బుద్ధికి పదియేండ్లు పెద్దవాడవు. బద్దన్న:—రేపు బయలుదేరి గుంపులను, దళములను, సేనలను పోయి చూచుకొని రావలయును. నీవు లేకుండ నన్నెవ రెరుగుదురు. ఇద్దఱము కలసిపోవలయును. గంగ:—అట్లే పోవుదము. కాని యీ ప్రాంతపు జనులు వేషభాషలనుబట్టి గౌరవింతురు. నీ వా సైన్యపరీక్ష చేయబోవునపుడు సేనానాయకుని వేషము వేసికొనవలయును. లోన నినుపకవచము; పైన చేతులయందు, భుజములయందు జరీపని చేసిన బొందుల పట్టుచొక్కా, శిరస్త్రాణము మొదలైన వేషముతో పోవలయును. బద్దన్న:— వానిని నే నిప్పు డెక్కడ సంతరించుకొందును? ఇద్దఱును స్నానము చేసిరి. అల్పములైన గాయములకు వారిద్దఱు లెక్కచేయరు. గంగచోడుడు పట్టీలు తెచ్చెను. ఇద్దఱును గాయములకు వేసికొనిరి. అప్పుడు గంగచోడుడు సేనానాయకునిదుస్తులను తెచ్చి బద్దన్న కిచ్చెను. బద్దన్నను ధరించు మనెను. బద్దన్న ధరించెను. గంగచోడుడు "నీ వింక పొమ్ము. నీ భార్య! నీ కొర కెదురు చూచుచుండు" ననెను. బద్దన్న తాను కాపురముచేయుచున్న చోటికిం బోయెను. అత డా ప్రొద్దుట జాముప్రొద్దెక్క ముందింటివద్దనుండి బయలుదేరెను. ఆమె యొక్కతెయు బిక్కు బిక్కు మనుచుండెను. ఇతడు సేనాపతి వేషముతో పోగా నామె యెవరో క్రొత్తపురుషుడు వచ్చెనని కెవ్వున కేకవేసి కూలబడెను. బద్దన్న నవ్వెను. నవ్వినతోడనే యామెకు తెలిసెను. ఆమె భయముతీరి వచ్చి కౌగిలించుకొని 'రాజుగారు నీకివి యిచ్చెనా'

యని యడిగెను. 'బద్దన్న రాజీయలేదు. రాజిచ్చెను' అని చెప్పెను. రేపటినుండి మన మీయూరు వదలిపోవుచున్నాము. ఊరూరునకుఁ బోవలయును. నీ విచ్చట నుందువా? నా వెంట వత్తువా? నీవిచ్చటనున్నచో బాగుగానుందు'వనెను. బాదమ్మ—నేను నీ భార్యను కానని నీ మిత్రునితో చెప్పితివా? బద్దన్న—చెప్పలేదు. బాదమ్మ—చెప్పినచో మంచిదిగదా? అటో యిటో తేలిపోయెడిది. బద్దన్న—అటోయిటోయేమి, తేలిపోవుటయేమి? బాదమ్మ—నీకు యుద్ధవిషయములయం దున్నంత యాలోచన మఱొక విషయమున లేదు. నీ వనినచో గంగచోడుడు స్నేహము చూపించుచున్నాడు. నేను నీ భార్యను కానని నన్ను నీవు లేవదీసికొనివచ్చితి వని తెలిసినచో నాయనకు నీ యందున్న గౌరవము, స్నేహము చెడిపోవచ్చును. ఆ స్నేహము ముందు చెడిపోకుండుట మంచిదియో, చెడ్డయో యిప్పుడే తెలిసినచో నీతో వారికి పనియున్నదికాబట్టి దీని నిప్పుడు వారు సహించవచ్చును. ముందు ముందు నీకు విరోధు లెక్కువగుదురు. అప్పటికి వారి మనస్సు నీయందు విరుగుట కిది కారణము కావచ్చును. బద్దన్న—నీ వనునది నాకు తెలియుటలేదు. నాలో స్త్రీవాంఛయున్నది ప్రారంభమైనప్పటినుండి నేను నిన్నే ప్రేమించితిని. అప్పటినుండి నీవును నన్ను ప్రేమించితివి. మన మిద్దఱము ననుభవించుచున్న యీ సుఖము జగత్తులో మఱియే యిద్దఱు స్త్రీపురుషులు ననుభవించరు. ఇది భగవంతుడు చేసిన పని. నీవును నేనును చేయలేదు. దీనికి లోకము మనలను నిందించినచో భగవంతునియొక్క యుద్దేశ్యము తెలియకపోవుట యగును. బాదమ్మ—ఇట్టి వాదన, నీవును నేనే గాదు,

లోకములో జారులంపటు చేయవచ్చును. బద్దన్న—మనము చేయుచున్న పని తప్పందువా! బాదమ్మ—లోకము దృష్టిలో తప్పే బద్దన్న—మన దృష్టిలో కాదు. బాదమ్మ—మనము మనముగా బ్రతుకుటలేదు. లోకములో నున్నాము. నీ వీయుద్ధపు గొడవలు మాని మన మేయడవులకో పోయి, యే సెలయేటి యొడ్డుననో యొక గుడిసె వేసికొనియుందము. మనము మానవుల కంటబడము. అప్పు డిది తప్పని నా కనిపించదు. ఇప్పుడు మాత్రము తప్పే. బద్దన్న—ఈ యుద్ధమును వదలి నే నిప్పుడెట్లు రాగలుగుదును. దుర్జయసుందుని నిందులో కంఠముదాక దించితిని. బాదమ్మ—ఆయనను కంఠముదాక నే ముంచితివి. నన్ను తలమునిగి తాటిప్రమాణముదాక ముంచితివి. బద్దన్న—నీ వొక సామాన్యవ్యక్తవి. మందయ్యగారు ప్రభువు. బాదమ్మ—ప్రభువనగానేమి! ధనవంతులు. నీకాయన యెక్కువయు, నేనుతక్కువయు. బద్దన్న—ఎక్కువ తక్కువలు చూచినచో నీవే నాకెక్కువ. నా ప్రాణమవు. మందయ్యగారు ప్రభు వనగా వేలకొలది ప్రజల కాధారమైనవాడు. ఈ యుద్ధము మానినచో నాంధ్రదేశమంతయు నష్టపడును నిన్ను వదలినచో నే నొక్కడనే నష్టపడుదును. బాదమ్మ—అయినచో నీవు నన్నైన వదలుదువుగాని దేశమును వదలవు. బద్దన్న—నేను నిన్నును వదలను, దేశమును వదలను. ఈ దేశముతో నా కింకొక్క యేడాది పని. నీవు నాకు జీవితాంతము కావలసినదానవు.

బాదమ్మ మరల మాటాడలేదు. బద్దన్న యామెను కౌగిలించుకొని యిట్లనెను. "నీ కౌగిలింత నా కంత సుఖము కలిగించుటలేదు, నా యుత్సాహము నంతయు జెడగొట్టితివి,

నేను సేనానాయకుని వేషముతో వచ్చిన నీవు నన్ను చూచి సంతోషింతు వని యీ యుత్సాహముతో నేడు మహానంద మనుభవించవలయు నని వచ్చితిని. నీవు దాని నంతయుఁ బాడుచేసితివి.

బాదమ్మ—నీకు నాయందుగల ప్రేమ యిట్టి చిన్న విషయములచేత కదలబారునది యౌనేని దాని కొఱకు నీవు నన్ను లేవదీసికొని రానక్కఱలేదు. బద్దన్న—నేను నిన్ను లేవదీసికొని రాలేదు. నీవే వచ్చితివి.

ఈ మాటలతో బాదమ్మ యేడువ నారంభించెను. ఆ యేడుపు సముదాయించుకొనుటకు బద్దన్నకు చాలకాలము పట్టెను. ప్రొద్దుటినుంచి యిద్దఱకు భోజనములేదు. అది చెప్పటికిఁ బోయెనో యన్న దిగులుతో బాదమ్మ వంట చేయలేదు. బాదన్న తెచ్చిన జొన్నలు దంపుటకు పదిగుంటల దగ్గరకుఁ బోయెను. ఎవ్వరు నీవు పంచమురాలవని దంపుకొన నీయలేదు. వీథినడుమనున్నగుంటవద్దకు బోయెను. అచ్చట నలకాజనము వందమంది యుండిరి. అచ్చటను వీలుగలుగలేదు. అందుచేత వంటచేయలేదు. ఇదియిట్లుండగా వీరికోపములు, తాపములు తీరు వేళకు రాత్రి రెండుజాములు దాటెను. అట్లే పండుకొన వలసివచ్చెను. బద్దన్నకు పట్టరానంత యాకలి యగుచుండెను. జాము జామున్నర చోడగంగునితో సాముచేసెను. ప్రొద్దున బాదమ్మ పోసినగంజి త్రాగి పోయెను. ఇంతవఱకు నదియే యాధారము. ఈ యాకలితో బాదమ్మకన్న నెక్కువ బాధ పడుచుండెను. ఇద్దఱికి ప్రసన్నత కలిగినను క్షుద్బాధచేత నెవరికి వారు పండుకొనిరి. ఇద్దఱకు నిదురపట్టలేదు. బాదమ్మ

మఱల ననియెను. "నేనే లేచివచ్చితి నందువా? నీ నక్కఱ లేదు. బొమ్మనక పోఁబోతివా!" యని.

బద్దన్న-ఇందులో నొక రహస్య మున్నది. నేను నీవు రావలయు నని కోరుచుంటిని. నీవు నన్ను కోరుచుంటివి. నేను నిన్ను ప్రోత్సాహముచేసి తీసికొని వచ్చుటయో, నీ యంతట నీవు వచ్చుటయో, రెంటిలో నేది జరిగినను నిద్దఱికి కోర్కులు జతపడుట, పైకిమాత్రము నిట్టి సందర్భములలో నెవరో, యొకరే చేసినట్లు కనిపించును. చేయుట తప్పించును.

బాదమ్మ-మఱల మాటాడ లేదు. కొంతసేపటి కిద్దఱును నిదుర పోయిరి. తెల్లవారి ప్రొద్దెక్కువఱకు నిద్దఱకు మెలకువలు రాలేదు. గంగచోడుడు ప్రొద్దుననే నిదురలేచి బద్దన్నకొఱకు వచ్చెను. బద్దన్నను నిదురలేపెను. అతని మొగము చూచి నంతనే రాత్రి పస్తున్న సంగతి తెలిసెను. ఒక గడియసేపటిలో గంగచోడు నింటినుండి బద్దన్న బాదమ్మలకు శాల్యన్నము, మధుర మధుర వ్యంజనములు, గడ్డపెరుగు వచ్చెను. బాదమ్మయు, బద్దన్నయు వానిని కడుపార నారగించిరి. అహో! శరీర ధర్మము. కడుపునిండిన సమయమున విపరీతభావన లేమియు నుండవు. ఆ యిద్దఱ కా పగలంతయు నిశాసమయ మయ్యెను.

తరువాత రెండుదినములకు గంగచోడ బద్దన్నలు రహస్య సేనాపరీక్షార్థము బయలుదేరిరి. ఇద్దఱును కలసిపోవుట న్యాయముగాఁ దోచలేదు. అది యనుమానమునకుఁ గారణము కావచ్చును. బద్దన్న చెప్పిన పథకము ప్రకారము నాడెండ్ల విషయమునకూడ సైన్యము లేర్పాటుచేయఁబడెను. ఊరూర నొకగుంపు. ఆ గుంపునకొక నాయకుడు, పదియూళ్ళలకుఁ గలి

సిన యీ గుంపు లొకదళము. దానికొకదళవాయి. ఇట్టి పది దళము లొక సైన్యము. దానికొక దుముదారు. ఈ సైన్యము లన్నియుకలసి సేన, దానికి సేనాని. ప్రతియూరునకుఁబోయి గుంపు లను, నాయకులను, పరీక్షచేయుట కష్టమైనపని యగును. అందు చేత పదిమంది నాయకులను దళవాయియున్నచోటికి రమ్మన మనివార్తయంపుట. అచ్చట దళవాయిని, నాయకులను సమా వేశపఱచి వారితో మాటాడుట, మొదట నందఱు దళవాయు లను నిట్లు చూచి తరువాత దుముదారులను సమావేశపరచి వారితో ప్రసంగించుట-ఇట్లుగా నేర్పాటుచేసి కొనిరి. ఒక దళ వాయి యున్న యూరు ముందు బద్దన్న యెవరో పరదేశివలె పోవును. అచ్చటకు గంగచోడుడు తా నేదో పనిమీాద వచ్చు నట్లు వచ్చును. ఏ రాత్రిసమయమందో వారు సమావేశమగు దురు. ఇది నిర్ణయము.

బద్దన్న బయలుదేరునపుడు దుర్జయమందుని దర్శనము మఱొకసారిచేసెను. ఆయనతో, గంగచోడుని ఖడ్గవిద్యానైపు ణ్యము, యుద్ధనీతిపరిజ్ఞానము చెప్పెను. "ప్రభూ! తమరుపోయి ప్రతిదళవాయిని ప్రతిదుముదారును చూడఁజాలరుకదా! గంగ చోడుడు మీా క్రింది సేనాని యైనచో నాయన యీ పని యంతయు చేయవచ్చును. నేనును, గంగచోడుడును కలసిపోవు చున్నాము. తమ యాజ్ఞాపత్రమైన లేనిచో మమ్మెవరు మన్నింతు"రనెను. దుర్జయనందుడు గంగచోడుని సేనానిగా నియమించి యాజ్ఞాపత్ర మిచ్చెను.

ఈ యాజ్ఞాపత్రముతో నిద్దఱును బయలుదేరిరి. గంగ 'డుడు తానొక చోటికి వచ్చుచుంటి నని కబురంపించును

బద్దన్న బొడమ్మలకు వసతి, తనకు వేఱే వసతి వారేర్పాట్లు చేయుదురు. వీరు పోవుదురు. వారిరువురకు నొకరి కొకరికి సంబంధ మున్నట్టు లెవరికి తెలియదు.

బద్దన్నను చూచి చాల మంది యాశ్చర్యపోయిరి. అందులో కొందఱికి బద్దన్న సంగతియే తెలియదు. బద్దన్న కరవాల భైరవుని సంహరించిన వార్తయే యెఱుగరు. మఱి కొందఱు బద్దన్నను చూచి ముభావముగా నూరకుండిరి. బద్దన్న తమ సాటివాడు కాడు. తమకు సేనాని కాడు. తమకు సేనానాయకుడును, ప్రభువును దుర్జయుమందుడు. ఈ బద్దన్న యెందుకు వచ్చెనో యెవరికిఁ దెలియదు. వారిలో చాలమందికి నీస్వాతంత్ర్యయుద్ధ మంతయు దుర్జయుమందుడే సంకల్పించెనని. అతని యాజ్ఞాప్రకారమే యీ దళములు సమకూర్పఁబడుచుండె నని యూహ.

బద్దన్న యెవరెట్లనుకొనినను లెక్క చేయలేదు. అందఱి దుముదారులతో, నందఱి దళవాయులతో బద్దన్న యేదో కల్పించుకొని మాటాడును. లోకాభిరామాయణముగా వారి వారి శక్తులను పాండిత్యమును తాను కొలుచుకొనును. ఎవడు సాహసి? ఎవడు తన దళమును స్వతంత్రముగ నవసరము వచ్చినచో ముందుకు దూకించఁగలడు? ఎవఁడు తన సేనను అనుజ్ఞలలోఁ బెట్టఁగలడు? ఈ విషయములు గుర్తుపెట్టుకొనుచుండును. ముప్పదిమంది దళవాయిలు, ఎన మండుగురు దుముదారులు నాదెండ్ల విషయమున నుండిరి. మఱి యింక కొన్ని యూళ్ళలో గుంపులే యేర్పాటు కాలేదు. గంగచోడునియందు వారందఱు గౌరవము ప్రకటించిరి. కా

దుర్జయుండుడు వచ్చినచో వారెక్కువ శ్రద్ధ నవలంబించెడి వారుగాఁ గనబడిరి. బద్దన్న చూచెను. ఇంతవఱకుఁ బన్నెండు వేల సైన్యమే యేర్పాటైయుండెను. ఇంక నాల్గువేల సైన్యము కొఱతగా నుండెను సుమారొక వంద గ్రామములు హోయిసాల రాజ్యపు టెల్లలలో నుండెను. అచ్చటి ప్రజలు హోయిసాలుల యధికారము క్రిందివారో, దుర్జయుండుని యధికారము క్రిందివారో తెలియకుండనుండెను. దుర్జయుండుని యధికారులు కత్తులతో, గుఱ్ఱములతోఁ బోయినచో సుంకములిత్తురు. లేనిచో చెల్లింపరు. ఒక్కొక్కప్పుడు హోయిసాల రాజులును వారి నుండి పన్నులు పుచ్చుకొనుటకలరు. మొత్తముమీఁద వారికి దుర్జయుండుడన్నచోఁ దమ ప్రభువన్న భావ మంత దట్టముగా లేదు. వారికి స్వదేశాభిమానముకూడ తక్కువగా నున్నట్లుండెను. ఆయూళ్ళలో సగానికి సగము తెలుగుబాస మాట్లాడెడివారు లేరు. అచ్చట నాల్గువేల సైన్యమును సమకూర్చుట యెట్లో బద్దన్నకుఁ దెలియలేదు. బద్దన్న గంగచోడుని వదలి యాయూళ్ళలోనికిఁ బోయెను. ఊళ్ళకు, పంచముల వాడలకు భేదము కనిపించెను. పంచముల వాడలలో సర్వజనులు తెలుఁగు మాటాడెడివారు. ఊళ్ళలో నట్లుకాదు. అందుచే బాదన్న తానెట్లో యీ నాల్గువేల సైన్యమును నా యూళ్ళ వాడలయందు సమకూర్పనెంచెను. పదియూళ్ళ పోయి యచ్చటి వాడపెద్దలతో నీ సంగతి రహస్యముగా ప్రసంగించెను. వారిలో నల్గురిభిక్షుకులుగాఁ గన్పించిరి. ఎట్లయిను తాము చేయఁదలచుకొన్న కార్యము కష్టమైనదిగాఁ గానుపించెను. బద్దన్న యొక్క యెత్తెత్తెను. ఒకవార్త యీ నంద

పాడలలో వ్యాపింపఁజేసెను. కంతేసవాటివిషయమునుండి యెవరో యొక కత్తిసామరి వచ్చెను. అతనిని గెలిచినచో నతఁడు వేయినిష్కము లిచ్చునని యొకయూరిలో నీపందె మేర్పాటు చేసెను. అతఁడు పంచమకులస్థుఁడు. పంచములతోడనే యుద్ధము చేయునని. ఇట్లు చేయుటకు బద్దన్నకు వేఱేకారణముండెను. గ్రామములోని యుత్తమకులస్థులు మిశ్రభాషలు మాట్లాడు వారు. స్వదేశాభిమానము తక్కువగాఁ గలవారు. ఇట్లయినచో నీరహస్యము తనకులస్థులయందే యుండును. అతనితోఁ గత్తి యుద్ధము చేయుటకు వందమందివచ్చిరి. బద్దన్న వారితో ననెను: "మీయందఱితో నేను యుద్ధమెట్లు చేయుదును. మీలో మీరు యుద్ధములు చేసి యధికులైనవారు పదిమందియైనను వారితోఁ జేయుదును ఈ పదిమందిలో నన్ను పదిమందియు గెలిచినచో నొక్కొక్కనికి నంవసిష్కములు వచ్చును. కనుక మీయంద ఱిలో నధికుఁ డొకఁడని తేల్చినచో వానితో నేను యుద్ధము చేసెదను అతఁడు గెలిచినచో వేయి నిష్కము లతని కిత్తును. కనుక మీలో మీరు యుద్ధముచేసి చివరకు గెలిచినవాఁడు నావద్దకు రావలయు" ననెను. అంత వేయిమంది నేవిధ ములుగా నరిరి. ఇది యసలు యుద్ధము చేసెడు మొగము కాదని కొందఱు, ముందు వేయినిష్కములు చూపింపుమని కొందఱు, అట్లయినచో మొదటనే యీసంగతి చెప్పకుండ నిప్పుడు చెప్పుట యేలనని కొందఱు. మఱికొందఱు బద్దన్నమీఁదఁ గలియఁ బడఁబోయిరి. "నీవు దొంగవు. ఈ రీతిగా నేదో పేరు తెచ్చు కొనుటకు వచ్చితివి" అని. బద్దన్న యిట్లనెను. "సరే యీ వే మంది యొక్కసారిగా నామీఁదకు రండు. ఒక రెండుగ

కొలము యుద్ధము చేయుదము. ఆలోపుగా మీ రందఱు కలసి నన్ను గెలువలేకపోయినచో మీ రోడినట్లొప్పుకొనవలయును. ఇది మీ కంగీకారమేనా యనెను. వారంద అంగీకరించిరి. మఱునాఁడుయుద్ధముకొఱకు నిర్ణయించుకొనిరి.

౯

వందయూళ్ళ జనము నిరుత్సాహపడిపోయిరి. చాల మందిమఱలనేవరువత్తురనిరి. ఇన్నివేలజనము మఱునాఁడుకూడ నచ్చట నున్నచోఁ దిండియెవరు పెట్టుదు రనిరి. ఈ వచ్చిన వారిలోఁ గొందఱు బద్దన్నపక్షము మాటాడఁ జొచ్చిరి. కొంద ఱతనికి వ్యతిరేకముగా మాటాడఁజొచ్చిరి. వారు వీరు చిన్న చిన్న గుంపులుగాఁజేరి మాటలమీఁద మాటలు పెంచుకొని కొన్ని దెబ్బలాటలుజరిగెను. ఊరంతయు గందరగోళమయ్యెను. ఆ యూరిలో నొకధనికుఁ డుండెను. ఆయనకుఁ గోడిపందెములు కఱ్ఱసాములు, కత్తిసాము లనినచో మిక్కిలియిష్టము. అతఁడీ జనములయొక్క కోలాహలముచూచి వారిలోఁగొందఱనుపిలచి వార్తలు కనుగొనెను. ఆ ధనికునిపేరు చంద్రగౌడు. చంద్ర గౌడు తాను గొందఱు మల్లయుద్ధనిపుణులను, ఖడ్గయుద్ధవిశా రదులను పోషించుచుండెను. వారి నితరులపైకి యుద్ధములకు పంపించును తనవద్దనున్నవారు గెలిచినచో నది యాయనకొక గొప్ప. అతనివద్దనున్న ఖడ్గవిద్యావిశారదు లాప్రాంతము లందలి వారిలో ఘటకులు.

ఆయన యీ వచ్చిన జనమునకంతకుఁ దాను నాలుగయిదు దినములు భోజనములు పెట్టుదు ననెను. కత్తిసాముల పరీక్షలు

తాను చేయించెద ననెను. ఆ వచ్చిన నాగన్న (బద్దన్న యిపుడు పెట్టుకొన్న పేరు) తనవద్దనున్న కటారికాండ్రను గెలిచినచోఁ దా నతనికి వేయినిష్కము లిత్తు ననెను. వాడలలో నున్న పెద్దల నందఱను పిలిపించి వారితో మాట్లాడెను. బద్దన్నను పిలిపించెను బద్దన్న 'నీయిష్టము దొరా! యెట్లయినను సరే' యనెను. చంద్రగౌడు సర్వము నేర్పాటు చేయుచుండెను. చంద్రగౌడు పశ్చిమచాళుక్య దేశస్థుఁడు. ఆయన తెలుఁగు మాటాడును గాని యాసగా మాటాడును. వారి వంశము నాల్గయిదు తరముల క్రిందట నీ దేశమునకు వచ్చెను. వారు తెలుఁగువారే యైపోయిరి. పసిబిడ్డబాలాది వారియింటిలోఁ దెలుఁగేమాటాడుదురు. ఆయనకుఁ దెలుఁగువారన్నచోఁ దెలుఁగు దేశమన్నచో నభిమానము. వెలనాటిచోళులన్నచో పట్టరాని యభిమానము. దుర్జయమండుఁడే తమప్రభువు. చుట్టుపట్ల సుంకములు చెల్లుబడికానిచో దుర్జయమండుని భటులు చంద్రగౌడుని సాహాయ్యమున సుంకములు చెల్లించుకొందురు. ఈ వార్తలన్నియు బద్దన్న తెలిసికొనెను. సంతోషించెను. అతనికి వెదుకబోవు నతీఁగ కాలికి తగిలి నట్లయ్యెను. ఇప్పుడేపోయి తన వర్తమానము చంద్రగౌడునితోఁ జెప్పుటయా? అదివ్యవహారము రసాభాసము చేసికొనుట. తాను తనవెంట గంగచోడునైన తెచ్చెనుకాదు. దుర్జయమండుఁ డిచ్చిన యాజ్ఞాపత్రము గంగచోడునివద్దనున్నది. ఒకవేళ నాయాజ్ఞాపత్రమును చంద్రగౌడున కిప్పుడు చూపించుటయు న్యాయముగా దేమో! అతని కీ సంగతియే తెలియదు. క్రమశః తెలియవలయునుగాని యిది

వఱకే జరిగిన యింత ప్రయత్న మొక్కసారి తెలిసినచో నతని మన స్సెట్లుండునో! బద్దన్న యూరకుండెను.

చంద్రగౌడు వచ్చిన వందమంది కటారిగాండ్లను రెండే బదులుచేసి యుద్ధము చేయించెను. మొదటిదిన మీ మొదటి యుద్ధములతో సరిపోయెను. రెండవదినమున రెండు పాతికలు రెండు పన్నెండ్ల యుద్ధము జరిగెను. అప్పటికి వందమందిలో నధికులు పన్నెండుగురు తేలిరి. ఒకడు మిగిలిపోయెను. ఈ పదు ముగ్గురు తమతో నాగన్న యుద్ధము చేయవలయు ననిరి. వారిలో నారుగురి నారుగురి యుద్ధము చేయుం డనెను. వా రంగీకరించలేదు.

చంద్రగౌడు: మీ రెందుకంగీకరించరు. అంగీకరించక పోయినచో నీ యుద్ధములు చేయుట యెందులకు? మీ వంద మందియు నితనితో రెండుగసియులు యుద్ధముచేయవచ్చు గదా యనెను. వా రప్పుడు తాము దానికి సిద్ధమే యనిరి. వాదప్రతివాదములతో చాలకాలము గడచెను. చంద్రగౌడు నకుం గోపము వచ్చుచుండెను. గౌడుడు తన కటారివాండ్రతో వారిని శిక్షింప నెంచినట్లు కనిపించెను. ఇదియంతయు బద్దన్న చూచెను. అట్లు జరిగినచో తనపని కేమి యానుకూల్యము! బద్దన్న చంద్రగౌడునితో నిట్లనెను. “దొరా! అట్లే కానిమ్ము నే నీ పదుముగ్గురితో యుద్ధముచేసెదను. తరువాత వంద మందితోం జేసెదను” అని కాసెకట్టుతోం గత్తిపుచ్చుకొని, డాలుపూని, కవచము తొడిగికొని వచ్చెను. “ఈ పన్నెండుగు రొక్కసారి రారాదు. ఈ పన్నెండుగురితో విడివిడిగా యుద్ధము చేయుదును. విడిగా వందమందితోగూడ యుద్ధముచేయుదును.”

అందఱు సరే యనిరి. కాని బద్దన్న యొక క్రొత్త నిబంధన పెట్టెను. వారు తన్ను చంపినచో చంపవచ్చును. తాను వారిని చంపడు. కొద్దిగాయములు తగిలినచో దగులవచ్చును. విస్పష్టముగాఁ జంపుటకు వీలైన మూఁడు దెబ్బలు తాను వదలి నచో నాతలివాఁ డోడిపోయినట్లు. చేతిలోని కత్తి యెగిరి పోయినచో నోడిపోయినట్లు. తాను తన విద్యచూపించుటకు వచ్చినవాఁడుకాని విరోధములు పెట్టికొనుటకు, పగలు సాధించు కొనుటకు వచ్చినవాఁడు కాదు. ఎవరు గెలిచినను నెవ రోడినను నందఱు స్నేహితులేకాని విరోధులుకారు. అందఱము తెలుఁగు వాండ్రము. అందఱము వెలనాటిచోళుల బంటులము. దుర్జయ మందని దాసులము." ఇవి బద్దన్న చెప్పిన మాటలు. ఎక్కువ మంది మజ్జారేయనిరి. కొందఱికిఁ దాము దెలుగువాండ్రమనియు, వెలనాటి చోళులబంటులఁ మనియు నప్పుడు క్రొత్తగాఁ దెలిసి నట్లుండెను. చంద్రగౌడుడు బద్దన్నను మిక్కిలి మెచ్చుకొనెను. అప్పటికిఁ గొందఱమంది యతనివద్ద వేయినిష్కములు చూపింప వలయుననిరి. బద్దన్న యిట్లనెను. "నావద్ద వేయినిష్కములు లేవు. నన్ను గెలిచిన వారికి దుర్జయమందయ్యగారు వేయి నిష్కము లిత్తుమనిరి. ఆ సంగతి నేను చెప్పితి" ననెను. అందఱు చప్పరించిరి. అప్పుడు చంద్రగౌఁడుడు ఆ వేయినిష్కములు తా నిత్తు ననెను.

బద్దన్న యీ పదుముగ్గురితో యుద్ధముచేయ నారంభించెను. మొదటవచ్చినవాఁడు స్థూలకాయుఁడు.దురుసు. చింత నిప్పులవంటి కన్నులవాఁడు. ఎదుటివానిని చంపుటకే చూచును గాని యుద్ధముచేయుట కాలోచించడు. వానికంటికి బద్దన్న

పిట్టవలెఁ గన్పించెను. ఈ ప్రయాణములలోఁ దిండి సరిగా లేక బద్దన్న కొంచెము చిక్కెను. బద్దన్న రూపసిగాడు. వట్టియప్పు డతనిని చూచినచో వానిలోనున్న తేజోలేశము కనిపించదు. కత్తిపుచ్చుకొని బరిమీఁద నిలుచుండి యెదుటివాఁడు తన్ను తృణీకారభావముతోఁ జూచుచున్నాఁడని తోఁచవలయును. అప్పుడతని కనులయందు శౌర్యదేవత తాండవించును. ఈనాల్గు నాళ్ళనుండి యింతవ్యవహారము జరుగుచున్నను బద్దన్నను, నిజ ముగా లెక్క చేసినవాఁడెవ్వఁడును లేఁడు. అతని మాటలలోని తీరు, మాటాడుచున్నప్పుడు మొగములోని గాంభీర్యము, వీనిచేత మాత్రమే జనమందఱు నూరకుండిరి. యుద్ధము మొదలుపెట్టు చునే యీ బేతాళునితో మొదలుపెట్టెను. వానిపేరు బేతా ళుడు. బేతాళుఁ డూరకే బద్దన్నమీఁదికి దూఁకనారంభించెను. బద్దన్న వానిని దూరముగా నుంచ ప్రయత్నించెను. కాని వాడు మాటిమాటికి లోనఁ దూరఁబడుచుండెను. బద్దన్న యూహ యెవ్వరిని చంపరాదని; ఎక్కువగా గాయపఱచరాదని. ఆ నిశ్చయము వీనివద్దనే సడలనీయవలసి వచ్చెను. బద్దన్నకు మిక్కిలి కోపము వచ్చెను. ఆ కోపము వచ్చిన బద్దన్నను చంద్రగౌఁడును, వాని కటారికాండ్రును తొలిసారి చూచిరి. ఆశ్చర్యపోయిరి. బద్దన్న బేతాళుని కత్తియు, తనకత్తియు జోడించి వాని కత్తి బెసగకుండ చేసి చంద్రగౌడునితో ని ట్లనెను. "దొరా! చూడుము వీనిపోటుతీరు. విద్యను ప్రకటించు టకా నన్ను చంపుటకా? వీనిమణికట్టు నఱకెద"ననెను. చంద్ర గౌడుఁడు నవ్వెను. బద్దన్న కత్తిని వెనుకకులాగుటలో బేతాళుని కుడిచేయి యయిదు వ్రేళ్లును తెగిపోయెను. బేతాళుఁడు చేతి

నుండి కత్తిబారిపోయి మల్లయుద్ధముకొఱకు బద్దన్న మీఁదకు దూకెను. బద్దన్న వానిపొట్టమీఁద నొకతన్నుతన్నెను. వాఁడు వెనుకకు విరుచుకొని పడిపోయెను. వానిని లాగికొనిపోయిరి. మిగిలిన పన్నెండుగురితో బద్దన్న యుద్ధముచేసెను. వారందఱు బద్దన్న కత్తితీర్పునకు, బద్దన్న చూపించు మర్యాదకు, బద్దన్న తమ్ముఁ జంపకుండ వదలినందుకు మిక్కిలి సంతసించిరి. వారి మనస్సులు బద్దన్నయందు గౌరవమును పెంచుకొనెను. యుద్ధము చేయునపుడు బద్దన్న తా నొకకత్తిదెబ్బ కొట్టబోవుచు నెదుటి వాఁ డేమిచేయవలయునో తెలియక దిగ్భ్రాంతుఁడైనప్పుడు దీని ని ట్లొడ్డుకొనుము, దీని ని ట్లొడ్డుకొనుము' అని చెప్పుచుండెను. చూచువారల కది యుద్ధమూ, లేక, గురువు శిష్యులకు చెప్పుటయూ యనిపించెను. పన్నెండుగురితో యుద్ధమై పోయిన తర్వాత బద్దన్న వందమందిని కూటయుద్ధమునకు రమ్మనెను. చంద్రగౌడుడు 'ఇప్పు డేనా, నీ వలసియుండు' ననెను.

బద్దన్న—'దొరా! వారిలో మేలి మనుష్యు లిట్టివారు. తక్కినవారితో నెప్పుడుచేసిన నేమి' యనెను. తక్కిన వారెవ్వరును యుద్ధమునకు తూఁగలేదు. మేము చేయ మనిరి. నాగన్న మా కులస్థుడు, మాకులములో నింతటివాఁడు పుట్టినదే చాలు ననిరి. బద్దన్న గెలుపునకు వందవాడలవారు తమ కేదో గొప్పతనము వచ్చినట్లు సంతోషించిరి. ఆ నాఁటికి యుద్ధము లయిపోయెను. చంద్రగౌడుని కటారికాండ్రు బద్దన్నతో స్నేహమే యభిలషించిరి. జన మెవరిదారిని వారుపోయిరి. చంద్రగౌడుడు స్నేహమునకు బద్దన్నను తన కటారికాండ్రతో యుద్ధము

చేయుమనెను. బద్దన్న చేసెను. వారికి వీరికి స్నేహము బలిసెను. చంద్రగౌడుడు బద్దన్నను తనవద్దనుండిపొమ్మనెను.

బద్దన్న—స్వామీ! అట్లయినచో దుర్జయమండుని నద్దనే యుండిపోయెడివాడను. ఆ దొరయు నన్నుంచు మనెను. వారు నన్ను నీచోటికిం గత్తియుద్ధములకొఱకు పంపలేదు. వేఱేపనిమీఁద పంపిరి. అది రహస్యమనెను. ఆమాటతో చంద్రగౌడుని బుద్ధిలో బద్దన్న వట్టి కటారికాఁడుగాఁ గనిపించుట మానివేసెను.

బద్దన్న చంద్రగౌడుని వద్ద నాల్గుదినము లుండెను. ఆయనతో సర్వవిషయములు చెప్పెను. తానెవరో చెప్పెను. బద్దన్నయప్పుడు గంగచోడుననుఁగబురంపించెను. గంగచోడుఁడు వచ్చెను. చంద్రగౌడుఁడు దుర్జయమండుని యాజ్ఞాపత్రమును చూచెను. బద్దన్న కరవాలభైరవుని సంహరించినవార్త చంద్రగౌడుఁడు వినెను. ఈ బద్దన్నకు ఆపనిచంద్రగౌడుని యూహలో నసాధ్యముగాఁ గనిపించలేదు. చంద్రగౌడుఁడు నవ్వుచు నిట్లనెను. "నేనింతఁ జఱకు దుర్జయవంశీయులకు సుంకములు మాత్రమే ప్రోవుచేయించి పెట్టుచుంటిని. ఇప్పుడు సైన్యములు ప్రోవుచేసి పెట్టెదను. రాజ్యములు సంపాదించిపెట్టుటకు ప్రయత్నించెదను. బద్దన్న, నీవేమి మనసివి? నీవెవ్వరవో మాకు తెలియనిచ్చితివి కావు. వట్టి కత్తిత్రిప్పువాడననుకొంటిని. రాజ్యములు త్రిప్పువాఁడవు" ఆ మఱునాటినుండి చంద్రగౌడుఁడును, బద్దన్నయు, గంగచోడుఁడును జయబుదేరి సైన్యమును సమకూర్పనారంభించిరి. చంద్రగౌడుఁ డెంత యుదారుఁడో యంత సాహసుఁడు. ఎంత దేశాభిమానియో, యంతనిర్భయుఁడు. ఇది రహస్యముగా చేయువలయునని బద్దన్న. "మనము రహస్యముగాఁ జేయూకము

కాని తెలిసినచో భయమేమి” అని చంద్రగౌడుడు. “అంతగా ముంచుకొని వచ్చినచో నిడియంతయు దుర్గయమందుని యెదురుతిరుగు సన్నాహ మని చెప్పెదను. నన్ను వారు కొంత విశ్వసించెదరు” అనియు సమాధానము చెప్పెను. ఇతర ప్రాంతములలో నాల్గునెలలు పట్టినపని యచ్చట నిఱువది దినములు పట్టెను. చంద్రగౌడుడు పదిమందికి కబురంపించును. వారు వత్తురు. గుంపులలో సైనికుల నేర్పాటు చేయును. నాయకుని నేర్పఱచును. ఏ యే పదియాళ్ళు కలిసి దళమో నిర్ణయించును. దళవాయిని నిర్ణయించును. ఆ వంద గ్రామములమీద రెండు సైన్యముల నేర్పాటుచేసి యుద్ధపు దుముదారుల నేర్పరచెను. అందులో దానొక దుముదారు. గంగగౌడుడు సేనాని. దుర్జయచంద్రుడను సేనానాయకుడు. అందఱితో జెప్పెను. అంత రకు నతడు నాగన్న కాదు బద్దన్నయని కరవాలభైరవునిసంహర్త యని తెలియజెప్పెను. బద్దన్న పరాక్రమము వారిలో నించు మించుగా నందఱును చూచినవారే. ఇది స్వాతంత్ర్యయుద్ధము. ఇందులో సైనికు లెవరో వారికితప్ప నీ రహస్య మెవరికిని తెలియరాదు. తెలిసినచో గౌడు వారిని నఱకించును. బద్దన్న సర్వసైన్యాధిపతి యని చెప్పెను.

ఇంటికి వచ్చినతర్వాత బద్దన్న గౌడునితో నిట్లనెను. “అయ్యా! వారివద్ద చెప్పినచో ఉన్న పొందిక చెడిపోవు నని యూరకుంటిని. సర్వసేనాధిపతిని నేనుకాను. చేబ్రోలు భూపతి నంబయ్యగారు. వారు వెలనాటిచోడుల సేనానాయకులు.” అనగా చంద్రగౌడు, “నంబయ్యగారి సర్వసేనాధిపత్యము నే నొప్పుకొనును. ఆయనను నే నెరుగుదును. ఆయన విద్యకు నీ

విద్యకు సంబంధము లేదు. నీవు చేసిన యింతటి కార్యము నంబయ్య యీ జన్మలో చేయలేడు, నంబయ్య కాదు. మఱి యొకడెట్లు చేయును? అసలు నీ నీతి మఱియొకరియొద్ద నుండుట కష్టము. ఈ వందయూళ్లు పొలిమేరయూళ్లు. ఇచ్చట స్వదేశాభిమానము ముండదు. ప్రాంతీయుడైన యొక వీరుని యధికారమే యిచ్చట నుండును. లేదా యెవడో తన పరాక్రమమును ప్రదర్శించి తనగూర్చి కుదుర్చుకొనవలయును. ఈ సంగతి తెలియుట మేధావిశేషము. అది తెలిసి నీవట్లాచరించితివి. ఏదీ? వచ్చి నంబయ్యను చేయమను మీ పనిని. అసలాయహంకారము, గర్వము కల ప్రాణము సామాన్యులతో కత్తియుద్ధము చేయుట కంగీకరించునా? ఒకవేళ చేసినచో బేతాళుని కత్తికే యెఱ యయ్యెడివాడు.

బద్దన్న—అయ్యా! నంబయ్యగారి నంత తీసివేయకుము. ఆయనలో లాఘవము గలదట. కత్తితీర్పుకల దట. విద్యలో నెక్కువరహస్యములు తెలియునట. దేశములు తిరిగి నేర్చుకో దగినది. మీకింకొక సంగతి చెప్పెదను. ఏ రాజవంశములో నా రాజవంశమునకు ఖడ్గవిద్యలో కొన్ని సంప్రదాయములు, ఆ సంప్రదాయమునకే తెలిసిన కొన్ని రహస్యములు నుండును. అవి ఆ రాజవంశములో నుండును. వెలనాటిచోళుల రాజవంశములో నేరహస్యము లున్నవో మనకు దెలియదు. అవి నంబయ్యగారికి తెలిసి యుండును, పైగా వారు ప్రభువులు. సేనలన్న పిలిచినచో సహకరించుదురు. మనవలె దొంగతనముగా సేనలను సమకూర్చుకొనవలసిన యవసరము వారికి లేదు. అవసరమున్నచో ప్రతివాని బుద్ధియు తదనుగుణముగా ప్రస

రించును. ప్రజకు నాయందు గౌరవము కలుగుటకు నేనీ మార్గ మవలంబించితిని. నంబయ్యగారు వారి కనుకూలమైనది వా రవలంబించెడివారు. పైగా నందులో నింత కష్టముండెడిది కాదేమో! గంగ—బద్దన్న శౌర్యమెంతయో వినయమంత; శక్తి యంతయో పరుల గొప్పతనమును నంగీకరించుట యంత. నేను నంబయ్యగారిc నెరుగుదును. నంబయ్యగారు బద్దన్నలో శతాంశముల కూడకారు. కాని మన మనరాదు. అనినచో లాభము లేదు. నంబయ్యగారు గొంకభూపతికి బంధువు. రా జాయనయే మహాఖడ్గవిశారదుc డనుకొనును. రాజు లకు సహజమైన సుఖాభిలాష యే విద్యలోనైనను కల నైపు తకు నంగీకరించదు. విద్యలయందలి మెరుగులైన శ్రోవలే వా రభిలషింతురు. వారి ప్రాణములు కష్టపడలేవు. నంబయ్య గారి విద్య సుకుమారమై, మెత్తనైన విద్య. దానియం దుద్వేగము లుండవు. గాఢమైన ప్రయోగము లుండవు. దూర ప్రయోజనము లుండవు. తత్కాలరమ్యతలకు వారి ప్రాణము లమ్ముడుబోవును."

తరువాత సైన్యములను, చంద్రగౌడున కప్పగించి బద్ద న్నయు గంగచోడుcడును వెడలిపోయిరి. పోవుచున్నప్పుడు గౌడుడు బద్దన్నతో నిట్లనెను. "బద్దన్నా, నాకు నీవు సర్వసేనాధిపతివి. నంబయ్య కాదు, దుర్జయుండుడు నా సేనాని. నా యీ నాల్గు వేల సైన్యము అనగా రెండు సేనల దుర్జయుండుంచు చెప్పి నట్లు నడచును. నీవు చెప్పినట్లు నడచును".

బద్దన్న :— మంగయ్యగారు చెప్పినట్లు నడచినచో నంబయ్యగారు చెప్పినరీతిని నడచినట్లే. మిత్రుడా! నిజమైన

సామర్థ్యము, నిజమైన సామర్థ్యమే యగును. అది నిజమైన సామర్థ్యమగుట భగవంతునికి తెలియును. దాని రహస్యము తెలిసిన కొలదిమందికి తెలియును. ఒక విద్యలోని పరమరహస్యములు ఆ విద్యాప్రదర్శనములోని నైపుణ్యము సర్వజనులకు తెలియునవి కావు. లోకములోని యధికారము అనధికారము వానిమీఁద నాధారపడియుండదు. రాజులు, వారి యనుగ్రహములు వానిమీఁద నాధారపడియుండును. గంగ:—మఱియొక్కటి చూడుము. రాజులు పరులయొక్క శక్తిసామర్థ్యము లెఱుగకయుండరు. ఎఱిగికూడ వారి కనుకూలులైన వారి మీఁదనే, వారిబంధువుల మీఁదనే తమ యనుగ్రహము ప్రసరింపఁ జేయుదురు. బద్దన్న:—మనము మాటాడునది మనోవిషయకమైన రాజద్రోహము. క్రియాపరిణామమునందు మన మువ్వురిలో నెవ్వరము రాజద్రోహము చేయఁ జాలము. పూర్వము పశ్చిమ చాళుక్యదేశస్థుఁడై యీ దేశమునందు నివసించుచున్నంతమాత్రమున వెలనాఁటి చోళులయందు భక్తి కుదుర్చుకొన్న గొంకఁడు చేయునా? దుర్జయవంశమునకు నమ్మిన బంటై నాయకుఁడైన వానిని నిముసములో సేనానిగాఁ జేసిన యీ గంగచోడుఁడు చేయునా? గొంకభూపతి యన్నచో నా ప్రాణములు బలియిత్తును. నేను చేయుదునా! కాదు, నేను సర్వసేనాధిపతి నగుదును. ఐనతర్వాత పంచమకులస్థుని యధికారము మీ రంగీకరింతురా? ఇప్పుడు స్నేహమట్లనించును. కాదు మీరప్పుడుఁ నంగీకరింతురు. ప్రజ లంగీకరింతురా? సేనాపతులు మన దేశమున మాండలిక ప్రభువులు. అప్పుడు నేను ప్రభు వగుట వలయునుగదా. పంచమకులస్థుఁ

డీదేశమున ప్రభుత్వ మెప్పుడు చేసెను? బ్రాహ్మణులు చేసిరి. క్షత్రియులు చేసిరి. కొన్నివందల యేండ్లుగా సత్కులజులైన శూద్రులు చేసిరి. గంగ:-అట్లే యికముందు పంచమకులస్థులు చేయుదురు. తప్పేమి? బద్దన్న:-తప్పకాదా? ఇది కర్మభూమి, మా కులస్థులు కర్మబాహిరులు. మేము రాజ్యము చేయుట తగదు. గంగ:- నీ కీ పాండిత్య మెక్కడిదోయి? బద్దన్న:- మా యూరిలో నొకయయ్యవారున్నారు. నేను వారిదగ్గర విషయములు వినుచుందును. మేము శైవులము కాము. మాకు వర్ణాశ్రమాచారధర్మములు కలవు. వర్ణభేదములు పాటింతుము. అందుకనియే కరవాలభైరవునితో యుద్ధము చేయుట కంగీకరించితిని.

తరువాత బద్దన్నయు, గంగచోడుఁడును వెడలిపోయిరి. గంగచోడుఁడు బద్దన్నను నాదెండ్లవచ్చి నాల్గుదినము లుండి పొమ్మనెను. "నీవు చేబ్రోలు పోవుటకు చాల యవధియున్నది కదా! చాల శ్రమపడితివి. నీ భార్యకు నీకు నేనుచేసిన గౌరవమే లేదు. నాకు సేనానిపదవి యిప్పించితివి. కొంత కృతజ్ఞతనైనను తీర్చికొననిమ్ము" అనెను. బద్దన్న కాదు పోనిమ్మనెను. గంగచోడుఁడు బలవంతము చేసెను. బద్దన్న యిట్లనెను. 'రాజా. నీవు వట్టి స్నేహజీవివి. నేను మంటిజీవిని. నా సంగతి నీకు తెలియదు. అది నీకు చెప్పినచో నీవు నన్ను స్నేహితునిగా సంగీకరించవు. మన మైత్రి యీ రహస్యగోపనము మాటున సాగనిమ్ము. గంగ-నిన్ను గురించి నాకట్టి యనుమానము లేదు. అంత రహస్యము నీ జీవితములో నుండవలసిన యవసరములేదు. బద్దన్న-ఉన్నది. గంగ-ఉండ

నిమ్మ. అదియొక దోషమైన గానిమ్ము. ఆ దోషము నీ పరా
క్రమమును పరాక్రమము కాకుండ చేయునా? నీ యుద్ధనీతి వైశా
రద్యమును దానినిఁ గాకుండ చేయునా? నీ మంచితనము మంచి
తనము కాకుండ చేయునా? బద్దన్న—అనేక గుణములుండును.
కొన్ని మంచివి కావచ్చును. కొన్ని చెడ్డవి కావచ్చును. లోక
మన్నిటిని కలగలుపుగా చూచునుగాని వేనికి వానిని విడమఱచి
చూడలేదు. గంగ—ఏది యెట్లయినను నీవు నా దెండ్లవచ్చి
నాల్గుదినము లుండక తప్పదు. బద్దన్న—నారహస్యము చెప్పి
వేసెదను. నీవే నన్ను వదలిపెట్టెదవు. గంగ—ఏమీ చెప్పుము.
చూతము, వదిలించుకొని పోవుదువుగాని. బద్దన్న—చెప్పి వేయు
దును. తర్వాత నన్నన్న దోషములేదు. గంగ—నేను నిన్నప్ప
టికిని రమ్మన్నచో నీవు నన్నన్న దోషములేదు. బద్దన్న—నేను
నాగన్నను కాక బద్దన్న నెట్లయితినో, నా వెంట వచ్చిన స్త్రీ
వెంకమ్మ కాక బాదమ్మ యట్లు. ఆమె నా భార్య కాదు.
మాయూరిలో తిప్పన్న యని మాకులస్థుఁడు అరువదియేండ్లవాఁడు
కలడు. ఈమె యతని భార్య. ఖడ్గవిద్యలో నా కామె కొన్ని
రహస్యములు చెప్పినది. ఆమె గొప్పకత్తిసాము నేర్చినది.
ఆమె వయస్సు ముప్పదియేండ్లు దాటినది. నాకిరువది మూఁడవ
యేఁడు నడుచుచున్నది. నాకు పదునాలుగేండ్లప్పటినుండియు
నే నామెను ప్రేమించితిని. ఆవయస్సులో కూడ ప్రేమయుండునా
యనుకొందురేమో! ఉండును. నాకు తెలియును. ఆమెయు
నా బాల్యారంభము నుండియు నన్ను ప్రేమించుచుండెను.
ఆమె నా వెంటబడి వచ్చెను. గంగ—మీ రిద్దరు నా వెంటబడి
నా దెండ్లకు రండు.

౧౦

ఆ నాలుగురాత్రులలో బద్దన్నకు గంగచోడునియందు తన యీ స్త్రీసంగమజన్యమైన దుర్భావము కించిత్తును గోచరించ లేదు. ఆ నాలుగుదినములు బద్దన్న బాదమ్మలకు వేరే యొక యింటిలో నివాసము మేర్పరచెను. ముప్పూటలు గంగచోడుని యింటినుండి భోజనపదార్థములు బద్దన్న వసతికి వెళ్ళెను, నాల్గుదినములు సాయంవేళలయందు స్నేహితు లిద్దరు కలసి కొందురు. ఈ విషయముతప్ప తక్కిన వన్నియుమాటాడుదురు. ఇంక రేపు వారు వెడలిపోవుదురు. గంగచోడుడు బద్దన్నతో నొకమాట చెప్పెను. "నీ భార్యాయొక్క కత్తిసాము చూడ వలయు నని యున్నది." బద్దన్న—ఆమె నా భార్యాకాదని చెప్పితినికదా, గంగ—భార్యయే యనుచున్నానుగదా!

బద్దన్న యెంతో బలవంతము చేయగా బాదమ్మ చివరి కంగీకరించెను. గంగచోడుని యిండివెనుకనున్న గరిడీస్థలములో బాదమ్మ చీర వెనుకకు విరచికట్టి కత్తి చేబూనివచ్చెను. ఆమె తాను కత్తిత్రిప్పి కొన్నిపోట్లు పొడువవలసినపద్ధతిలో చూపించెదు ప్రదర్శన మనుకొనెను. ఇంతలో గంగచోడుని యింటిలో నుండి యొక నలుబదియేండ్లలోపు వయసుగల కాంతారత్న మును, పదునారేండ్ల యీడుగల మరొకబాలికయు కత్తులు జళిపించుచు వచ్చిరి. పెద్దయామె గంగచోడునిభార్య. చిన్న యామె కూతురు. వారు తాల్చిన చీరలు సామాన్యపు చీరలు. వారు లల్పభూషణాలంకృతలై వచ్చిరి. బాదమ్మ వారిద్దరితో యుద్ధముచేసెను. వారును, వీరును చేరియొక పద్ధతిగా యుద్ధము, వారివారి విద్యలలో గొప్పనేర్పును ప్రకటించిరి. గంగచోడుని

భార్య చీర బిగించికట్టి, పైన కాసికోక బిగించెను. బాదమ్మ చమత్కారముగా నామె కత్తిదొడ్డుకొని చూచెను కాసికోక తెగగోసెను. ఆమె రైకను చేతికి గాయముకాకుండ చుట్టును గుండ్రముగా కోసెను బెత్తెడు వెడల్పు గుడ్డ రైకలోనుండి క్రింది జారిపడెను. ఆమె యాశ్చర్యపోయెను. గంగచోడుడు బాదమ్మను మిక్కిలి మెచ్చుకొనెను. మఱి రెండుదినము లుండి యీ విద్యలు తన భార్యకును, కాంతునకును నేర్పిపోవలసినదని గంగచోడు డడిగెను. బద్దన్న యంగీకరించెను. వారు మఱల రెండు దినము లచటనే యుండిరి.

మఱునాటిరాత్రి బద్దన్న బాదమ్మతో నిట్లనెను. నీవు వారికి నేర్పుటయేనా, వారివద్ద నీ వేమైన నేర్చుకొంటివా? బాదమ్మ:—ఇవియన్నియు విద్యలు. వీనివలన ప్రయోజన మేమున్నది. వారనగా, క్షత్రియకాంతలు గనుక వారిపండుగలలో, పబ్బములలో వారి స్త్రీ లందరు కలసి యీ ప్రదర్శనములు చేసికొందురు. ఇవి మన కెందులకు? బద్దన్న:— మరినీ వెందుకు నేర్చితివి? బాదమ్మ:— రైకచుట్టును నఱుకుట నా కెవ్వరును నేర్పలేదు. నేనే నేర్చితిని. మా యూరిలో తక్కువ యాడపిల్లలతో కలసి కత్తి త్రిప్పుచు దీని నభ్యాసము చేసితిని. అది తేలికయే. కత్తి పదును శరీరమునకు తగులకుండ శరీరముపైనున్న వస్త్రమును మాత్రము ఛేదించు లఘుత్వము మాత్రి మెఱిగినచో చేయి యెదారుసార్లు త్రిప్పినను నెమ్మదిగా నా రైకను కత్తిరించవచ్చును. బద్దన్న:— కాసికోకను సర కుటయెట్లు? బాదమ్మ వెంటనే కత్తితీసికొనిబాదిని చూపించెను. బద్దన్న:—దీనివలన స్త్రీల కేమి ప్రయోజనము? బాదమ్మ:—

రాచస్త్రీలు వారిలో వారు కత్తియుద్ధము చేసికొనునపుడు పురుషు లెవ్వరునుండరు. వరుసకు మఱదలైనచో, వదినగారైనచో వానిని దిస్సమొలవానిని చేయవచ్చును. అందఱకు నవ్వులు. బద్దన్న :— ఎవరైన స్త్రీ పురుషునితో కత్తియుద్ధమునకు దిగునను కొనుము. పురుషుడప్పు డిట్లామెను చేయవచ్చును. బాదమ్మ:— చేయవచ్చును. భారతము కావచ్చును. బద్దన్న:— నీకు నేను అట్లు చేసితిను. బాదమ్మ:— అది యిదివఱకే చేసితివి.

ఆ యారుదినములు బాదమ్మ బద్దన్నలు దేవతాసుఖమనుభవించిరి. వారి మనస్సుల కొక పొరంబడెను. గంగచోడుడు తమ్మ చూచినట్లే లోకము తమ్మచూచు నను నొక యూహ వారికి దెలియకుండ వారి మనస్సులో విహరించి వారికి తాత్కాలికమైన సుఖాపాదన చేసెను.

మూడవదినమున వారు బయలుదేరి వెడలిపోయిరి. వెడలిపోవునపుడు గంగచోడుడును, వాని భార్యయు బద్దన్నకు బాదమ్మకు బట్టలు పెట్టిరి. తొలుత గోశాలనుండి కదలివచ్చినపుడు బద్దన్న బాదమ్మ కామెకట్టిన చీరకాక మఱియొక చీర కొనెను. బాదమ్మ యిన్నాళ్ళును ఆ రెండు చీరలతోడనే కాలక్షేపముచేసెను. ఒకటి యుతికికొనుట, ఒకటి కట్టుకొనుట. ఒక చీర కట్టుకొన్నప్పుడు మఱియొకచీర పక్క. బద్దన్నకు రెండు ధోవతులు, రెండు త్తరీయములు. ఒక టే యుంగీ. ఇపుడు బాదమ్మకు నాల్గు వెలగల చీరలు వచ్చెను. బద్దన్నకును మఱి రెండు జతల బట్టలువచ్చెను. గంగచోడుడు దానిబత్తెము కింప బద్దన్నకు నేండ్రిదిక్కుము లిచ్చెను. బద్దన్న వలదనెను. గంగ

పోతురాజు నీ పెచ్చుటనుండి తెత్తు వనెను. బద్దన్న తనతండ్రినడిగి తెత్తువనెను. రంగచోడుడు నీవు మరల నీ తండ్రిని కలసికొన్న తర్వాత పూర్వమువలెనుండ దేమో యనెను.

తర్వాత నాలుదినములకు బద్దన్న బాదమ్మలు శత సహస్రవిషయము ప్రవేశించిరి. ఇకను వారు తాము మార్చుకొన్న పేరులతోడనే యుండవలయునా? నిజస్వరూపములు తెలియజేయవచ్చునా? వారికి తెలియలేదు. బాదమ్మ—నేనింక పూర్వమువలె మారుపేరుతో నుండను. బద్దన్న—పేరు మార్చుకొన్నతర్వాత నీ ముక్కు వంకర లేదు. నీవు కుంటిదానివి కాలేదు. పూర్వమువలెనే యుంటివి. బాదమ్మ—ముక్కులు, కాళ్ళు వంకరపోవు. వంకరపోవునది మనస్సు. బద్దన్న—మనసు ప్రత్యేకముగా వంకరపోదు. ఎప్పుడును వంకరపోయియే యుండును. బాదమ్మ—నాకు వెంకమ్మయను పేరు బాగుగలేదు. బద్దన్న—బాదమ్మ బాగుగానున్నదా? పేరులలో నేమున్నది? అవి కొన్ని యక్షరములు. బాదమ్మ—కోతెమ్మ— ఇవిగూడ నక్షరములే కదా! బద్దన్న—అక్షరములే. బాదమ్మ—అయినచో కోతెమ్మ యను పేరుగూడ బాగుగ నున్నదా? బద్దన్న—పేరు వట్టిపేరు. అది యా పేరుగల మనిషికి గుర్తు. కోతియను నది అందవికారమైన జంతువు గనుక, ఆ పేరు అందముగా లేదను కొందుము. కోతెమ్మ యని యొక మనిషి పేరనుకొందుము. ఆ మనిషి పేరగ యని వెక్కిరింతువుగాని ఆ పేరు చెప్పినంతనే ఆ మనిషి స్ఫురించక మానునా? పేరునకు ప్రధాన లక్షణము ఆ పేరుగల మనిషిని స్ఫురింపజేయుట. బాదమ్మ—ఇదియంతయు నీవు నన్నుద్దేశించి చేసిన స్నేహము. బద్దన్న - నన్నుద్యోగాంక్షి

యక్షరపు ముక్క-రాదు ఆయన చదువుకొన్నవాడు గాదు. బాదమ్మ—నీవును చదువుకో లేదు. బద్దన్న—నేనును పట్టి పసు ప్రాయుడనే బాదమ్మ—మఱి యిన్నిమాట లెట్లు మాటాడు చున్నావు? బద్దన్న:—నన్నయ్యగారితో స్నేహమువలన నిట్లు మాట్లాడుట యలవాటైనది. బాదమ్మ—మఱి యాయనకు చదువు రాదుగదా! బద్దన్న—నలుగు రన్నదమ్ములలో చదువు రాని దాయన యొక్కడే. బాదమ్మ—ఇంక నేను వెంకమ్మను కాను. నీవు నాగన్నవు కావు. బద్దన్న— ఈ నెలదినములలో జరిగిన విశేష మేమి? బాదమ్మ—నాకు తెలియదు. బద్దన్న—నాకు దెలియును ఆ క్షత్రియకుటుంబము మన యిద్దఱి నాదరించెను. మన సంబంధము తెలిసికూడ మనయందున్న ప్రేమచేత మన లోర్చుకొనెను. తిప్పన్నభార్య వైనప్పుడు నీ వెంత కన్న ధనవంతురాలవు. ఇప్పు డీక్రొత్తచీరెలు నగలు కనిపించునప్పటికి పూర్వముకన్న ధనవంతురాలవనుకొనుచుంటివి. మన కులములోనున్న యెవరిని ఒక క్షత్రియకుటుంబ మిట్లు మన్నించును? దానితో నీకు మనము గొప్పవారమన్న భావము పుట్టెను. లోకములో నందఱును మనలను గంగచోడునివలె చూడరు. నాకొకయనుమానము. గంగచోడుడు నీవునా వెంట లేచివచ్చితి వని భార్యతో చెప్పియుండడు చెప్పినచో నామె యిట్లు చేసియుండదు. నీ మొగము చూచియుండదు. ఆయన తర్వాత భార్యతో నీ సంగతి చెప్ప ననుకొనుచును. మనము మఱల నింకొకసారి వారి యింటికి పోవుట తటస్థించినచో నప్పుడు తెలియును. బాదమ్మ—నీ కంతకు మారుపేరుంతోడనే యుండెనవలె ననిపించు చున్నది అందుచేత నీ ట్లనుచున్నావు.

బద్దన్న - నేను చేయవలసిన ప్రయత్నములో నావగింజలో నరభాగము కాలేదు. ముందున్నది ముసళ్ళపండుగ. వెనుకటి కొక కథ చెప్పుదురు. ఒకానొకడు యెక్కువ పుణ్యమును, తక్కువ పాపమును చేసెనట. యముడడిగినాఁడట. "నీవు కొంచెము పాపముచేసితివి. ఎక్కువ పుణ్యముచేసితివి. ముందు పుణ్యము ననుభవింతువా, పాపము ననుభవింతువా?" యని. ఆయన యా కొంచెముపాపము ముందనుభవించినచో మిగిలిన మహాపుణ్యమును చాలదినములు తీరికగా ననుభవించవచ్చు ననుకొని యా పాపమే ముందనుభవింతు నని చెప్పెనట. ఆపాప మనుభవించుటకు ఒక బ్రాహ్మణగృహమున దొడ్డిలో నున్న యఱటిమొవ్వలో మిన్నాగై పుట్టెను. ఒకనాఁడా బ్రాహ్మణుడు విస్తరాకుకొఱ కఱటిచెట్టునొద్దకు వచ్చెను. ఈ మిన్నాగు కరచెను. దానితో బ్రహ్మహత్యచుట్టుకొనెను. ఇట్లు పాపమునుండి పాపముగా నతనికిఁ దనపుణ్యము ననుభవించు కాలమే లేక పోయెను. నేనట్లుకాక తొలుత నాపుణ్యము ననుభవించుటకు మందయ్యగారి యొద్దకు పోయితిని. అచ్చట నే నెఱుగనిది, నేను పూర్వజన్మమున చేసికొనినది నాకు మఱియొకపుణ్యము కనుపించెను. ఆ పుణ్యము గంగచోడుఁడు. నేను తెలిపిగా నాపుణ్యమునే ముందనుభవించితిని. పాపము ననుభవించుట మొదలు పెట్టినచో తుద కీపుణ్యముగూడ చెడిపోకుండ చేసికొంటిని. ఇంక పాపానుభూతి నారంభించుచున్నాను. అసలు మాను

...లు పెట్టుకొనవలసినది యిప్పుడు. నీ విప్పుడే కాదను

...ను. ఈ వ్యవహారములో ప్రధానులు ముగ్గురు.

...రు, నంబయ్యగారు, మందయ్యగారు, గొంకరాజును,

సంబయ్యగారును నా కనుకూలురు కారన్ని నాకు తెలియును. అనుకూలు రైనచో ఒక్క మంచయ్యగారే యగును. ఆయన సహాయ్యముతో తక్కిన యిద్దరి యానుకూల్యము సంపాదించు కొనుటకు ముందాయనవద్దకు పోతిని. ఆయన నా కనుకూలు డుగానుండునని నాకుం దెలియును. ఆ మెఱపు మెరసినది. సిన్నా విషయము పోరపెట్టితిని. ఇంకొకసంగతి చూడుము. మన గ్రామమునకును, వారిగ్రామమునకును చాలదవ్వు. మనసంగతి మన సమీపగ్రామస్థులకు పట్టినంత వారికి పట్టదు. తిప్పన్న బంధువులకు తిప్పన్నవద్ద నిచ్చిపుచ్చుకొనువారికి నా మీంద కలుగునంతకోపము పరుల కేల కలుగును? నాబంధువులైనవారు నా యీపనివలన తమకు గౌరవభంగ మనుకొందురు. మన యూరు కానివారు, మనతో నిత్యసంబంధము లేనివారు మనయం దున్న దోషముల నెక్కువగా పాటించరు. గుణములనే యెక్కువగా పాటింతురు. సమీపస్థులు దోషములనే యెక్కువగా పాటింతురు. మనము మనయింటికి దగ్గరకు వచ్చుచున్నాము. వచ్చిన కొలంది జాగ్రత్తగా నుండవలయును. గోశాల సమీపమునకుపోయినతరువాత మనము దాచదగిన దేదియును లేదు, దాచగలిగినదియుండదు. చేబ్రోలు సంబయ్యగారితో వ్యవహారము కానిమ్ము; తరువాత నీవు బాదమ్మవే యగుదువుగాని.

బాదమ్మ—ఐనచో సంబయ్యగారు మంచయ్యగారివలె నుండరా!

బద్దన్న—నీ వితరస్త్రీలవలె నుంటివా? నీకన్న పదియేండ్ల చిన్న వానిని మోహించి వానితో లేచివచ్చితిని. నీ భర్తక నింకను ముసలివాండ్రయిన భర్తలతో లోకములో స్త్రీ వంది కాపురము చేయుచున్నారు. బాదమ్మ—వా

యనఁగా నేమో తెలియదు. బద్దన్న—నీకు ధర్మమనగా నేమో తెలియదు.

ఈ ప్రసంగము దారివెంట. ఆదారి నిర్జనముగా నుండెను. బాదమ్మ బద్దన్న యన్న యీమాట వించునే యేడ్పు నారంభించి యొకచోట కూర్చుండి కుముల నారంభించెను. బద్దన్న యామె దగ్గరకుఁ జేరి యిట్లనెను. నీవు నాకు చెప్పవలసినదానవు. చిన్నవాఁడను నే నేడ్చినచో నీవు సముదాయించవలెను. ఏమో నాకన్న పదియేండ్లు పెద్దదానవు. నా కన్నివిధముల తోడుగా నుండు వని నేను నిన్నాశ్రయించగా నిట్లుచేయుట నీకు తగదు. నా కిది ధర్మమో, యధర్మమో, పుణ్యమో, పాపమో తెలియదు. ఇది పాప మని, యధర్మ మని నాకు చెప్పినది నీవు. నేను నీ మాటల నాధారము చేసికొని యిది యధర్మ మైనచో, నిది పాప మైనచో నిది యిది యిట్లుండు నని యూహనముచేత కల్పనచేసి చెప్పితిని. ఇదియంతయు నూహాకల్పన. నాకు తెలిసి చెప్పినదికాదు. నీవేదో చెప్పగా నేనది యిట్లిట్లగు ననుకొంటిని. నీవు నేను నిన్నేదో యనుచుంటి ననుకొంటివి. ఈ పుణ్యము, పాపము, ధర్మము, సధర్మము నీ వనుకొనుచుంటివి. నాకింతవఱకు నాయూహయే లేదు. నాకు తెలిసినదొక్కటే విషయము. నేను నిన్ను ప్రేమించితిని. ఆ ప్రేమ భగవంతుఁడు కల్పించెను. భగవంతుఁ డెట్లుచేయించునో అట్లు చేసినవాఁడను నేను. అదిపుణ్య మని, పాప మని, ధర్మ మని, ...ర్మ మని లోక మనవలయును. నే నిది కామప్రవృత్తిచేత ... కామముయొక్క స్వరూపము నాకు తెలియనప్పుడు ... ప్రేమించితిని. ఇది పాప మెట్లగునో నాకు తెలి

యుదు. మఱి పేరు మార్చుకొనుట యెందుకు! ఈ భయము లెందులకు! అందువు. నా ప్రేమ నా హృదయవిషయము. నా జీవితవిషయము. భగవంతునకును, నాకును నడుమనున్న విషయము. ఈలోకము భగవంతునకు నాకును నడుమ లేదు. అందుచేత నీలోకమును నేను విడిగా చూచుచున్నాను. నా ప్రేమలోకములో నీకును నాకునుచాలదూరము. ఆదూరము లోకమునందలి ప్రదేశముల నడుమనున్న దూరమును కొలిచినట్లు లిప్తగవ్యూతుల దూరమని చెప్పుటకు వీలులేదు. స్త్రీ పురుషుల నడుమనున్న దూరమును లోకము, వివాహము, వివాహములేకపోవుటయును కొలతబద్దలతో కొలుచును. ఇచ్చట దూరములు లేవు, కొలుచుటలులేవు. వివాహమైనంతనే దూరము లేదు. కానంతనే చెప్పరానంతదూరము. నీవును నేనును కలసి సుమారు నెల దినములైనది. గోశాలలో మా యింటివద్దనే యున్నప్పుడు నీవు నన్ను నా ప్రేమపాలములో చూడలేదు. ఆ ప్రేమతో పాటు పెరిగిన వయసు పాలములో చూచితివి. ఆ వయసు నా ప్రేమ యనుకొంటిని. నేను నప్పుడు వయసు పొగరుచేత యథార్థమును భావించలేక పోతిని. కాని యచ్చముగా నందుడను కాలేదు. నీ వచ్చముగా తిప్పన్నవద్దనే యుంటి వను కొమ్ము. నీమీఁద నాకు గలప్రేమ కప్పుడును భంగము లేదు. కాని నేను గాయపడి, జ్వరితుఁడనై నప్పుడు నిన్ను నా వద్దకు రమ్మంటిని. ఆ మాటకాని, తరువాత నా ప్రవర్తనకాని నీవు నా దగ్గరకు వచ్చుటచేత నీ ప్రేమకు మించిన బలముకలదిగా[...] పించెను. యౌవనదోషము. ఆ యౌవనదోష మిప్పు[...] లేదు. శరీరములో పటుత్వ మున్నన్నిదినము లుం[...]

భ్రాంతియేమో నాకు తెలియదు. కాని నీయందు నాకుగల ప్రేమ నా యౌవనసంబంధి కాదనిపించుచున్నది. ఐనచో నీ యౌవనము తొంగిచూడనప్పుడు, యిట్టి స్థితి నొకదానిని నేను భావించలేనప్పుడు నీయందు నాకు ప్రేమయేల కలిగెను! అనేకవిధములుగా ప్రేమ కలుగవచ్చును, నా చిన్ననాటికి నీవు పెద్దదానవు. అప్పుడు నిన్నొక యక్కగారి వలె ప్రేమించ వచ్చును. నాకునప్పుడు మనయుద్దేదిగా లేదు. అప్పటినుండి నేను నిన్ను భార్యగానే భావించితిని. నీకు నేను భర్తగా భావించి తిని. అప్పటికి నాకు మన యీ కామవిషయము తెలియదు కదా! ఇంకొక సంగతి చూడుము. నాకు ఖడ్గవిద్యలో నీవు గురువవు ఇప్పుడెట్లున్నను. అప్పుడు నీవు నన్ను రక్షించగలిగిన స్థితిలోనుంటివి. ఇప్పటికైనను నీ విద్యయందు నా విద్య సరికి రాదు. అప్పుడు నేను బాలుడనైనప్పుడు నన్ను నేను రక్షించు కొనలేనప్పుడు నాకీ శౌర్యపరాక్రమ వాసన లేనప్పుడు, పైగా నే దినమున కా దినము కత్తివిద్యలో నుఱునాడు నీ చేతో మొట్టికాయలు తిన్నను, నేర్చుకొందు ననుకొను దినములలోకూడ నేను నీకు భర్త ననుకొనుచుంటిని. నిన్ను నేను రక్షించవలయు ననుకొనుచుంటిని. చూచితివా యీ చిత్రము! నా చిన్నతనములో నేనైన నేర్చుకొనుటకు నీ మీద నా భారపడియుండి మనస్సులో నేను నీకు భర్త నను కొనుట. ఈ హేతువుచేత నీయందు నాకు గల ప్రేమ భగ వంతుడు కలిగించిన దని చెప్పనుంటిని. నీవు మాటిమాటికి కోపము తెచ్చుకొనుట, నేర్చుట, యివి చేసినచో నాకు సొగసు, నాకు కత్తిచ్చినప్పుడు ఏ లాఘవము స్ఫురించునో

ఏ మెలకువలు చప్పున తోచునో, యుక్తియే మాటాడునప్పుడు గూడ స్ఫురించును. అప్పుడు నిప్పుడుగూడ నా స్ఫురణకు హేతువైనది మనస్సు. నన్ను లోకము మహావీరుఁడని యను నచో దానికి కారణము వారి కేమి తెలియును? నాకు తెలియును. అది నా మనోలక్షణము. నా మనస్సు పాము మెలికలు తిరిగినట్లు తిరుగును అది నేను సాముచేసినప్పుడు ఖడ్గ విద్యలోని నేర్పుగా ప్రకాశించుచున్నది. ఆ మనస్సే మాటాడు నప్పుడు చిత్రచిత్రములుగా మాటాడించును. ఆ మాటలను బట్టి నీవెదో యెదో యనుకొన్న నే నేమి చేయగలను. నే నొక్కటియే చెప్పెదను నీయందు నాకుగల ప్రేమ యెట్టిదో చెప్పితినిగదా! తక్కినమాటలు సందర్భబలముచేత వచ్చును. ఆ సందర్భము నుండి యా మాటలను విడదీసినచో నా మనస్సు నీకు తెలియదు. మాటలను మాటలుగా విచారించుట యెందులకు? సందర్భసహితముగా విచారించుము. అప్పుడు నా మాటలయందు నీకు దురర్థము తోచినచో ననుము. నీవు నన్ను నమ్మవా? ఎందుకు నమ్మవు" అని బద్దన్న బాదమ్మను బలవంతముగా తనవైపునకు త్రిప్పుకొని చెక్కిలి ముద్దాడి కౌఁగిలించుకొని కొంత యల్లరిచేసెను. ఆమె కిలకిలారు నవ్వులు నవ్వెను. ఒక్క నిముసములో మఱల కోపము తెచ్చుకొనెను. అతడు దానికిముందు మఱల నదేయని ముద్దాడెను. అది రెండవ సారి పని చేయలేదు. ఆమె యిట్లనెను. 'నీ ప్రేమ శరీరమును దాటినది. ఈ ముద్దులతో నీ కేమి పని'. బద్దన్న యిట్లనెను. 'నీవు కోపముతో నిట్లను చుంటివిగాని నిజముగా నట్లన్నచో నేనియు పని లేదు.' బాదమ్మ:— అట్లయినచో దూరముగా నుండుము.

బద్దన్న:- ఇందులో నొకరహస్యమున్నది. పూవునకు వాసన యెటువంటిదో, ప్రేమకు కామ మటువంటిది. కొందఱు కామమే పుష్పము, ప్రేమయే వాసన యందురేమో! నే నది యంగీకరించను. ప్రేమయే పుష్పము. కామమే వాసన. వాసన చేత నా పుష్పమును గ్రహింతుము. అందుచేత పుష్పమే ప్రధానమైనది. పుష్పమునుండి ఫల మావిర్భవించును. అట్లే ప్రేమనుండి భగవంతు డావిర్భవించును. ఆ పుష్పముయొక్క వాసన ఘ్రాణేంద్రియసంబంధి. ఫలము పుష్పమునుండి సముద్భూత మగునది అట్లే కామము లోకసంబంధి. ప్రేమ భగవదారాధనావిశేషము. వాసన లేకుండ పూ వెట్లుండదో కామము లేకుండ ప్రేమయట్లే యుండదు. అందుచేత నీ ముద్దులు, కౌగలింతలు తప్పకుండ నున్నను, ప్రొద్దు క్రుంకుచున్నది. ఆ యూరికి పోయినతర్వాత మనకు కూడెవ్వరు వేయుదురో! యెచట పండుకొనవలయునో! యిదంతయు విచారించుకొనవలయును. దయయుంచి లెమ్మ, పోదము, అని బతిమాలి, బామాలి యామెను లేవదీసికొని ప్రయాణమయ్యెను. మిగిలిన మార్గ మెల్ల సహజయౌవనప్రేరితములైన మధురచాటుకారములచేత, ప్రేమజనితవిభ్రమవిలాస సహకారి మధురచపేటములచేత, తనను కూలానోన్యభుజాస్ఫాలనగమనములచేత, సన్నికృష్ట శరీరసంఘర్షణసూచితమధురభావవిచిత్రోల్బణములచేత నంతకు ముందే సంజకెంజాయలను మించి నాల్గుదిక్కుల నావరించిన మ కచీకటిలో వారి ప్రయాణము స్వర్గలోకమునకో యన్నట్లుండెను. ప్రవాహమువొంగి మజిల నీరుతీసి వేణీమూలమున కొదగినట్లు బాదమ్మకోపమువొంగి తగ్గిపోయి నడచుచున్నంత

నీవు బద్దన్నలోనికి చొచ్చుకొనుచుండెను. స్త్రీ శరీరముచేత పురుషునికన్న నెక్కువ స్థూలమైనను శృంగారలీలావిశేషముల నామెయే చిన్నదిగా కనిపించును. పురుషు డెదో యావరించుకొనునట్లుండును. క్రమ్ముకొనునట్లుండును. ఆమె పిట్టయై నుదిగిపోవును. ఆ క్రమ్మిక శరీర ప్రమాణమును దాటి యొక పరిణామదశ నందును. ఈ యెదుగుటకూడ నొక యల్పభావనమువందును. ఇది సంభోగశృంగారమునందలి యొక విలక్షణము.

౧౧

బద్దన్నకు నంబయ్యగారి దర్శన మెట్లు చేయుటయో తెలియలేదు. నాదెండ్లలో చేసినట్లు రహస్యసైన్యనాయకుని కలసికొనవలె నని ప్రయత్నించెను. చేబ్రోలులో రహస్యసైన్య మేర్పాటైనట్లే కనపించలేదు. సైన్యాధిపతిదర్శన మెట్లు చేయవచ్చునని చాలమంది నడిగెను. ప్రతివారును నీ వెవ్వరవు? నీకు రాజదర్శన మెందుల కని యడుగ నారంభించిరి. బద్దన్న పదిదినములిట్లు బాధపడి చివరి కొకయుపాయమాలోచించెను. తాను దుర్జయమందుని వద్దనుండి వచ్చితి ననియు, నంబయ్యగారితో నేదో రహస్యము మాటాడవలయునని చెప్పవలయు ననియు నేర్పాటు చేసికొనెను. ఇంక నైదుదినములలో మందయ్యగారు నంబయ్యగారి దగ్గరకు వచ్చును. ఈ లోపుగా తానును నంబయ్యగారితో మాటాడు మనెను. మందయ్యగారు వచ్చువఱకు తాను నంబయ్యగారిని కలసికొననిచో మందయ్యగారికి తనమీంది యభిప్రాయము కొంత కొరతపడును. అంతియు కాక తన పథకము సరిగా కుదరకపోవచ్చును.

ఆ మఱునాఁడు తాను శుభ్రమైనవస్త్రములు ధరించి మందయ్యగారివద్దనుండి వచ్చితినని కోటలోనికి కబురంపెను. తానచట నాల్గయిదు గడియలు ప్రతీక్షచేసిన తర్వాత నంబయ్యగారు వచ్చిరి. మనిసి దబ్బపండు చాయ. గుబురైన మీసములు. పుష్టీలు. బక్కపలుచనివాఁడు కాఁడు, స్థూలకాయుఁడు కాఁడు. కనులలో తేజస్సు తరుముకొనివచ్చుచుండెను. మెడలో నెదుఱ్ఱొమ్ముమీఁద పచ్చలపతకమున్న ముత్యాలహారముండెను. కుడిచేతికి బంగారుకడియ ముండెను. కుడికాలికి నొక్క మాణిక్యము నడుమ పొదిగిన బంగారుపెండేర ముండెను. జరీ పట్టుధోవతిధరించెను. మఱియొక పట్టుత్తరీయము పైన వల్లెవాటుగా వేసికొనెను. శిరసునందు ఆకుపచ్చనిది. గళ్లుగళ్లుగా జరీతో నేసినది యైన సన్నని వస్త్రముతో గుండ్రముగా మెత్తవలె చుట్టిన తలపాగయుండెను. బొడ్డులో బాకుండెను. ఎదుఱ్ఱొమ్ము విశాలమై బంగరుపీటవలెనుండెను. అంత చక్కని యెదుఱ్ఱొమ్మునుండి సన్నగా నల్లనిచీమల వరుసవలె నూగారు నాభిప్రదేశమువఱకు వ్యాపించియుండెను. ఎదుఱ్ఱొమ్మున నొక్కవెంట్రుకయు లేదు. నాభిప్రదేశము కొంచెముగా కనిపించినట్లు ధోవతి ధరించియుండెను. నాభిస్థానము మిక్కిలి లోతుగానుండి, కొంచెము పై కుబికివచ్చిన యుదరముచేత విస్పష్టముగా కనిపించుచుండెను. దీర్ఘశరీరుఁడు కాఁడు. ఆపాదశిరస్సు విడివిడిగా చూచినచో నేభాగమున కాభాగము రమ్యమై సుందరముగా నుండెను. ఒక్కసారి మనిసిని సంపూర్ణముగా తిలకించినచో మనిసియంతయు నహంకారపు ముద్దవలె నధికారస్వరూపునివలె కనిపించును. నడక, చూపు అంగ

విన్యాసము, అంగచాలనము, సర్వము నొకయుక్తతుని ప్రకటించును. కొంత శక్తిమంతుని ప్రకటించును.

బద్దన్న రెండు నిముసములు నంబయ్యాను కన్నులతో లోగొనియెను. నంబయ్యాకు గుఱువిందగింజయంత యు మొగ్గు లేకుండ తూకము కట్టెను. నంబయ్యాగారు చాల నెమ్మదిగా నడచివచ్చెను. వచ్చి తనదృష్టి మఱియెవ్వరిమీఁదనో యుంచెను. వచ్చినదూత యెవరని యడుగలేదు. అచ్చట నూతనపురుషుఁ డతడై యుండవచ్చు నని యూహించినట్లును కనిపించలేదు. అచట నున్న తక్కిన యందఱితోపాటు బద్దన్నయు లేచి చేతులు కట్టుకొని నిలుచుండెను. నంబయ్యాగారు కూర్చుండ లేదు. తక్కిన యెవ్వరును కూర్చుండలేదు. ఆయన వారితో వీరితో గడియ రెండు గడియలసేపు మాటాడుచునే యుండెను. మంచయ్యాగారివద్దనుండి వచ్చినమనిపి ప్రసక్తి తేలేదు. బద్దన్న గ్రహించెను. ఈయన మందయ్యాను లెక్కచేయడు. ఈ లెక్క చేయకపోవుట వేఱు. స్నేహము వేఱు. పరోక్షమందలి భావము వేఱు. ప్రత్యక్షమందలి భావము వేఱు. దీనినిబట్టి తన కార్యము చెడునని బద్దన్న యనుకొనడు. ఆయనతో మాటాడుట యెట్లు? తనయంతట తాను నేను మందయ్యాగారి వద్దనుండి వచ్చితిని అని చెప్పుట మర్యాదాలోపము. ప్రక్కనున్న సేవకునితో బద్దన్న కన్నుగిలిపెను. తననుగుఱించి చెప్పుమనెను. సేవకుఁడు మఱికొంచెము సేపాగి, కొంచెె మొడము చూచి బద్దన్ననుగుఱించి చెప్పెను. నంబయ్యా యా సమయమున బద్దన్నవంకఁ జూచెను. మఱల తన కన్ను వేఱ త్రిప్పుకొనెను. బద్దన్నకు కోపము వచ్చెను. కాని ప్రభుస్థానము

ఏమి చేయగలడు! నంబయ్యగారు వేఱేదిశ చూచుచుండఁగనే యిట్లు మొదలుపెట్టెను.

"దొరా! నన్ను మంచయ్యగారు పంపించలేదు. నేనే తమ దర్శనము చేసికొనుటకు వేఱే మార్గములేక యీ యుపాయము పన్నితిని. నంబయ్య—ఎవరు నీవు? బద్దన్న—నా పేరు బద్దన్న. కరవాలభైరవుని సంహరించినది నేనే!

నంబయ్య కనుబొమలు ముడిచి బద్దన్నవంకఁ జూచెను. మఱల వేఱే దెసకు చూచెను. కొంచెమాగి బద్దన్న యిట్లనెను. "సర్వసైన్యాధిపతులు తమ దర్శనము చేయుటకు, వచ్చితిని. నేనొక ప్రయత్నము చేయుచుంటిని. నా ప్రయత్నమంతయు దేవరవారి పాదదేశమున సమర్పించుకొనుటకు, నేను ప్రభువువారి సేవకుడ నని విన్నవించుకొనుటకు వచ్చితిని. నంబయ్య—నిన్ను గుఱించి మేమొక వార్త వింటిమి. అది నిజమేనా? బద్దన్న—ఏ సంబంధమైన వార్తయో తెలియక యెట్లు మనవిచేయుదును?

నంబయ్య మఱల మాటాడలేదు. బద్దన్న యిట్లనెను. "ఏకాంతముగాఁ దమరితో కొన్ని మనవి చేసికొనుటకు నాకవకాశమిచ్చినచో మనవి చేసికొందును. నంబయ్య—మాకిప్పుడు వీలులేదు. నంబయ్య వెంటనే లేచిపోయెను.

బద్దన్నకు పట్టరానంత కోపమువచ్చెను. అతడు ప్రభువై పోయెను. లేనిచో వానితల యచట నచట నఱికియుండును. బద్దన్న వెంటనే కోటవెలుపలికి వచ్చెను. ఆ వచ్చుచున్న వైఖరి చూచిన రాజసేవకులకు భయమయ్యెను. అతడు బద్దన్న యని కోటలో నాల్గుమూలల నడుగడియలో తెలిసెను. తెలిసినంతనే కోటలోని జనమంతయు నతనిని చూచుటకు తహతహపడిరి.

నంబయ్యకు నచ్చిన భటుఁ డొకఁడుండెను. అతఁడు నంబయ్యగారి యంగరక్షకులలో నొకఁడు. శతసహస్రవిషయమున నున్న కటారికాండ్రలో నంతటివాఁడు లేఁడు. అతఁడు వెనుకను జరిగిన యుద్ధములో నంబయ్యగారి ప్రక్కన నిలుచుండి యుద్ధము చేసిన వాఁడు. కరవాలభైరవుఁడు కత్తిపుచ్చుకొని నంబయ్యగారిమీఁదికి దూకినపుడు తా నడ్డముపోయి యెడమచేయి తుండెమయి పోయెననుకొన్నంత దెబ్బతిని నంబయ్యను తొలఁగించి తాను తప్పించుకొని పారిపోయి వచ్చినవాఁడు. నంబయ్యగారు కోట ముందుసావడిలోనికి వచ్చిన నిముసమునుండి విడువకుండ నంబయ్యగారి వెంటనుండువాఁడు. అతఁడు తన దొర బద్దన్న యెడల చూపించిన నిరాదరణము, తిరస్కారణము గమనించుచునే యుండెను. బద్దన్న వెడలిపోవుచు నడకలో, చూపులో ప్రకటించిన యౌద్ధత్యమును కోపమును చూచెను. అట్లు మఱి యొకఁడు పోయినచో నతఁడు వానిని రెండు తుండెములుగా నఱకియుండును. కరవాలభైరవుని సంహరించిన బద్దన్న యట్లు పోవుచున్నాఁడనగా నతని కంటిలో తప్పు గనిపించలేదు. అతని పేరు అన్వయంకుఁడు. అతఁడు బద్దన్న వెంటనే పోయెను. కోట సింహద్వారముకడ బద్దన్న చుట్టును పాతిక ముప్పదిమంది చేరిరి. అతఁడు బద్దన్నను కలిసికొనెను. అన్వయంకుఁ డిట్లనెను. బద్దన్నా! నీ వెవ్వరవో నాకు తెలియదు. ప్రభువుదగ్గరనుండి నీవు వచ్చినవైఖరి బాగుగాలేదు. ప్రభువులయొక్క కోటలో నిట్లు ప్రవర్తించరాదు.

బద్దన్న—అయ్యా! క్షమించుము. అప్పుడు వచ్చిన కోపములో ప్రభువులన్నమాట మఱచిపోలేదుకాని మఱచిపోయితిని,

ప్రభువు చూడలేఁడుగదా, చూచినచో! నేను నాకిసేవకుఁడ ననియు, ఇదివఱకు ప్రభుదర్శనము చేసియెఱుగ ననియు, నందుచే కొంచెపు కోపము ప్రకటించుట జరిగె ననియు చెప్పి నన్ను క్షమించవలయు నని మనవి చేయుము అనెను.

అన్యాంకుఁడు నిలువున నీరైపోయెను. అదివఱకే బద్దన్న యొసినచో తనకుగల కొండంతటి యభిప్రాయము మఱని యింకా వినయముతో, ప్రభుభక్తితో నాలురెట్లు హెచ్చెను. అతఁడిట్లనెను. నీవు నేఁ పాటికి సుఖుల రమ్ము. ప్రభువు నీతో మాటాడునట్లు చేసెద ననెను. బద్దన్న—నీ వట్లు చేసినచో నీతో నేను మైత్రి సూచకమైన కత్తియుద్ధము చేసెదను అని వెడలిపోయెను.

అన్యాంకునకు బుజములు పట్టలేదు. చట్టలు పొంగి పోయెను. ఒక మహావీరుఁడు స్నేహయుద్ధము చేసినచో నా దినములలో నదియొక గొప్పగౌరవము. లోకములో నా మహావీరుఁ డతనితో మైత్రియుద్ధము చేసెనని చెప్పుకొందురు. ఒక ప్రతిష్ఠితుఁడైన వీరుఁ డెవనితో మైత్రియుద్ధము చేయునో యతఁ డా వీరునంతటివాఁడుగా పరిగణింపఁబడుచుండును.

అన్యాంకుఁడు నాఁటిసాయంకాలము నంబయ్యః వాహ్యాళి పోయినప్పుడు వాని వెంటనే పోయెను. ప్రతిదినము పోవును. కొంత మేఱపోయి రాజొకచోట కూర్చుండెను. అన్యాంకుఁ డెదురుగా నిలుచుండెను. నంబయ్య— బద్దన్న వెళ్ళిపోయెనా! అన్యాం—బద్దన్న యెవఁడు! అతఁడా! అప్పుడే వెళ్ళిపోయెను. నంబ— కోపముగా వెళ్ళెనా! అన్యాం—కోపముగానే వెళ్ళెను. నంబ— నీ ప్రాణమునంటివా! అన్యాం—అతఁడు కరవాలభైరవుని గెలిచిన వాఁడు. నే నేమిచేయఁగలుగుదును! నంబయ్య తరువాత పని

నిమేషములవఱకు మాటాడలేదు. నంబయ్య—నీకిష్టమైనచో అతనిని జేపు రమ్మనుము. అన్యం—ప్రొద్దున చెప్పితిని. నేనువచ్చిన వేళకే మఱలజేపతడు వచ్చును. నంబ—అతని వయసెంత యుండునందువు? అన్యం—మనము వినినది సుమారిరువదియేండ్లని అట్లే కనిపించుచున్నాఁడు. నంబ:—ఈ యీఁడుకే ఆపనియేమి? అన్య:—మన మేమి చెప్పఁగలుగుదుము? ఆ స్త్రీ యెటువంటిదో! ఆమె యతనికన్న చాల పెద్దదని చెప్పుచున్నారు. ఆమె యతనిని వలలో వేసికొని యుండును. అతడు కుఱ్ఱవాఁడు? యౌవనము యొక్క కొత్తలో స్త్రీ సంబంధము కలిగినచో పురుషుఁడెంత మాయలోనైన పడిపోవును. నంబ:—కుఱ్ఱవాఁడేమి, తక్కిన వేనికి లేని కుఱ్ఱతనము వీనికివచ్చెనా? ఇరువది రెండువేల సైన్యమును సమకూర్చెను. నాయకులు, దళవాయులు, జముదారులు, ఇంత సైన్యము అతని పేరు చెప్పినచో సర్వసైన్యము, ప్రాణములుగూడ విడుచుటకు సిద్ధముగా నున్నారు. అంతటి శక్తిమంతునకు నీయొక్క విషయములో కుఱ్ఱతనము వచ్చెనా! అన్యం:—ప్రభూ? అది యంతయు బుద్ధికి సంబంధించినది. పరాక్రమమునకు సంబంధించనిది. ఇది వట్టిబాల్యమునకు సంబంధించినది. నంబ:—అతడు ప్రభుభక్తికలవాఁడుగా కనిపించెనా? అన్యం:—అతని ప్రభుభక్తినాకుగూడ నున్నదో లేదో చెప్పలేను. నంబ:—నీ కెట్లు తెలియును? అన్యం:—నేనాతని వెనుకనే పోయి సింహద్వారమువద్ద కలసికొంటిని. నీ వెట్లుపోరాదంటివి? అతడిట్లనెను. 'అయ్యా క్షమించుము. నేనిదివఱకు ప్రభుదర్శనము చేసినవాఁడను గాను. అందుచేత కోపము పట్టఁగొనలేకపోయితిని' అని. నంబ:—అనఁగా కోపము

వచ్చె నిన్నమాట. అన్యం:— ప్రభూ! కుఱ్ఱితనము పైగా తానొక మహాకార్యము చేసినవాఁడాయెను. దానివలన తనకు వచ్చిన గొప్పతనమే యెఱుగును గాని ప్రభువుల గొప్పతన మిదివఱ కెఱుగడు. అట్టి కుఱ్ఱవాండ్ర విషయములో ప్రభువు లిట్లారా తీయరాదు.

మఱునాఁడు బద్దన్న మఱల నంబయ్యగారి దర్శనము నకు వెళ్లెను. నంబయ్యగారు మఱల నట్లే ప్రవర్తించెను. బద్దన్నకు కోపము వచ్చెనుగాని ప్రభువు లట్లే ప్రవర్తింతు రని యూరకుండెను. అది ప్రభులక్షణము కాబోలు, వారితో పని యున్నవారు వాని నోర్చుకొనవలయును. కాని బద్దన్న యొకటి నిశ్చయపరచుకొనెను. నంబయ్య తనతో తనంతట తాను మాటాడినచో తాను మాటాడకుండ వెడలిపోవును. తర్వాత నేమైననుసరే. కొంతసేపటికి నంబయ్యగారు బద్దన్నను చూచి యిట్లనెను.

"ఏమి మఱలవచ్చితివి? నీవు చేసిన పనితో మా కేమి యవసరము. అది మాయూరి పరిషత్తుల వ్యవహారము."

బద్దన్న—ప్రభూ! ఏకాంతమిప్పించినచో మాటాడుదును. నంబ—నేఁటిసాయంత్రము వార్తనంపించెదను. మఱల నంబయ్యగారు మాటాడలేదు.

ఆ రేపు నంబయ్యగారు వత్తు రనగా నన్యంకుఁడు బద్దన్న మఱల నంబయ్యగారితో నేకాంతముగా మాటాడుట కనుజ్ఞ సంపాదించెను. అన్యంకుఁడు బద్దన్నకోసము ప్రయత్నించెను. బద్దన్న కుఱికి యాసంగతి దెలియలేదు.

నాటినాఁడు మందయ్యగారు వచ్చిరి. బంధుత్వమర్యాదలు, స్నేహపుపరామర్శలు చాల జరిగెను. ఇద్దఱును మిక్కిలి స్నేహితులు. చిన్నప్పుడు కలసి యొకచోట పెరిగినవారు. అంతరంగికముగా మాటాడుకొన్నప్పుడు గౌరవార్థకములైన యుపనామములుకూడ లేకుండ మాటాడుకొందురు. ఒకనాఁ డేకాంతమున మందయ్యగారిట్లు చెప్పెను.

'నేను మీతో రాజకీయవిషయములు మాటాడవచ్చితిని. బద్దన్న సేనాని తమదర్శనము చేసెనా?

నంబ—చేసెను. మంద—అతఁడు మీతో నేమి మనవి చేసెను? నంద—ఏమియుచేయలేదు. మంద—మీరతనితో మాటాడలేదన్నమాట. అతనిని సామాన్యునిగా చూచితిరి కాబోలు. అతఁడు పంచముకులస్థుఁడని నిరాదరణచేసితిరి. కాబోలు. నంబ—అసలు విషయము చెప్పుము. మంద—అతఁడిఱువదిరెండువేల సైన్యమును సమకూర్చెను. నా సీమలో నా సేవకులు పన్నెండువేల సైన్యమును సమకూర్చిరి. ఇది యంతయు రహస్యదళము. నా యూళ్ళలో హాలుసాలుల రాజ్యపుటెల్లయందున్న వందయూళ్ళెప్పుడు నావియో కావో తెలియవు. బద్దన్నయొక్కఁడును పోయి యీ యూళ్ళలో రహస్యదళముల సమకూర్చెను. నాల్గువేలు సమకూర్చెను. అతనినీతి, యాతని పరాక్రమము, అతని బుద్ధి యప్రతిమానములు. అతఁడు చండప్రచండుఁడు. మహారాజభక్తి కలవాఁడు. గొంకభూపతి యన్నచో, మీరన్నచో అతనికి గలభక్తికి అవధిలేదు. అతఁడు ఒకవిషయ మాలోచించగలిగి యింకొకవిషయ మాలోచించలేడని లేదు. యుద్ధ మెప్పుడు చేయవలయునను, ఎట్లు చేయ

వలయును, సైన్యముల నెట్లు విభాగించవలయును, ఎవరెవ రెచ్చట సేనానాయకులుగా నుండవలయును, యుద్ధసంభారము లెన్ని కావలయును- అన్నిటి నతఁడు విచారించెను. అన్నిటిని సిద్ధముచేసెను. నంబయ్య- అతనినిగుఱించి నాకొకవార్త తెలిసినది. అతఁడు మంచివాఁడుకాడు. మం-ఆవార్త యెట్టిది? నంబ-అత డాయూరిలో వేఱొక పంచముని భార్యను లేవతీసికొనిపోయెను. ఆయూరిలోనే యున్నచో, నీపాటికే పరిషత్తులు వానిని శిక్షించెడివారు.

మాదయ సమాధానము చెప్పలేకపోయెను. మందయ్యకీ సంగతి గంగచోడుఁడు చెప్పెను. అతఁడు బాదమ్మయొక్క యస్త్రవిద్యానైపుణ్యమును, వారి ప్రేమస్వరూపమును నివేదించెను. మందయ్యగారు గంగచోడుని మాటలు విన్నప్పుడు బద్దన్నయందు ప్రసన్నుఁడుకాలేదు ఇప్పుడు నంబయ్యగారితో నేమి చెప్పవలయునో తెలియలేదు. కాని మందయ్యగారికి మనసులో నొక యూహ తగిలెను. నంబయ్యగారు అచ్ఛశీలి కాడు. అతని శృంగారము పూర్వము పలుపోకలు పోయినది. నేటికిని నియతమైయున్న దని నిశ్చయములేదు. అట్టివాఁడు బద్దన్నను గుఱించి యిట్లు మాటాడుటయెందుకు? అధర్మము కూడ తాను ధర్మమునే వాంఛించును. ధర్మాపేక్షచేతనేకదా యధర్మ మని పుట్టినది! అదియుగాక బద్దన్న యున్నచో నంబయ్యగారి కసూయ యున్నదా, ఉండవచ్చును. వెనుకటి యుద్ధములో కరవాలభైరవుని చేతిలో నంబయ్యగారు మడిసెడివాఁడు. అన్యాంకునిచేత రక్షింపబడెను. ఆ కరవాలభైరవుని బద్దన్న సంహరించెను. ఎప్పటికైన బద్దన్న తనకంటె గొప్ప

వాఁడని లోకము చెప్పుకొందురు. వానిని పైకి రానిచ్చుట నంబయ్యగారి కభిమత కాదు. ఈ పథకమునందంతయు నొక్క బద్దన్నేగదా యభ్యంతరముగా నున్నాఁడు. బద్దన్న యధికారమేమియు లేదన్నట్లు కనిపింపఁజేసినచో వ్యవహారము పొసగవచ్చును. మందయ్యగారింకొకటి యాలోచించెను. ఒక వ్యక్తియందలి యసూయచేత నంబయ్యగారింతటిమహా కార్యమును పాడుచేసికొనునా? గొంకభూపతియొక్క పనిని పాడుచేయునా? విక్రమచోడుని తెలుఁగుదేశముమీఁది యధికారమునకు చేయఁబడు ప్రయత్నము విఫలమొనర్చునా? బద్దన్నతో తానుమాటాడెను. బద్దన్న వట్టి విరాగి. ఈ ప్రయత్నము ప్రయత్నముకొఱకే చేయుచుండెను. వట్టి స్వాతంత్ర్యాభిలాషచేత చేయుచుండెను. తన కధికారవాంఛ లేదు. అతఁడు కాకున్న మఱియొకఁడింతయెత్తు నెత్తలేఁడు. తాను గాని, గొంకభూపతిగాని, నంబయ్యగారుగాని, దీనిని చేసినచో సులభముగా తెలిసిపోవును. బద్దన్న పంచమకులస్థుఁడు. అతని యీ మహాప్రయత్నములో నధికభాగము వాడలలో జరుపుచుండెను. ఎప్పుడు చళుక్యసైన్యమున కాజాడ సులభముగా నవగతముకావు అబ్బో యేమికులమది? అచ్చటి రహస్యము బ్రహ్మభేద్యము. బద్దన్న కానిచో నీ పని మఱియొకడు చేయలేఁడు. మందయ్యగారప్పటికి నంబయ్యగారి మాట నంగీకరించిన ట్లూరకుండెను.

మఱునాఁడు మందయ్యగారు వెళ్ళిపోవుదు ననెను. నంబయ్యగారు "ఎందుకు వచ్చితివి? యెందుకు వెళ్ళుచుంటి" వనెను. మంద—నేను బద్దన్నతో చెప్పితిని. నీవు

సేనానివి కావు. నీవు ప్రోవుచేసిన సైన్యమంతయు నా కిమ్ము. గొంకభూపతి కార్యము మేము నిర్వర్తింతుము. నే నీ ప్రయత్నము చేసితినన్న యభిమానము నీకు లేనిచో, నీ స్వాతంత్ర్య యుద్ధము చేసెదను. నీవు లేకపోయినను మే మీ సైన్యమును సమకూర్ప కల్గుదుము. నీ వూరకే నిమిత్తమాత్రముగ నీపని చేసితివి. లేని యధికారము నెత్తిన పెట్టుకొని యిట్లు చేసితివి. నీవు చేసిన యీపని నంబయ్యగారికి కోపహేతువు గావచ్చును. మహారాజు గొంకయ్యగారు దీని నంగీకరింపకపోవచ్చును అని. నంబ—అత డేమనెను. మంద—దొరా! కరవాలభైరవుని మీఁద నున్న కోపములో నీ ప్రయత్నము చేసితిని. ప్రభువు లంగీకరించినచో నంగీకరించుడు. నేను సేనాని కావలయు నన్న కోంక నాకు లేదు. అయిన నే నేమి చేయఁగలుగుదును? ఆ వేడిలో మా వాడలవారు నా యం దభిమానము చూపినారు. ఆ యభిమానమును పురస్కరించుకొని యిట్లు చేసితిని. ఈ సైన్యమంతయు మీ కప్పగించెదను అనెను. నంబ—నిజముగా నప్పగింతువా? మంద—నిజముగా నప్పగించును. అందులో సందేహము లేదు. నంబ—ఆ సైన్యమంతయు నతని కులస్థులు. మన యందు వారి కంత యభిమాన ముండకపోవచ్చును. మంద—ప్రభూ! అట్లనెద రేమి? సర్వసేనాధిపతులు, తమయందు వారికి గౌరవము నెరవుదురా? వారికి బత్తెములు మీ రిత్తురు. దళవాయులు, దుముదారులు, సేనానులు తమ యాజ్ఞాబద్ధులు. ఈ యధికారులను దాటి కాలిబంటు లెచటికి పోవుదురు. తమ కంగీకారము లేనిచో రెండేనుల నడిమివిషయము నందున్న సర్వసైన్యము మీఁది సర్వాధికారులను తమరే క్రొత్తగా నిర్ణ

యించుడు. ఆ దళవాయులను దఫుదారులను తీసివేయుడు. సర్వసైన్యము మీదియేకదా ! అదికాక వెలనాడు, శతసహస్ర విషయముల సైన్యము లుండును. బద్దన్న సైన్యముల నీసైన్యముల కలిపివేసి గుంపులను, దళములను, సేనలను తెగగొట్టుడు. రెండేరులనడిమివిషయపు జను లే దళములోనను నందఱు నుండరు. అప్పుడా సైనికులు మనమాటవిన రనుభయము లేదు. నంబ—ఇంతపని చేసిన బద్దన్న తాను పట్టించుకొనకుండ నూరకుండునా? మంద—తమ రేచూతురుగాక. అతనికధికారవాంఛ యేమియును లేదు. పైగా ప్రభువులయెడ మహాభక్తి. నంబ—అతని భక్తి మనకెందుకు? భక్తికలిగియుండక మఱియొకరీతిగా నుండుటకు వానిది గుండెయా, చెరువా? అట్లయినచో నతని సైన్యమంతయు మన దేశమునకు రప్పింపుము. మంద—ఇప్పుడే యీ పనిచేసినచో సందేహవిషయముకదా? తగినవేళ రప్పింతము. నేను యుద్ధవిషయము లన్నియు నాలోచించి యట్టిపెట్టితిని. మీరు గొంకభూపతికడకుపోయి యిట్టి ప్రయత్నము జరుగుచున్నది, తమరేమియు చేయవలదు, తమ యంగీకారము మాకు కావలయును అని ప్రభువుయొక్క యాజ్ఞ వడసివచ్చినచో తక్కినదంతయు నెట్లు చేయవలయునో తమరితో నేను చెప్పెదను. నంబ—నీ పథకము నాకు చెప్పుము. నేను రాజానుమతిని నిముసములో తెచ్చెదను.

---

అంత మందయ్య బద్దన్నతో చెప్పిన సర్వవిషయములు చెప్పెను. నాదెండ్ల విషయసైన్యము పరివారముగా గొంకభూపతి కూర్మమునకు యాత్రపోవుట, అప్పుడు ధనదపురము తమసైన్యము లాక్రమించుకొనుట మొదలైన సర్వ

మును చెప్పెను. నంబయ్య మంనయ్య బుద్ధిని చాల మెచ్చు కొనెను.

౧౨

బద్దన్న నంబయ్యగారి తిరస్కారము ధ్రువపడిన మఱు నిముసమే చేబ్రోలును వదలిపెట్టిపోయెను. అందుచేతనే యన్యం వెంత వెదకినను కన్పించలేదు. అతనికి తననాడైన రెండేసుల నడిమికిగాని, తన స్వగ్రామమైన గోశాలకుగాని తన హనుమకళేమున్న కొప్పాకకుగాని పోవుటకు మొగము చెల్ల లేదు. నంబయ్యగారు తన్నాదరించినచో గొంత ధైర్యముతో గోశాలకు బోయెడివాడు. గోశాలలో దన మిత్రులు చాల మంది యున్నారు. తాను చేసినపనిని వా రంగీకరింపకపోయి నను తనను మూలనాశనము చేయరు. నన్నయ్యగారున్నారు, తమయూరిలో నాయన పలుకుబడి యెక్కువ. ఆయన తనను వదలిపెట్టడు. ఇంతకు తాను తనదేశమును వదలిపోయి నెల సాళ్ళయినది. తనసైన్యము లేమైనదో, యతని ప్రాణమంతయు హనుమకళేముమీద నున్నది. తాను ద్రోహముచేసిన యిరువది రెండువేల సైన్య మెట్లయినను నతనికి పట్టదు. ఈ యుద్ధమే జరిగినచో నా సైన్యమంతయు నంబయ్యగారి యధీనమునం దెట్లును నుండును. తనకు మిగులునది హనుమకళేము మాత్రమే. హనుమకళేము కొప్పాకది. భావమ్మ పుట్టిల్లు కొప్పాక. తన మర్యాద కొప్పాకలోనే నున్నదో తెలియదు. ఏదో యొక యధికారముద్ర తాను సంపాదించకుండ కొప్పా కకుగాని, గోశాలకుగాని పోరాదు. ఈ ప్రాతినూల్యము భాసిం చిననాటినుండియు బద్దన్నకు పట్టుదల యెక్కువయ్యెను.

బాదమ్మమీఁద ననురాగ మెక్కువయ్యెను. ప్రతిదినము బాదమ్మతోఁ దాను కలసికొనుటలో బాదమ్మ కడచిన నెల నాళ్ళెరుగని సుఖ మనుభవించుచుండెను. బాదమ్మ కతఁ డొక వేళ కొడుకు. ఒకవేళ భర్త. ఒకవేళ తండ్రి. ఒకవేళ రాజు. ఒకవేళ సేవకుడు. అతఁడెట్లు నటించినను, అతఁడు కోపించినను, ప్రసన్నుఁడైనను; మూర్ఛపోయినను, అధికారము చూపినను, బాదమ్మ యనుకూలముగా ప్రవర్తించుచుండెను. వా రొకచోట నిలుచుండలేదు. దినదిన ప్రయాణములు చేయుచుండిరి.

ఒకనాఁడు తొలకరివానజల్లుపడెను. మేఘములు క్రమ్మి యురుములు లుఱిమి ఫెళఫెళార్భటులతో వర్ష దేవత విజయం చేసెను. మేఘమును చూచినంతనే బద్దన్నకు శృంగారరసవిప రీతలక్షణముగా బాదమ్మమీఁది కామము విరిగెను. యుద్ధ భావము కలిగెను. తాను వేసిన పథకమంతయు నొక్క పది దినములలోఁ బండించఁదగినది. ఆరంభముచేయుట, పెరుగుట, సర్వాంధ్రదేశము వెలనాటిచోళుల చేతులలోనికి వచ్చుట- పది దినములలో జరుగవలసిన పని. ఆ పదిదినములు తన కూపి రాడదు. ఈ లోపుగా తనస్థితియేమి? ఏదో కొంతవఱకు చక్కఁబెట్టుకొనవలయును. ఎన్నాళ్ళు గోశాలకుఁ బోకుండ నుండును. ఎన్నాళ్ళు కొప్పెకకుఁబోడు ?

బద్దన్న కెంత కాదనుకొన్నను నంబయ్యగారిమీఁద కోపము పోవుటలేదు. నంబయ్యగారి యెడల తనకు రాజభక్తి యెదుకు? నంబయ్యగారు తనకు రాజుగాదు. వెలనాటి చోళుఁడు, గొంకభూపతి తన రాజు. కలోత్తుంగ చోళదేవుని కుమారుఁడు విక్రమచోళుఁడు తన చక్రవర్తి. తక్కినవా రధి

కారులు. శక్తియున్నచో తానుకూడ వారియంతే యధికారి కావచ్చును. నంబయ్యగారిమీఁద పగతీర్చుకొనవలయు నని లేదుగాని, నంబయ్యగారికి తన గొప్పదనము చూపించవలయు నని బద్దన్నకు పుట్టెను. నంబయ్యవలె తాను సర్వసేనాధిపతి కాకపోయినను, నంబయ్యతో సమానునివలె, నంబయ్యకు లొంగవలసిన యవసరము లేనివానివలె, తాను పోయినచో నంబయ్య మఱల నట్లు ప్రవర్తించుటకు వీలులేనివానివలె, కాదగినట్టి స్థితి తాను వెదుకవలయును. గొంకభూపతి నంబయ్యను త్రోసిరాజని తన్ను సర్వసైన్యాధిపతి చేయఁడు. వారికి వారికి బంధుత్వము పైనరాజుల కొకవ్యాధి. ఎవఁడో యొకపని చేయుచుండెను: వాఁడే దానికి తగినవాఁడని వారి యుద్దేశ్యము. ఇతరుఁడధికశక్తిమంతుఁడు కనిపించినను వారికి నచ్చదు. ఈ స్థితిలో తాను పూర్తిగ గొంకభూపతికి నెసరు పెట్టుట రాజద్రోహము. వెలనాటిచోళులు కొన్నివందల యేండ్లనుండి సర్వాంధ్రదేశమునకు రాజులు. తూర్పు చాళుక్యులకు ప్రథమసామంతులు. ఈ స్థితిలో మందయ్యనుగూడ త్రోసిరాజని గంగచోడుని సాహాయ్యముతో, చంద్రగోఁడుని సహాయ్యముతో నాదెండ్లసైన్యమును చీలదీసి తన వేంగి, రెండేసుల నతిమివిషయముల సైన్యములతో కలిపి సులభముగా గొంకరాజు నోడించవచ్చును. వెలనాటిచోడుల రాచసైన్యములు బలహీనములై యున్నవి. మఱియు కావలసినచో ధనదపురములోననే చీలికలు పుట్టించవచ్చును. కాని యిది యంతయు రాజద్రోహము. మందయ్యగారు తనకు స్నేహితుఁడు. అట్లు మిత్రద్రోహము. మందయ్యగారికి నంబయ్యగారికి బంధు

త్వము, స్నేహము. మంచయ్యగారిని బట్టి నంబయ్యగారిని క్షమించవలెను. కాని నంబయ్యగారు మరల తిన్నట్లు నిరాదరించుటకు వీలులేకుండ చేయవలెను. తాను తలచుకొన్నచో నంబయ్య యెంత! నంబయ్యయంతటివారిని తాను సృష్టించగలడు. ఆహా! స్ఫురించినది. ఇట్లు చేసినచో!

ఈ యూహయంతయు నొకనాటి తెల్లవారుకడ. ప్రక్కన బాదమ్మ పరుండియుండెను. బద్దన్న బంతివలె లేచెను. ఆ వేగమునకు బాదమ్మకు మెలకువ వచ్చెను. ఏమి యనెను! బద్దన్న "నేను వేంగికి పోవుచున్నాను." అని పోవుచుండెను. బాదమ్మ కేమియు తోచినదికాదు. బద్దన్నపోవుచు "నీవు కొప్పాకకు పొమ్ము. నేను నిన్ను వచ్చి కొలదిదినములలో కలసికొందు" ననెను. బాదమ్మ యేడ్వ నారంభించెను. బద్దన్న "భయము లేదు. బుంగన్న యింటికిపొమ్ము. ఇదిగో నా కత్తి చూపించుము. నిన్నతడేమైన ప్రశ్నలు వేసినచో పదిదినములలో బద్దన్న వచ్చును, అతడు నీతో మాట్లాడెద ననెను అని చెప్పుము. ఇంకొక మాట చెప్పకుము. ఇచ్చటికి కొప్పాక యైదు గవ్యూతుల దూరమున్నది. నీవు దారి నెఱుగుదువుగదా! ఎరుగకపోయినచో నోటిలో నాలుకయున్నది. ప్రొద్దుగ్రుంకక ముందే కొప్పాక చేరెదవు" అని బద్దన్న వడలిపోయెను. బాదమ్మ యెంత పిలిచినను వెనుతిరుగలేదు. "నీవు కొప్పాక పొమ్ము; నేను పదిదినములలో వచ్చెదను" అన్నదే సమాధానము. బద్దన్న సూటిగ వేంగిపురాభిముఖుడై పోవుచుండెను.

పులమావిచక్రవర్తి యాంధ్రదేశమును జయించి తన తమ్ముడైన విష్ణువర్ధనమహారాజు నాంధ్రదేశమునకు నధిపతిగా

నియమించకపోక పూర్వము సర్వాంధ్రదేశము కొంతకాలము వేంగి పల్లవరాజులచేత పాలింపఁబడుచుండెను. అప్పుడు వారి సీమకు చక్రవర్తుఁలు, పులమావి వారిని గెలిచెను. తరువాత తూర్పు చళుక్యరాజులు స్వతంత్రులైరి. పశ్చిమచాళుక్యుల బలము తగ్గిపోయెను. సుమారారువందల యేండ్లు తూర్పు చళుక్య చక్రవర్తులక్రింద నాంధ్రదేశము శాంతియు, సౌఖ్యము ననుభవించెను. తూర్పుచాళుక్యులకు చోళరాజులతో సంబంధ బాంధవ్యములు కలుగుటచేతనుఁ దూర్పు చాళుక్యచక్రవర్తుల రాణులందరు చోళరాజుల కూతుండ్రగుటచేతను ఆ నాఁటి కాంధ్రులకన్న ద్రావిడులెక్కువ నాగరకులుగా భావింపబడుట చేతను తూర్పు చళుక్య యువరాజులు మాతామహుల యింటనే పెరుగుచుండిరి. నాగరకతపైనను విద్యలపైనను చోళులముద్ర యధికముగా కనిపించుచుండెను. చోళరాజులు క్షత్రియులు. చాళుక్యరాజులు క్షత్రియులు. వెలనాఁటి చోళులు క్షత్రియులు కారు. చోళులు కారు. ఆంధ్రదేశస్థులైన చతుర్థకులజులు. వారికి చోళు లన్ని పేరుపెట్టికొనుట యొక యాధిక్యము. వర్ణవివక్ష లేదు. సామంతులైనచో చోళులని పెట్టుకొనుచుండిరి.

అట్లు ఆ రీతిగా ఆరువందలయేండ్లక్రింద పరాభూతులైన వేంగిపల్లవులు తూర్పు చాళుక్యరాజులకు సామంతులై ఆ సామంతత్వముకూడ కుఱుచబడి వెలనాఁటిచోడుల ప్రతిభ యెక్కువై తా మొక చిన్న పాలెగాండ్రుగా నిలిచిపోయిరి. వారికి చేబ్రోలు యొక్క వైభవము లేదు సరికదా, నాదెండ్ల వైభవముకూడ లేదు. పేరునకు రెండేసుల నడిమివిషయమున వేంగివిషయమును, వేంగిరాజులది. ఈ వేంగిరాజులు క్రమ

ముగాఁ దాము పల్లవుల మనుమాట మఱచియేపోయిరి. తాముఁ గూడ చోళుల మనుకొనుట గొప్ప యనుకొనిరి. అందుచేత వారు తాము వేంగిచోళుల మని చెప్పుకొనుచుండిరి. వేంగి విషయ మంతయు వారిది. రెండేరుల నడిమివిషయము వారిది. కాని సర్వాధికారము వెలనాటి చోళులది. వేంగిచోళులు తమ వేంగిపురములో నుందురు. ఆ చుట్టుపట్లనున్న పాతిక ముప్పది గ్రామములమీఁద వారి యధికారము. వెలనాటి చోళు లెట్లు చెప్పిన వారట్లు వినవలసినవారు. వా రెదురే తిరుగరు. తిరిగినచో ధనదపురమునుండి సైన్యము వచ్చి వారి నడుపులోఁ బెట్టును. పశ్చిమచళుక్యు లాంధ్రరాజ్యమును గెలిచినతర్వాత అసలు కిరీటధారులైరి. వెలనాటి చోళులకే లేదు. వేంగిచోళుల కేమి యున్నది! వేంగిచోళులు క్షత్రియులై తమ క్షత్రియాచారములుకూడ మఱచిపోయిరి. ధనదపురములో నున్న యాచారములు అలవాట్లు మాటలు దుస్తులు అన్నింటియు ననుకరణ. ఆ నాఁడు త్రిపురాంతకుఁ డను రాజు వేంగీపురాధిపతి.

బద్దన్న యా నాఁటిసాయంకాలమునకు వేంగీపురము చేరెను. రెండుదినము లా యూరులో రహస్యముగా నుండి సర్వవార్తలు తెలిసికొనెను. త్రిపురాంతకునకు ముప్పదియేండ్ల వయస్సు. త్రిపురాంతకునకు బుద్ధి తెలిసినప్పటినుండియు, తన కోటలో క్షత్రియాచారములు, ధనదపురముయొక్క యనుకరణములు మానివేసెను. పశ్చిమ చాళుక్యులు సామ్రాజ్య మాఁకికొన్నప్పటినుండియు త్రిపురాంతకుఁడు గొంకభూపతిని మఱియు లెక్క చేయుచుండుటలేదఁట. ఆయన తనయంతటఁ

దాను సైన్యము సమకూర్చుటకు, సర్వస్వతంత్రుఁడగుటకుఁదాను కూడ తూర్పుచాళుక్యుల సామంతులలో నొక యధికుఁ డగుటకుఁ బ్రయత్నము చేయలేని స్థితిలో నుండెను. తన పదియూళ్లు గాక, దాటిపోయినచో నాయన రాజని యంగీకరించువారు లేరు. ధనవంతుఁడుగాడు. అట్టి స్థితిలో నుండెను. బద్దన్న యీ సంగతినంతయుఁ దెలిసికొని యొకనాఁడు త్రిపురాంతకుని చూచుటకుఁ బోయెను. తాను రాజదర్శనమునకు వత్తునని ముందు వార్త పంపించెను. రాజానుజ్ఞయైనచో జీవితాంతము కృతజ్ఞుఁడుగా నుందునని మనవి యని చెప్పవలసిన దని వార్త పంపించెను. త్రిపురాంతకుఁ డాశ్చర్యపోయెను. తా నెఱిగియున్నంతవఱకు త న్నిట్లు రాజదర్శన మని, దర్శనమున కాజ్ఞ యిప్పించు డని యడిగినవాఁడు కనిపించ లేదు. అనఁగా నధికుఁడైనవాఁడు. బద్దన్న కరవాలభైరవుని సంహరించినవాఁడు. మహావీరుఁడు. ఇరువది రెండు వేలసేనసమకూర్చినవాడు అతఁడు తలఁచుకొన్నచో నాంధ్ర దేశమంతయు గెలుగలవాఁడు. ఈ రహస్యవార్త లన్నియు త్రిపురాంతకునకుఁ దెలియును. ఆనాఁటి తెలుఁగు దేశ మొక చిత్రమైన దేశము. ప్రళయమంతటి మహాప్రయత్నము జరుగుచుండెను. ప్రతియాంధ్రునకుఁ దెలియును. ఈ రహస్యము పశ్చిమచాళుక్యాధికారి కొక్కనికిని తెలియదు. ఆ తెలియక పోవుటయెట్లో, ఈ రహస్యగోపనమెట్లో విచిత్రముగా నుండెను.

త్రిపురాంతకుఁడు పరిపరివిధముల నాలోచించెను. తనతో బద్దన్న కేమిపని? తనవల్ల నేమిపని కాగలదు. తన పది యూళ్ళలో ప్రోగుచేసినను నెంతమంది సైన్యమగుదురు. కత్తి విద్య తాను సామాన్యముగా నేర్చినవాఁడు. బద్దన్న త నొక్క

సేనానినిగాఁ జేసినను నంబయ్యగారొప్పుకొనరు. ఒకటి కావచ్చును. అతఁ డెవతెనో యొకస్త్రీని తీసికొనిపోయె నఁట. ఆమెకు నిలువనీడ యెచ్చటను దొరకలేదేమో తన యూరిలోఁ దన యాశ్రయములో నుంచఁదలఁచె నేమో!

ఆ నాఁటిసాయంతనము బద్దన్న త్రిపురాంతకుని దర్శించెను. చాలసేపు మాటాడిరి. త్రిపురాంతకుఁడు బద్దన్నను మిక్కిలిగా మెచ్చుకొను చుండెను. బద్దన్న వచ్చినపని యేదియో బద్దన్న చెప్పునని త్రిపురాంతకుఁడు. బద్దన్న యెంతవఱకు చెప్పలేదు. త్రిపురాంతకుఁడే యడిగెను. "నీవు ,నంబయ్యగారిని చూడవచ్చును. మందయ్యగారి దర్శనము చేయవచ్చును. ప్రభువును చూడవచ్చును. న న్నెందుకు చూడవచ్చితివో నాకు తెలియదు.

బద్దన్న—అయ్యా! నేను రెండేరుల నడిమి, వేంగివిషయములయం దిరువదిరెండు వేలసైన్యమును సమకూర్చితిని. పశ్చిమ చాళుక్యసైన్యమును మనదేశమునుండి పారద్రోలవలయునని నా యూహ. ఈ సైన్యము నడుపగల నాయకుఁడు నాకు కానుపించలేదు. నేను నడుపగలుగుదును. నాకు కులము లేదు, అధికారములేదు. త్రిపురా—కులము తీసికొనివచ్చి పెట్టలేరు గాని, యధికారమున కేమి? నంబయ్యగారివంటి వీరులు నీ శౌర్యము, నీ సాహసము, నీ ప్రయత్నము మెచ్చుకొనక పోరు. వారు తలచుకొన్నచో నీ కధికార మెంతసేపటిలో వచ్చును. బద్ద—అయ్యా! నా కధికారముక్కఱలేదు. నా కులము నాకు చాలును. నా కులమున కున్న గౌరవము దానికున్నది. నంబయ్యగారి శౌర్యాదులయందు నాకు విశ్వాసములేదు.

ఆయన శౌర్యము, ఆయనయొక్క మొనలు నడుపగల శక్తి, పాలెగాండ్ర నడచగలుగుటకు పనికివచ్చునేమో! దేశమాక్ర మించిన పరసైన్యమును తోలుటకు గాని, దండెత్తివచ్చిన శత్రుసైన్యము నదలించుటకు గాని పనికిరాదు. ఆ సంగతి యేడేండ్ల క్రింద తెలియనే తెలిసెను. అందుచేత నేను వేఱే సేనానిని వెదకుకొనుచున్నాను. త్రిపు—నీవు నీ వంటివాని కోసము వెదకుచున్నచో దొరకు నను నమ్మకము నాకులేదు. బద్దన్న—ప్రభూ! నావంటివాఁడనగా నేమి! క్షత్రివిద్యలో నాయంత వాడుండడు. కాని వ్యూహములు పన్నుటలో విప్పుటలో మఱియు నితరములైన యుద్ధవ్యవహారములలో తమవంటి రాజ వంశీయులకంటె నాకెక్కువ యేమి తెలియును. త్రిపు—బద్దన్నా విద్య రెండువిధములు. ఒకటి చదువుకొని శిక్షణపొందినచో తెలియును. రెండవది పూర్వజన్మసంస్కారముచేత వచ్చును. శ్రీరామచంద్రుఁడు తన పండ్రెండవయేట తాటకాసంహారము జేసెను. అది నేర్చుకొన్న విద్యయందువా! బద్దన్న—అయ్యా! నాయందు మీకు గల ప్రేమకు చాల కృతజ్ఞుఁడను. తమరు నా సేనానిగా నుండవలయు నని నా మనవి. త్రిపు—ఒక్కటి చూడుము. ఇంతచేసినవాఁడవు ఈ యుద్ధమెట్లు చేయవలయునో యే సైన్యము లెచట నెదురునడుపవలయునో యివియన్నియు నీవాలోచించకుండ నుండవు. ఇప్పుడు నీ వొక సేనానిని తెచ్చి పెట్టినచో వానిని నాయకుఁ పెట్టెదవు. ఆ సేనాని క్షత్రివిద్యలో నైన నీవంటివాఁడు కానిచో నేమి లాభము! బద్దన్న:—ప్రభూ! ఆ సేనాని మీరు, క్షత్రివిద్యలో మీరు నాయంతటివారు. త్రిపు:—బద్దన్నా! నీ వన్నమాట నా కర్థమగుట లేదు.

బద్ద:-ప్రభూ! మీ రెంతటివారో మీకు తెలియదు. నాతో యుద్ధము చేసినచో మీకు తెలియును.

త్రిపురాంతకుఁడు కొంత సేపాలోచించెను. అర్థము తెలిసి కొనెను. నవ్వెను. సంతోషించెను. ఆ నాఁడు సాయంతనము ప్రారంభించి వారముదినము లుదయసాయంకాలములు రెండు వేళల నుదయమున జాము, సాయంవేళ జాము నిర్వారు కత్తియుద్ధము చేయ నారంభించిరి. త్రిపురాంతకునకు స్వాతంత్ర్యాభిలాష యెంతకలదో, విద్యాభిలాష యంత కలదు. తన వంశమును వృద్ధికి తీసికొనిరావలయు నని యెంతకలదో, బుద్ధియొక్క చురుకంత కలదు. వారము దినములలో త్రిపురాంతకుఁడు సర్వఖడ్గవిద్యావిశారదుఁ డయ్యెను. అతఁడుహూడ కత్తి, శత్రువు కత్తితో జోడించి వెనుకకు కత్తిదూసికొనుటలో హస్త్రాంగుళి త్రాణముతోగూడ నంగుళులు ఛేదించఁగలఁడు. శాత్రు యొక్క కుడి వైపునకు మఱలి, డాలుతో కత్తి యాఁచిపట్టి గుఱ్ఱము ముంగాళ్లు నఱుకగలఁడు. శత్రువు చేతిలో నున్న కత్తి సుంభముగా పదిగజముల దూర మెగిరిపోవు నట్లుగిరించఁగలఁడు. దూరమున పడిన యా కత్తిపై పోయి దూఁకగలఁడు. అన్నిటికన్న బద్దన్నయొక్క లోకోత్తరమైన మెలకువ యొకటి కలదు. ఒక యెుకుపుతో శత్రువు చేతిలోని డాలును, కత్తిని రెంటిని వదలిపెట్టి నేలపై వెలికింతలుగ పడి పోవును. అప్పు డతని గొంతుకపై పడి కూర్చుండుటయే. బద్దన్న త్రిపురాంతకునకు దాచకుండ నిదియు చెప్పెను. మఱియు చివరి మూఁడు దినములలో నిద్రలేదు. ఆహారము లేదు. ఇట్లు పదినాల్గు జాములును అభ్యాసమే అభ్యాసము. నేర్పిన దే

మఱల నేర్చు, చేసినదే మఱల చేసి, సిద్ధహస్తుడై నట్లు కనిపించి నంతవఱకు త్రిపురాంతకుఁడు వదలలేదు.

తరువాత రెండుదినములు బద్దన్న త్రిపురాంతకులు నిద్రపోయినవారు పోయినట్లే యుండిరి. మూఁడవదినమున నిద్ర అను మొగములు తేటయిచ్చెను. శరీరములు సులువుగా నుండెను. బద్దన్న నంబయ్యగారియింటగాని, చివరకు గంగ చోళుని యింటగాని ముంగిలిదాటి లోనికి పోలేదు. త్రిపురాంతకుఁడు బద్దన్న నింటిలోనికిఁ దీసికొనిపోయెను. బద్దన్న వలదనెను. త్రిపురాంతకుఁడు వంటయిల్లుతప్ప నీవురాకూడని భాగము నా యింటిలో లేదనెను. బద్దన్నయు, త్రిపురాంతకుఁడును లోని యొకగదిలో పరుపులమీఁద కూర్చుండిరి. బద్దన్నకు తేర్లుకట్టి నట్లుండెను. ఇట్లనెను.

"ప్రభూ! నీదయకు నాచర్మముకోసి చెప్పులుకుట్టియిచ్చి నను నీ ఋణము తీర్చుకొనలేను. చూచితిరా! నా నోటివెంట వచ్చినమాటగూడ నా కులమునే చెప్పుచున్నది. అందుచేత నేసేనానిగా నుండజాలను. తమరే కావలయును. త్రిపు ఆమాట నీ కులమును చెప్పుట యట్లుండఁగా నీ వినయమును చెప్పు చున్నది. ఇంక నేను సేనానిగా నుందును. కాని నేను చెప్పి నట్లు నీవు వినవలయును. బద్ద—తప్పకుండ వినెదను. గొంక భూపతి నా ప్రభువు. తరువాత మీరు. ఇది నా నియమము. త్రిపు—అట్లుకాదు. విక్రమచోళుడు నీచక్రవర్తి. గొంకభూపతి నీ రాజు. నేను నీకు ప్రభువును. రాజకీయముగా నిది. నీవు నీవుగా, నేను నేనుగా, నీవు నేను, నేను నీవు. బద్దన్న—మీ యనుగ్రహము. మీరేమిచెప్పుదురో చెప్పుడు. త్రిపు—నీ విది

వలెను యుద్ధముయొక్క పథక మెట్లు వేసితివో నాకు చెప్పుము. ఈరాత్రి నేనంతయు విచారించి తెల్లవారు ప్రొద్దున నా నిశ్చయము చెప్పెదను. నే నేదైనను మార్చినచో నీ యంగీకారముతోడనే మార్తును. నిన్నుగూర్చి నాకొక యూహయున్నది. నీవు దాని దెప్పకొనితీరవలయును. బద్దన్న—త్రిపురాంతకునితోఁ దాను పూర్వము మంచయ్యగారితో మాటాడినదంతయు మాటాడెను. త్రిపురాంతకుఁడు వినెను.

మఱునాఁడు ప్రొద్దున కలిసికొని బద్దన్న త్రిపురాంతకుని చెప్ప మనియెను. త్రిపురాంతకుఁడు సర్వము సంగీకరించెను. కాని తనసేన, అనఁగా, బద్దన్న తనకిచ్చినసేన, తన యధుపులో నుండవలయును. తానే దానికి సేనాని. నంబయ్యగారు మహా సైన్యాధిపతి. ఆయనయాజ్ఞలిచ్చువాఁడు, తాను నెరవేర్చువాఁడు. నంబయ్యగారు తన సేనలు నడుపువాఁడు కాఁడు. కావలసినచో వెలనాటి శతసహస్రవిషయసేనలు నడుపుకొనవచ్చును. ఇది మొదటిది. రెండవది వేంగి రెండేసుల నడిమివిషయములకు తాను ప్రభువు. కృష్ణా గోదావరులమధ్య దేశమునకు తాను ప్రభువు ఇచ్చటి సుంకములు తాను చెల్లించుకొనును. తాను మఱునాఁడే బయలుదేరి విజయవాటము పోవును. అచ్చటపశ్చిమ చళుక్య సేనాని కలఁడు అతనితో మాటాడి యీ విషయము నిర్ణయించుకొనవచ్చును.

త్రిపురాంతకుఁడు మఱునాఁడు బయలుదేరి విజయవాటము పోయెను. ఆ సేనానితో మాటాడెను. అతనిని భయపెట్టెను. "రహస్యముగా పెద్దయుద్ధప్రయత్నము జరుగుచున్నది పశ్చిమ చళుక్యాధికారము తొలఁగించుటకు పెద్దయుద్యమము జరుగు

చున్నది. కృష్ణాగోదావరుల మధ్యదేశముమీద నా యధికారము లేనిచో మీరీయగడ్డు తొలఁగఁబెట్టుకొనలేరు" అని చెప్పెను. ఆ సేనాని వెంటనేధనదపురమునకుఁబోయి వీరభళ్ళాలు నితో చెప్పెను. అంతయు ముంచుకొని వచ్చుచున్న దని త్రిపురాంతకుఁడు చెప్పుట, వానికి నట్లే కనిపించుట. యీ దోమ మెక్కడనున్నదో తెలిసికొనలేకపోవుట, ఒక సామంతుఁడైనను తమవైపులేకుండుట, పశ్చిమచళుక్యసేనానులకు గుబ్బిసలాటయై పోయెను. వారు పైకివాసి త్రిపురాంతకుని వేంగినడిమేరుల విషయాధీశుని చేయుదు మనచెప్పిరి. వేగరులగు బంటులను పంపించిరి.

## ౧3

తరువాత పది దినములు గడచెను. కళ్యాణినుండి వార్తలు వచ్చెను. త్రిపురాంతకుడు వేంగినడిమేరుల విషయాధీశుఁ డయ్యెను. వీరభళ్ళాలుఁను గొంకరాజున కిది తెలియఁ జేసెను. నంబయ్య మందలయ్యలకు వార్తలు పంపించెను. అందఱును తెల్లపోయిరి. గొంక రాజేమనుటకును వీలులేకపోయెను. ఈ వార్త కృష్ణాగోదావరులమధ్య ప్రతిగ్రామటికలో, ప్రతి పురములో ప్రకటింపఁబడెను. త్రిపురాంతకుఁడు గొంక భూపతికి లేఖ వ్రాసెను. "సర్వాంధ్రదేశమునకు మీరే ప్రభువులు. నేను వేంగి విషయాధీశుఁడను. శతసహస్రవిషయమునకు నంబయ్యగారెట్లో, నాదెండ్లవిషమునకు దుర్జయమండుఁడెట్లో, వేంగి నడిమేరుల విషయమునకు నే నట్లు. మీరు నాకు రాజులు. విక్రమచోళుఁడు నాకు చక్రవర్తి" అని. ఈ లేఖ చూచుకొని గొంకయ్యగారు కొంత శాంతించెను. ఏమి చేయుటకును

వీలులేదు. పశ్చిమచళుక్య సైన్యము దేశము లో నాలుగు వేలున్నది. తలా యొకచోటనున్నది. వారు చూచుచుండగా దాను సైన్యములు ప్రోగుచేయుటకు వీలులేదు. త్రిపురాంత కుని శిక్షించుటకు వీలులేదు. నంబయ్య మందయ్యలకు కబు రంపించెను. వారువచ్చిరి. వారితో చెప్పెను. వారు వీరు ఎంత విచారించినను ప్రయోజనము లేకపోయెను.

ఇంటికి తిరిగిపోవుచు మందయ్య నంబయ్యతో ని ట్లనెను. "నిజముగా నిందులో వచ్చిన భయము లేదు. ఇది యంతయు బద్దన్న పన్నాగమైయుండును. ఈవ్యవహార మిట్లగు టకు కారణము మీరు. అతఁడు సామాన్యుఁడు కాఁడు. మీరతని యెడ నట్లుప్రవర్తించి యుండకూడదు. అతఁడు రాజ్యములు తల్లక్రిందులు చేయుగల శక్తిశాలి. మనకేమి నష్టము? మన ప్రభువునకు నష్టము. వారికి చెల్లుబడియగు సుంకము పూర్తిగా వంతులో రెండువంతులు పోయినది. మందయ్యగారెన్నియని నను నంబయ్య మాటాడలేదు.

త్రిపురాంతకుఁడు క్రమముగా విజృంభించెను. విజయ వాటములోని సేనాపతితో చెప్పెను. తగినన్ని సైన్యములు తాను చేర్చినచో విప్లవసైన్యమును వెదకి వెదకి ఛేదించ వచ్చును. అట్టిప్రయత్నము తామే యిప్పుడు చేయనిచో విప్లవ సైన్య మేదొంగపోటుపేళనో, పశ్చిమచళుక్యసైన్యము నెదు రించి, యోడించినచో విక్రమాంక దేవుఁడు మఱల దండయాత్ర రావలసియుండును అట్టి దుఃస్థితిపట్టకమున్న తాను సైన్య మును సమకూర్తు ననెను. తన సమకూర్చు సైన్యమంతయు

విజయవాటమునందలి సేనానినీ, వీరభల్లాలునియు సఖీనములో నుండుడని చెప్పెను. వారంగీకరించిరి

ఈ రీతిగా త్రిపురాంతకుడు మరల వేంగికి తిరిగివచ్చునప్పటికి సుమారు నెలదినములు పట్టెను. అప్పటివఱకు బద్దన్న వేంగిలోననే యుండెను. పలుసారులు తాను విజయవాటములో నున్నప్పుడు త్రిపురాంతకుడు బద్దన్ననుగుఱించి యా సేనానులతో మాటాడెను. వారు మొదట బద్దన్నయే యీ విప్లవసైన్యసేనానాయకుడని చెప్పిరి. త్రిపురాంతకుడు కాదని చెప్పెను. బద్దన్నకు, నంబయ్యగారికి పడదని చెప్పెను. వీరభల్లాలుడీ వార్త కొంత వినెను. బద్దన్న చేబ్రోలుబోవుట, నంబయ్యగారు పరాభవించుట మొదలైనవార్త క్రమముగా శతసహస్రవిషయమును, వేంగినాటను ప్రాకెను. అది వీరభల్లాలుడు వినెను. పశ్చిమ చాళుక్యసైన్యమునకంతకు తెలిసెను. అందుచేత బద్దన్న మనస్సు విరిగెననియు, నతడు తమతో చేరుననియు, త్రిపురాంతకుడు చెప్పెను. వీరభల్లాలుడును, విజయవాటములోని సేనాపతియు నంగీకరించిరి.

త్రిపురాంతకుడు వచ్చి బద్దన్నతో జరిగినదంతయు చెప్పెను. ఇప్పుడు తమ సైన్యములన్నిటిని రహస్యమే లేకుండ సమకూర్చవచ్చుననియు, నవసరము వచ్చినప్పుడు తాను చేయదలచుకొన్న పని చేయవచ్చుననియు చెప్పెను. బద్దన్న సంతోషించెను. కాని బద్దన్నకు కొప్పాక పోవుటకుగాని గోశాల పోవుటకుగాని మనస్కరించుటలేదు. తన యుపజ్ఞచేత సమకూర్చబడిన సైన్యములైనను, తనయందలి యీ దోషవశత తన యధికార మంగీకరించునో, యంగీకరించరో! నాయకులు,

దళవాయులు, దుమ్ముదారులు, వీ రందఱితో తాను రహస్యముగ మాటాడుట యెట్లు? త్రిపురాంతకుఁడు వేసిన యూహ క్రొత్తయెత్తు వారికిఁ దెలియుట యెట్లు?

తాను బాదమ్మను చూచి నెలపైన కావచ్చినది. ఆమె కొప్పాక చేరెనా, చేరె నని యెవరో చెప్పిరి. పదిరోజులలో కలసికొందు నన్న తాను నెలయు పదిరోజు లైనను కలసికొనలేదు. తాను మఱల కలసికొనువఱకు నామెను రక్షించునంత శ్రద్ధ బుంగన్నకు తనయందుండెనా? తాను కొప్పాక కెప్పుడు పోవలయును? ఎట్లు పోవలయును? ఇదియంతయు నైన తరువాత త్రిపురాంతకుఁడు తన కేదో చెప్పెద ననెను. ఆ చెప్పినది. యేమి? ఇంతవఱకుఁ దెలియలేదు.

ఒకనాఁటి ప్రొద్దున్న బద్దన్న త్రిపురాంతకునితో తాను గోశాల పోవుదు ననెను. త్రిపురాంతకుఁడు మఱి రెండుదినము లాగిపోవుదు గాని యని చెప్పెను. చివర కొకరోజున ప్రయాణమయ్యెను. బద్దన్న పోవునప్పుడు త్రిపురాంతకుఁ డతనిచేతికి నొక చిన్న మూట యిచ్చెను. అది చిక్కని పట్టురుమాలలో కట్టఁబడి యుండెను. బరువుగా నుండెను. త్రిపురాంతకుఁడు "దీనిని నీవు గోశాలవెళ్ళిన తరువాతగాని చూడరాదు. నీవు మీ నాయకులను, దళవాయులను, దుమ్ముదారులను పిలిచి త్రిపురాంతకుని బంట్లు సైన్యము సమకూర్చుటకు వత్తురు. మీ రంద ఱాసైన్యములో చేరవలయు నని చెప్పవలయును. బద్దన్నా! నీ సైన్యమే నా సైన్యము. ఇప్పుడు మన సైన్యము నకు బహిరంగముగా శిక్షణ మీయవచ్చును. రేపు కూర్మతీర్థమునకు ప్రభువు నాదెండ్లసైన్యములో బయలుదేరును,

వారిని పశ్చిమ చళుక్యసైనము నిర్బంధించినచో మనసైన్యము సర్ది చెప్పవచ్చును. నీవు పో" మ్మనెను. బద్దన్నకు దారిలో కొంతదూరముపోయిన తర్వాత నామాట విప్పి చూడవలె ననిపించెను. మిత్రుఁ డింటికిఁబోయిగాని చూడవల దనెను. ఇంతలో మిత్రవాక్య మెందుకుఁ బాటించరాదు!

మూఁడవదినము సాయంతనమున కొంత ప్రొద్దుండగా బద్దన్న గోశాల చేరెను. దూరమునుండి యతని నెవ రెవరో చూచిరి. అతఁడు కనిపించినంతనే జన మందఱు కలవరపడఁ జొచ్చిరి. అతని కేమియుఁ దెలియలేదు. తాను బాదమ్మను తీసికొనిపోవుట పెద్ద సంక్షోభ మయ్యెను కాబోలు! తన మర్యాద యీయూరిలో నేమయ్యెనో! తన తండ్రి నేమి చేసిరో! గ్రామములో ప్రవేశించెను. ప్రవేశించినదాది తనవెంట జనము గుంపుగా వచ్చుచుండిరి. సర్వజనములును తనయందు గౌరవమును ప్రకటించుచుండిరి. కొందఱు దూరమునుండి వినయ మవలంబించుచుండిరి. అతని కర్థము కాలేదు. ఇది యేమైయుండును! ఊరి నడివీథిలోనికి పోయెను. అచ్చట రచ్చసావడియందు ఊరి సభ్యులు పరిషత్సభ్యులు కొంతఱుగా వచ్చి సమావేశమైనట్లు కనిపించెను. మిత్రుడైన నన్నయ్య యెదురుగా వచ్చెను. బద్దన్న పంచముఖులకుఁ దగుటచే 'పరిషత్సభ్యులకు దూరముగా నొకచో నమర్పఁబడి యుండెను. నన్నయ్య, బద్దన్న నా చేతను నందాసీనుడు కమ్మనెను. బద్దన్న కూర్చుండెను, నన్నయ్య యిట్లు చెప్పెను.

"బద్దన్న పంచముఖులకుఁడు, అతని పుట్టుకచేత నా కులమంతయు పవిత్రమైనది. పశ్చిమ చళుక్యరాజులయొక్క గౌర

వము సంపాదించిన యీ బద్దన్న మన కెంతయు ప్రశంస
నీయుఁడు. వేంగి విషయాధీశుఁడైన త్రిపురాంతకదేవుఁడు వేంగి
చోళరాజు నిజముగా మన రాజు. మనసేనాని. కృష్ణాగోదావరీ
మండలమధ్య ప్రదేశము వేంగిచోళుఁడి. త్రిపురాంతకుఁడు తన
రాజనీతిప్రభావముచేత వేంగినాడును నడిమేరుల నడివిషయ
మును మఱల తన కైవశముచేసికొన్నాఁడు. ఆ మహారాజు
బద్దన్నను తనకు సేనానిగా నియమించెను. విజయవాట
పురాధిపతిగా నియమించెను. విజయవాటమునకు తూర్పున
నున్న వైదుగవ్యాతుల మేఱలోనున్న పూండు లన్నియు
విజయవాటముయొక్క రాజకీయావరణములోనివి. అందుచేత
మనకందఱకు బద్దన్న రాజైనాఁడు. ఇది గోశాల యదృష్టము.
బద్దన్న గోశాలలో పుట్టెను. గోశాలలో పెరిగెను. గోశాలకు
రాజయ్యెను. ఈ విజయవాటముయొక్క రాజకీయావరణము
లోని యన్నిగ్రామటికలలో మన గ్రామటిక పుణ్యవిశేష మధిక
మైనది'' అని యుపన్యసించెను. మఱియొక పారిషదుఁడు లేచి
బద్దన్నకు స్వాగతము చదివెను.

బద్దన్న కేమియు తెలియులేదు. అతఁడు వెలవెలపోవు
చుండెను. ఇది యంతయు పరిహాసమా! నిజమా! నిజమైనచో
త్రిపురాంతకుఁడు తనతో నేల చెప్పలేదు. అప్పుడు బద్దన్నకు
తనచేతిలోని మూటమాట జ్ఞాపకము వచ్చెను. ఆ మూటలో
మూఁడు రాగిరేకులమీఁద దానశాసనము చెక్కఁబడియుండెను.
మూఁడు రాగిరేకులకు నెడమభాగమున రంధ్రములు
చేయఁబడి, మూఁడింటిని సంపుటించియుండెను. ఆ దానశాసన
మును నన్నయ్యచూచినవెంటనే దానిని చేతిలోఁ గైకొని

సమావిష్టులైన పారిషదుల కంఠములకుఁ జూపించెను. వివాహ సూత్రబంధనవేళ మంగళసూత్రములవలె నాశాసనపురేకులు వందచేతులకుఁ దాకెను. కొందఱు చదివెడివారు. కొందఱు సంతోషించెడివారు. కొందఱు నా చేతికిమ్ము, నా చేతికిమ్మని యొగబడెడివారు. ఆ నాఁటిరాత్రి బద్దన్న నాగయ్య, పాపయ్య లను బిలిపించెను. వారిద్దఱు దుముదారులు. వారిసేనలెట్టిస్థితిలో నున్నవో, దళవాయి లెట్లుండిరో పెరదుముదార్లతో వారు కలసికొనిరో, యంతయు ప్రస్తావించెను. తాను పోయి సుమారు మూఁడునెలలు కావచ్చుచుండెను. ఈలోపుగాఁ దన పని చెడెనో తన క్రిందియుద్యోగస్థులు సరిగా చూచుచుండిరో లేదో యతనికిఁ దెలియలేదు. అన్నిటికన్న విచిత్రము- బాదమ్మ సంగతి యీయూరిలో ననుకొనినవారు కన్పింపలేదు. తన యూరిలో లేని యప్రథ చేబ్రోలులో నెట్లుండెను! వేంగిలో నెట్లుండెను! తాను విజయవాటపురాధిపతి యగుటచేత గోశాలీయులు తనతో నా ప్రసక్తి చేయుటలేదా!

తాను వెళ్ళిననాఁడు తన తండ్రి యింటివద్ద లేడు. మఱు నాఁడు వచ్చెను. కొడుకును కౌఁగలించుకొని యేడ్చెను. ఆ యేడ్పులో శోకానందములు రెండును కలసియుండెను. తండ్రి రహస్యముగా కొడుకుతో ననెను. “బాబూ! బాదమ్మను నీవు తీసికొనిపోతివని యందఱు ననుచున్నారు. నీవు రాజ్యకార్యముల మీఁద నుంటివి. ఏమియు నెఱుఁగవినిన్ను జనులాడిపోసికొను చుండఁగా నేను వినలేకపోయితిని. ఇప్పటి కందఱకు తెలిసెను. బాదమ్మతో నీ కేమిపని! అది నీకన్న నన్నేండ్లుపెద్దది. అది యుపటు నచలఁది రిగి కొప్పాక చేరినదఁట. నీవు సేనానివై

యింటికి వచ్చితివి. నీతో బాదమ్మ వచ్చునని యందఱునుకొనిరి. నీ వొక్కరవు వచ్చితివి. అందఱకు నిప్పుడు తెలిసెను" అనెను. బద్దన్న నివ్వెరపోయెను. తండ్రికేమియు సమాధానము చెప్పలేదు. నిన్నటి తన స్వాగతమునకిదియా కారణము. తానును బాదమ్మతోఁ గలసివచ్చినచో నప్పుడెట్లుండెడిదో! ఇంతకు బాదమ్మ కొప్పాకలో సుఖముగా నున్నదని తెలిసెను. ఈ సంగతి వెలికి పొక్కరాదు. యుద్ధము పూర్తియగుదాక నిట్లే యుండవలయును. మఱునాఁడే త్రిపురాంతకుని భటులు ప్రతి నగరమునకు బయలుదేరిరి. దళములను సమకూర్ప నారంభించిరి. బద్దన్న వారిని పోయి కలసికొనెను. పూండి, పూండి యందు గుంపులు నాయకులు పిలువఁబడిరి. పదిదినములలో నిరువదిరెండు వేల సైన్యము వేంగీపురమునకు బహుముఖము లుగా ప్రయాణమగుచుండెను. సైన్యమంతయు వేంగీపురాభి ముఖముగ పంపించి బద్దన్న కొప్పాకపోయెను.

అప్పటికి వర్ష ఋతువు కాళరాత్రివలె విజృంభించెను. కృష్ణాగోదావరు లెఱ్ఱని కొండపార్శ్వముల కొమ్మలతో క్రుమ్మి యెఱ్ఱనిదుమ్మంతయు నొడళ్ళగొట్టుకొని రంకెలు వేయుచు నాసాపుటములనుండి యావిరులు విరియించుచు నెదురుగాలికి పరుగెత్తు నడవి దున్నలవలె క్రొత్తనీళ్ళతో దూకుచుండెను. నేలయంతయు బురదయయ్యెను. వేంగీపురాభి ముఖముగా పోవు సైన్యముయొక్క తోలుచెప్పులక్రింద వాని కంటె దట్టమైన మంటిచెప్పులు సిద్ధమయ్యెను. సైనికులు దభుమనభుమ యీడ్చి కాళ్ళచెప్పు లూడఁదీసి చేతులలోని

డాళ్ళతో, వెనుకనున్న త్రిపుష్కసులతో, చెప్పట్ల యుదుగున నున్న మంటిని గీకుచుండిరి.

బద్దన్న కొప్పాక చేరెను; బుంగన్న యింటికి పోయెను. బాదమ్మ బద్దన్నను చూచెను. ఒక్కపెట్టున నేడ్చెను. బుంగన్నకు పెండ్లములేదు. బిడ్డలులేరు. తలచెడిన చెల్లెలొకతె యుండెను. అది గూడుకుకవేసి పెట్టుచుండెను. బాదమ్మ బుంగన్న యింటిలో నేలయుండెనో యెవరికిని తెలియదు. ఆమెతండ్రి యామెను తనయింటికి రమ్మనెను. ఆమె రానవెను. బుంగన్న యేంబదియేండ్లవాడు. ఎవ్వరనుమానించలేదు. ఈ రహస్యమును బుంగన్నకొక్కనికే తెలియును. అతడు బద్దన్నమీది ప్రేమచేత రహస్యమును కప్పిపుచ్చెను. ఈరహస్యమందఱకును తెలియును. ఎవ్వరికిని తెలియదు. అదియొక చిత్రముగా నుండెను

ఆ రాత్రి బాదమ్మ బద్దన్నలయొక్క సమాగమము సుఖము దుఃఖము రెంటియొక్క సమపాళముగా, గడచిన దినములయొక్క వివేకము, అవివేకము, యీ రెంటియొక్క కలగలుపుగా, భవిష్యత్తునందలి యవిజ్ఞాతపరిణామభావనాజనిత భయరేఖాంచల స్పృశముగా నైనను, తత్కాలసమధిక సౌఖ్యభూమిగా నుండెను. వారి యీ యేకాంతమునకు బుంగన్నయు సహాయపడెను. అతని చెల్లెలు సహాయపడెను. కామము విచిత్రమైనది. బుంగన్న స్త్రీ సౌఖ్యమెఱుగడు. అతని చెల్లెలు పురుషసౌఖ్య మెఱుగదు. వారిద్దఱును వీరిద్దఱికలయిక యభిమానభూమియయ్యెను. తమసంగతి యెవరికి నేల తెలియ లేదు. కొప్పాకలో నేమనుకొనుచుండిరి. గోశాలలో నేమనిరి. బద్దన్న విజయవాటపురాధిపతియయ్యెను. దీనివలన తమ

సంయోగమునకుఁ గలిగిన నిర్బంధము సడలునా? తొలఁగు టయుఁ గూడ కలుగునా? ఇందులో తప్పేమున్నది? లోకమున నంటకు కామ మున్నది. అంతటిది ధర్మకామమేనా? ధర్మ కామములో నెంతభాగము భయధర్మము? ఎంత భాగము సహజధర్మము? ధర్మము సహజమా? భయబాధితమా? ధర్మకామమని తా ననుకొనుచు సహజకామమునందలి రక్తి యెంత యెక్కువ? కాని యీ సహజకామములో నెవం డెంత హత్తుకొనునో, వెలి కంత నిందించుట, బహిరంగముగా దాని నంతతిరస్కరించుట, లోకములో నిది యెంతభాగము? సహజకామమునందు సహజముగా నధికసౌఖ్య మున్నది. ఆ సౌఖ్యము తన్ను బాసినది. లోకములో నెంతయున్నది? నేయి హృదయము లొక్కసారి విడివిడిగా ప్రత్యేకప్రత్యేకముగా సహజకామమునే వాంఛించును. ఈ హృదయము లన్నియు సమావేశమైనప్పుడు, ఆ సహజకామమును తిరస్కరించును. పదిమంది చేరి ధర్మమును మాటాడుదురు. ఎవనికినా డధర్మ మును భావించును. ఈ పదిమందిలోను నొకనినిచూచి యొకడు భయపడును. ఎవనిహృదయము, మఱియొకనికి చెప్పడు. ఈ పదిమందిలో నొక్కడును సాహసుడు లేడు. సాహస మనునది సర్వసామాన్యమైన గుణము కాదు. మనుష్యు లలో నీ గుణము పరిమితిసంఖ్యయందే కనిపించును. విద్యా ప్రకటనలో నీగుణము ప్రతిభగ భాసించును. కామవిషయమున నిది యధర్మముగా భాసించుచున్నది. దీని కిది యపధి యుని యెక్కడ? ఒక్కొక్కప్పుడు సాహసు డైనవానియెడల కొన్ని విషయము లంగీకార్యము లగుచున్నవి. ఒక విద్యాప్రకటనము

నకుం గొన్ని సూత్రము లుండును. ప్రతిభాశాలి యీ సూత్రచ్ఛేద నము చేయును. విద్యాప్రకర్ష, విద్యావైభవము, విద్యావిస్తృత తెలియనివా రా సూత్రచ్ఛేదన మంగీకరించరు. రసజ్ఞులైనవా రంగీకరింతురు. ఈ రసజ్ఞుల యంగీకారము మీఁద నా విద్యా ప్రామర్యము కలుగుచున్నది. ఇట్టిస్థితి కామవిషయమున లేదు. సర్వకాలములు ధర్మ కామములు బోదెల వెంటనే పోవలయును. రేఖామాత్ర మటు నిటు తొలఁగరాదు. కామము ధర్మముగా నుండవలయు నన్నచో, కామము యొక్క ఫలితము వివాహ మైనచో, అవివాహమిద్దఱు వ్యక్తులయొక్క సమాగమమైనచో ప్రధానధర్మము చెడకుండ నీ వ్యక్తులు వ్యక్తిగత ధర్మముల నుల్లంఘించరాదు. ఉల్లంఘించుట యుక్తగత ప్రధానధర్మ విచ్ఛేదనమునకు హేతుభూతమగును. ఇదియొక బంధనము. ఇది బహుసూత్రములయొక్క సమాకర్షణముచేత చేయఁబడునది. ఇం దే సూత్రమునందు పురి తక్కువయైనను ప్రధానమైన మాని యందు సడలుట కనిపించును అల్లిక తెగిపోవును.

ఆ రాత్రియంతయు బద్దన్న బాదమ్మల హృదయ ములు, మనస్సులు, సుఖముమీఁద, తక్కువమీఁద వెడలెను. బయట మేఘములు కుండలు బ్రద్దలు కొట్టినట్లు మొఱయు చుండెను. ఈ నెలయు పదునైదు దినముల వియోగముచే బద్దన్నయొక్క వార్తయే తెలియమిచే, నగరు తాను మరల కలసికొందు మను నూహ లేమిచే, తన బ్రతుకు అస్తినాస్తి భావసన్నగత మగుటచే. నామె తిన లేదు, త్రాగ లేదు. ఆమె శరీరమంతయు శుష్కించియుండెను. తల చీకిరిబాకిరిగా నుండెను. స్నానముచేసిన దినములే తక్కువ. చోడగంగుని

భార్య యిచ్చిన చీరలు కట్టు గట్టుకొని, మూటగానుండెను. నేడు స్నానముచేసెను. తలను నీళ్ళురాచి గోళ్ళతో దువ్వెను. చోడ గంగుని భార్య యిచ్చిన వెలగల చీరయొకటి తాల్చెను. కాని యామె శరీరము చిక్కియుండుటవేత నిగువురకు తొలినాటి సౌఖ్యములేదు. ఆమెమొదలు కౌగిలింతకు తక్కువ యయ్యెను. పెదవి చుంబనమునకు వెలితియయ్యెను. పరస్పరసమాకర్షణము తలగీసినట్లుండెను. కాని హృదయముల పొంగు వర్షానదివలె యుబికియుబికి వచ్చుచుండెను. బద్దన్న యామెకు ధైర్యము చెప్పెను. తాను విజయవాట పురాధిపతి. త్రిపురాంతక దేవుని సేనాపతి. యుద్ధమైన తర్వాత విజయవాటములో నొక చిన్న కోట కట్టును. ఆకోటలో తాను రాజు. ఆమె రాణి. పురాధిపతిని పరిమత్తు లేమియు చేయజాలవు. తమ సౌఖ్యమునకు భంగములేదు. ఆమెకు కొప్పాకలో నుండుటకు భయమైనచో తా నామెను వేంగికి తీసికొనిపోవును. వేంగిలో త్రిపురాంతక దేవుని కోటలోనే యుండవచ్చును. ఆమెమీద పూచికపుల్ల వ్రాలదు. అత డెన్నియైన చెప్పవిముక్తి. బాదమ్మ భయము తొలగలేదు. ఆమె మాటి మాటికి నేడ్చుచునే యుండెను. "ఇదిగో వర్షఋతువువచ్చెను. నీవు సైన్యములను నడిపించుకొని పోవుదవు. నే నొక్కతె నెంతుండినను నాకుభయమే." "నాతో నీవేలరారాదు, నీకేమితక్కువ?" "ఖడ్గ విద్య తెలియునుగా!" "స్త్రీలు వత్తురా", "ఇప్పుడు రావచ్చును" ఇవియన్నియు పరామర్శమాటలు.

తెల్లవారుకడ నిదురపోయిరి. ప్రొద్దెక్కి లేచిరి.

బద్దన్నకుఁదక్కిన సైన్యములమాట యనవసరమయ్యెను. తనది హనుమదళము. ఈ దళముమాట త్రిపురాంతకునితోఁ జెప్పనేలేదు. బుంగన్నను పిలిచి తన సైనికులనంగఱను పిలువు మనెను. ఆ మఱునాఁడు కొంచెము వెలిసెను. పాడిగానున్న గట్టినేల చూచి పదమూఁడువందల మందిని సమావేశపరచెను. రెండుభాగములుగాఁ జేసెను.

ఒక భాగమునకు బుంగన్నసేనాని మఱియొకభాగము నకుఁ దాను సేనాని. పూర్వము బుంగన్నను మందయ్య సైన్యములవద్దనుంచి, తానునంబయ్యగారితో నుండఁదలఁచెను. ఇప్పుడు మఱల తానే యనంతవర్మ చోడగంగుని సైన్యముల కెదురు పో నెంచెను. బుంగన్నతో చెప్పెను, తాను వార్త పంపినంతనే హనుమదళమును తా నెచ్చటికి చెప్పునో యచ్చటి కరికించవల యును. బాదమ్మను రక్షింపవలయును.

బద్దన్నకు నిముసమూపిరి తీసికొనుటకు వీలు లేకపోయెను. వెంటనే గోశాలకుఁబోయెను. అచ్చటి సైన్యము లిదివఱకే వేంగి పురముపోయెను. నన్నయ్యపోలేదు. బద్దన్న యెందుచేతనని యడిగెను. నన్నయ్య "నీవు సేనానివేసూ. నేను దళాధిపతినైన మాత్రమేమి! యనుకొంటిని. ఇప్పుడెవని సైన్యములోననో నేను దళపతినేల కావలయును" అనెను. "తనబదు లింకెవరినో కుదిర్చితి" ననెను. బద్దన్న "నాయన్న విషయము జాగ్రత్తగా నుండవలయును. అతఁడు నంబయ్యగారి యందనురాగి" యని చెప్పెను. నన్నయ్య—దానికేమి! వేఁగిచోళునకు కబురంపింపుము. బద్దన్న—మీరు నా దెస్ల వెళ్ళిరావలయును. నేను మఱల మందయ్యగారిని కలసికొనలేదు. వారు నా యీ

ప్రయత్నమో యుద్ధము చేసికొనిరో తెలియదు. ఎప్పుడో పదివేల శత్రువులు వాళ్ళు పంపింతుమని చెప్పిరి. విజయవాటమునకు, ధాన్యకటకమునకునడుమ నెచ్చటనో యొక మేఘములు క్రమ్మిన రాత్రి వానిని దించుకొనవలయును. అడవులలో నుండి పాపి కొండలకుఁ జేర్పవలయును. ఈ పని మీరు చేసెదరా, నన్ను చేసికొమ్మందురా? నన్నయ్య—ఏమట్లు మాటాడుచుంటివి? నేను చేసెదను నీవు నా దేంట్లకు పొమ్ము. ఉరుకులు, పరుగులతో పోవలయును. గొంకభూపతి వెంటనే కూర్మతీర్థమునకు ప్రయాణము కావలయును. నా దేంట్ల సైన్యము ధనదపురము చుట్టుపట్టుకు చేరెనో లేదో! బద్దన్న—సుందయ్యగారు ముందుకు గాడు, చంద్రగౌడున్నాడు, గంగచోడున్నాడు. వారంతయు నిదివఱకే చేసియుందురు. నేను నా దేంట్లకు పోవుచున్నాను. మీరు నా దానశాసనము తీసికొనిపోయి త్రిపురాంతకునకు చూపించి నాకు మారుగా ప్రవర్తించుడు.

## ౧౪

బద్దన్న నా దేంట్లకుఁ బోనెంచెను. ఎట్లు పోవలయును? విజయవాటాధిపతిగాఁ బోవలయునా? వట్టి బద్దన్నగాఁ బోవలయునా? తాను వట్టి పేరునకు విజయవాటాధిపతి. తక్కిన యాధిపత్యచిహ్నములు లేవు. కాని యిప్పుడు పశ్చిమచాళుక్యుల పక్షమువాఁడుగాఁ గనుపించుచుండెను. ఎన్నిదినములనుండియో యతని కోరికయునాఁడు. తా నొక్క పురాధిపతియైనచోఁ దాను సంబయ్యగారితో సమానుఁడనవౌదు ననియు, నప్పుడు సంబయ్యగారు తన్ను చులకనగాఁ జూడఁ జాలఁ డనియు, ఇప్పటా

స్థితివచ్చెను. కాని యీ స్థితి యేమిస్థితి? తనకు పరివారము లేదు. ధనము లేదు. ఒక పురాధిపతి కుండవలసిన లక్షణము లేమియు లేవు. తా నెచ్చటికైన పోవలసినచో కాలినడకనే పోవలయును. ఆందోళిక లేదు. ఆందోళికావాహకులు లేరు. ఈ యల్పభోగములకొరకు మరల పోయి త్రిపురాంతకు నాశ్రయించవలయునా? ఆశ్రయించినను, తక్కిన పురాధిపతులకు జరిగినట్లు తనకు జరుగునా? తాను కులముచేత పంచముఁడు. తనకు చాకలులు పల్లకీ మోయరు. తనకులమువారే తనకు మోయవలయును. తన కులము వారే తన వెంట రావలయును. ఇది యంతయు నాలోచించి బద్దన్న వట్టి బద్దన్నగానే నాదెండ్లకు బయలుదేరెను. కాని కాలినడక బయలుదేరినచో కాలము పట్టును. కాలము లేదు. వానలు కురిసి దేశమంతయు బురదగా నుండెను. అతఁ డానాఁడు రాత్రి కృష్ణ దాటి శతసహస్రదేశమునఁ జేరెను. రెండేరుల నడిమివిషయమున నున్న వానలు శతసహస్రవిషయమున నున్నట్లు లేవు. అతఁ డచ్చట నొక గుఱ్ఱము సంపాదించి రెండుదినములలో నాదెండ్ల చేరెను. గంగచోడుని యింటికిపోయెను. గంగచోడునితో మాటాడెను. మందయ్యగారికి పూర్వము తన యందున్న యభిమానము తగ్గినట్లు తెలిసెను. అందులో తన కాశ్చర్య మేమియు లేదు. అట్లు జరుగు నని తా ననుకొనుచున్నదే.

ఇద్దఱును కలసి మందయ్యగారివద్దకుపోయిరి. మందయ్యగారు మునుపటికన్న నెక్కువగౌరవము చేసెను. తక్కువ సౌహార్దము చూపించెను. బద్దన్న తాను మందయ్యగారిమీఁద

నున్న కోపముతో నంబయ్యగారు తనయెడ చూపించిన తిర స్కారమువలన త్రిపురాంతకు నట్లు చేసితి ననెను.

మందయ్య—మఱి యీ సంగతి చూడుము. గొంక భూపతికి వేంగి, రెండేరుల నడిమి విషయము లిప్పుడు అధికార భూములుకావు. ఆ కాకపోవుటకు కారణము నీవు. నీయందు వారి కిప్పు డెట్లు పూర్వపు గౌరవముండును? బద్దన్న—పూర్వము గౌరవమున్నచో, నిప్పుడు పోయె ననుకొనవచ్చును. అసలదియే లేదుకదా! మందయ్య—పూర్వము గౌరవమైనచో, నిప్పుడు గౌరవము లేదు. పూర్వమే గౌరవము లేనిచో, నిప్పుడాభి ముఖ్యముగూడ లేదు. బద్దన్న—నాయందాభిముఖ్యము అక్కఱ లేదు. నేను త్రిపురాంతకుని మఱల నిలునబెట్టితిని. వేంగిచోళు లను వెలనాటిచోళుల కుద్దిగా స్థాపించితిని. ఈ స్థాపించుట యొకి తప్పే, నాయందు తప్పుకాదు. దేశమునకు గల సంఘీ భావవిషయమున నిదియొక దోషముగా భాసింపవచ్చును. పూర్వము వెలనాటిచోళులు లెమ్మన్నచో దేశమంతయు నొక్కమాటమీద లేచెడిదేమో! ఇకముం దట్లు లేవదు. వెలనాటిచోళులు, వేంగిచోళులు కలసి చేసినగాని యే పనియు సాగదు. నేనిప్పుడు నీవద్దకు వట్టి బద్దన్నగా, రాలేదు. వేంగి చోళుల సర్వసేనాధిపతిగా వచ్చితిని. ఇట్లు మీవద్దకు రారాదు. నంబయ్యగారివద్దకు పోయియుండవలయును. వారికిని, నాకును మాట పొసగదు. మీరు మధ్యవర్తిగా నుండి, తెలుగుదేశ మును పశ్చిమచాళుక్యుల యధికారమునుండి తప్పించవలయు నన్న యూహ మీకుకూడ నున్నచో, దానికి ప్రయత్నము చేయవచ్చును. మందయ్య—మే మట్లు చేయనిచో? బద్దన్న—

చేయనిచో నేను వేంగి రెండేసుల విషయములను పశ్చిమ చాళుక్యుల యధికారమునుండి తప్పించెదను. తప్పించుటకు ప్రయత్నించెదను. ప్రయత్నము ఫలించవచ్చును. ఫలించక పోవచ్చును. అప్పుడు నే నొక్క పశ్చిమచాళుక్యసైన్యముతో మాత్రమే యుద్ధము చేయవలసియుండదు. వెలనాటి చోళుల సైన్యముతోఁ గూడ యుద్ధము చేయవలసి యుండును. మందయ్య—అప్పుడు నా సైన్యములతోఁ గూడ యుద్ధము చేయవలసియుండును. గంగ—స్వామీ! క్షమింపవలయును. మన సైన్యములు చేసినచో పశ్చిమచాళుక్యులతోఁ జేయును. బద్దన్నతో చేయవు. తెలిసిన విషయము మనవి చేయు చున్నాను. చంద్రగౌడుఁడు మనము బద్దన్న కెదురు తీర్చినచో మనవాఁడుకాడు.

తరువాత మందయ్యగారు కొంతసేపు మాటాడలేదు. బద్దన్న యిట్లనెను. "బాబూ! మీరుకూడ నిట్లవుదు రనుకొనలేదు. నేను నంబయ్యగారి యందలి కోపముచేత నిట్లుచేసితిని. నీవద్ద సర్వోత్కర్షగా మాట్లాడను. నాకు కులములేదు. లేనిచో నింక నింతయైన చేయుదును. నా కులమునకు సహజమైన వైరాగ్యవినయములునాయందున్నవి. లేనిచో వారిని, వారినిపట్టు కొనియిట్లు దేసను. తమరొక్కటిచూడుడు. వెలనాటిచోళులకు పారంపర్యముగానున్న దేశము కాదు కృష్ణయవతలి మేటి. ఆ దేశముమీక్రింద నుండుటకుకారణ వేంగిచోళులదౌర్బల్యము. వెలనాటి చోళుడు వేంగిచోళులను గెలువలేదు. అది గెలిచి తెచ్చిన దేశముకాదు. ఊరకే వచ్చినది. ఊరకే పోయినది. మీకు వలసినచో త్రిపురాంతకుని మీకు సామంతుని చేసె

దను. అది యిదివఱకే జేసితిని. త్రిపురాంతకుడు గొంకభూపతిని మహారాజగా నంగీకరించినాడు. అంగీకరించియే తాను వేగి రాజ్యమును స్వీకరించెను. తాను వేంగిరాజ్యమును స్వీకరించి నపుడు గొంకభూపతికి తాను తెలియజేసెను. నన్ను విజయ వాటాధిపతిగా జేసినపుడు మహారాజునకు తెలియకుండ చేయ లేదు. నేను నా సైన్యమంతయు నాయన కిచ్చినప్పు డీవింబధన తోడనే యిచ్చితిని. ఇట్లు చేయనిచో నంబయ్యగారు నా ప్రయ త్నమున కనుకూలపడునట్లు కన్పించలేదు. అందుచేత నిట్లు చేసితిని. నాకు వేరే యేమియు నక్కఱలేదు. మనదేశము పశ్చిమచాళుక్యుల క్రింద నుండరాదు. మనము కులోత్తుంగ చోడదేవుని బంటులము. వారు మనకు ప్రభువులు. వారికి మనము ప్రజలము. ఈ యుద్ధమైన తర్వాత మఱల బద్దన్న పేరు మీరు వినరు. మీరు నాకు సహాయము చేసినచో చేయుడు. లేనిచో నేను మఱల మీకడ్డమురాను" అని బద్దన్న లేచెను. బద్దన్న మొగమున నెత్తురులు క్రమ్ముచుండెను. వెనుకకు తిరిగి రెండడుగులు వేసిన బద్దన్న, మఱల మంచయ్య గారి వైపు రెండడుగులు వేసి యిట్లనెను. "నంబయ్యగారు నన్నేల తిరస్కరించిరి? అయనకున్న కులము నాకు లేదు. నాతో క్షత్రియుద్ధము చేయునా ? రాజనీతిలో నాకు దీటు వచ్చునా? నేను చేసిన పని యేపని యాయన చేయగలడు? అంత తిరస్కారమేమి? నేను బావమ్మను లేవదీసికొనివచ్చితినా? నేనామెను లేవదీసికొనిరాలేదు. అదితప్పని నాకు తెలియదు. నే ననుకొనలేదు. నా మనస్సులో దైవమున్నాడు. నాకు తెలిసిన దొక్క ప్రేమమే, ఆ ప్రేమలోకమునందు

వ్యభిచారముగా భాసించు నని నే నెఱుగను. అది తెలిసికొను టకు నా వయసు చాలలేదు. ఆ సందర్భములలో నాయనుభ వము చాలలేదు. నా కిప్పటికిని నదియొక యగమ్యగోచర ముగా నున్నది. తిప్పన్న—అనగా బాదమ్మభర్త, తన్నువలచి తాను వలచిన స్త్రీని వివాహమాడవచ్చును. ఈ ప్రేమలేని ముడికి బాదమ్మ యేల యింధనము కావలయును! ఒక్క—సంగతి చూడుడు. తమకును, నంబయ్యగారికిని చాల చెలిమికలదు. మీతో నే నీ మాటలు చెప్పరాదు ఐనను మీరు నిష్పాక్షిక ముగా నూహించగల రని చెప్పుచుంటిని. నేను జారుడనుగాను. బహుస్త్రీలంపటుడనుగాను. నేను పాపముచేసినచో ఆ పాపము దైవప్రేరితము. నంబయ్యగా రిట్టివా రేనా? నా తప్పేమి! ఈ సందర్భమున నాయన నాతో ప్రవర్తించిన ప్రవర్తన యేమి! ఆయన యూనాఁడు ప్రదర్శించిన తిరస్కారము నిజముగా ధర్మ భంగజనితమైన యథార్థకోపమా, మాత్సర్యమా! మీరే యాలోచించుడు. మీయందలి కక్క—ఱలేని దేశస్వాతంత్ర్యము నా కేపట్టలేదు. దేశము స్వతంత్రమైనచో మీ రనుభవించు దానిలో నే నేదియు ననుభవించను. నంబయ్యగారు ప్రభువు. ఆయనకు నే నెప్పుడును దాసుడనే. వ్యక్తిగతముగా వచ్చి నప్పుడు నేను తిరస్కారము నోర్చుకొనలేను. వారు నన్ను సుంత గౌరవించినచో వారికి పోవున దేమియు నుండదు. నాకు వచ్చెడి దుండును. ఇక కాలము లేదు. ఇంకను మాటలు, రాయబారములు జరుగు నెడము లేదు. తెలుఁగుదేశమున కీ దుస్థితితప్పవలయునన్నచో వెంటనే మనము నిర్ణయించుకొన్న పదకము నాచరణలో పెట్టవలయును. మఱల నెప్పుడో—

మొక్క—వరోజులు పట్టను. ముసుగుపట్టును. నేను విజయవాటమున కెగువ మనుష్యుల నుంచితిని. నన్నయ్యగారని నా స్నేహితులు. వారు బ్రాహ్మణులు. తమరు పంపించు నాయుధములను వారు పడవలమీఁద దింపుకొందురు. వేంగి చేర్చుదురు. సైన్యములన్నియు మీకొఱకు సిద్ధముగా నుండును. మీ రంగీకరించినచో నాదెండ్ల సైన్యమును పదిదినములలో వేంగి చేర్చెదను. తమరు మహారాజును కూర్మమునకును బయలుదేరదీయవలయును. తమరు అనంతవర్మచోడగంగు నెదిరించుటకు సిద్ధమై రావలయును. శ్రావణమాసాంతములోపుగా నన్నియు జరుగవలయును. సెలవు తీసికొందును" అని బద్దన్న వెడలిపోయెను. గంగచోడుఁడు వానివెంట పోలేదు. మంచయ్యగారు నివ్వెరపోయి నిలచియుండెను. అతఁడు పోయినతరువాత పది నిమిషములవఱకు వారిరువురుమాటాడలేదు. అప్పుడుమ దయ్యగారిట్లనెను. "అదియేమయ్యా! నన్ను బెదరించెనా, ఆజ్ఞాపించెనా! వినయముగా మనవిచేసెనా? నిజాని కిది యంతయు నంబయ్యగారి తప్పు. అతఁడు చెప్పినదానిలో తప్పేమున్నది? కృష్ణయవతల వెలనాటిచోళులు గెలువలేదు. త్రిపురాంతకుడు గొంకభూపతిని మహారాజు కాదనలేదు. మన సైన్యమును పదిదినములలో గోదావరి కవతలి కెట్లు చేర్చును. గంగ—నాతో చెప్పలేదు. మంద—ఇప్పుడతఁ డెచ్చటికి పోయెనందువు, గంగ—నాకు తెలియదు మాయింటికి పోవునేమో! మందయ్య—సరే, నీవు, నతఁడును కలసి మన సైన్యమును వేంగిదేశమునకు పంపించుడు. నాల్గయిదు దినములలో నాయుధము లే రాత్రి వీలుగా నున్న నా రాత్రి పంపించెద నని చెప్పెను. ఈ బద్దన్న

ఎవడో యీ, నాక్రింద నధికారము చేయుచున్నాఁడు ఈ యధికారములో నేమాత్రము నంబయ్యగారిమీఁద చేయలేకపోయె నేమి? నంబయ్యగా రెట్లును నామాట వినరు. గొంకభూపతి నామాట వినునా? ఆయన కూర్మమునకు బయలుదేరునా!

నీవు బద్దన్నతో చెప్పుము. నంబయ్యగారి యవసరము లేకుండ మహారాజువద్దకు బద్దన్నను నేనే తీసికొనిపోయెదను. వా రిద్దఱు ముఖాముఖి నేమి మాటాడుకొనెదరో! నేను త్రేపు బయలుదేరుచుంటి నని చెప్పుము. నేఁడు సోమవారము, ధనదపురములో గురువార ముదయముండవలయు నని చెప్పుము. జాము ప్రొద్దెక్కినవేళ కోటముంగలనికొఱ కెదురుచూచుచుందును. నీవు చూడుము. అచ్చట వీరపాఁడు గ్రామమున తపతివర్ణమువారివి వేయి యిండ్లున్నవి. ఆయుధము లన్నియు వారి యిండ్లలో చేర్పబడియున్నవి. మబ్బుపట్టిన యొక్కరాత్రి చూచి నీవు వానిని పడవలమీఁద బంపించవలయును.

గంగ—మన సైన్యములు పంపించునదెవరు? మంచ—మన కేమిటి? బద్దన్నయే చేర్పింతుననెగదా! గంగ—అతనిని కలిసికొని సంగతి యడుగకుండ నే నెట్లు పోవుదును! మంచ—ఆ బద్దన్న సంగతి నీకు తెలియదు. నే నంగీకరించకపోయినను, నా సైన్యము నంతను తీసికొని పోవున ట్లుండెను.

చోడగంగు గృహమున కేఁగుసరికి బద్దన్న కనిపించలేదు, మంచయ్య చెప్పినమాట బద్దన్నతో చెప్పుటకు వీలులేక పోయెను. అతఁడు కనిపించలేదని మంచయ్యగారికిని చెప్పలేదు. గంగచోడుని భార్య గంగచోడునితో చెప్పెను. బద్దన్న వచ్చెను. వెళ్ళెను, నాదెండ్లకు నాలుగుగవ్యూతుల మేఱ నున్న

యొక గ్రామమునుండి రామదండు బయలుదేరు చున్న దట. ఆ దండు రాజమహేంద్రనగరము పోవునట. ఆ దండు వెంట గంగచోడుని రమ్మని బద్దన్న చెప్పెనని. గంగచోడుడు తెలిసి కొనెను ఈ బద్దన్న యెప్పు డేదిపన్నునో తెలియదు.

మందయ్యగారు గురువార ముదయమున జాము ప్రొద్దెక్కి ధనదపురము కోటముందు గుఱ్ఱముమీఁద నెక్కి యెవరికోసమో యెదురు చూచుచున్నట్లుండెను. గనుకాపలా మనిసి మందయ్యగారు లోనికివత్తు రని యెదురుచూచు చుండెను. మందయ్యగా రెంతసేపటికి లోనికిపోవుటలేదు. అట్లు చాలసేపు నిలచిన తరువాత దూరమున నొక యాశ్వికుఁడు పోవుచున్నట్లు మందయ్యగారుచూచెను. అతఁడు బద్దన్న యని పించెను. కాని యతఁడు కోటలోనికి వచ్చుటలేదు. మందయ్య తన గుఱ్ఱముతో నతని ననుసరించెను. ఇద్దఱును కలిసికొనిరి.

మందయ్య:- 'నీకోసము జాముసేపటినుండి యెదురు చూచుచుంటిని. నీవురాలేదేమి! బద్దన్న—తమ రెదురుచూచు చుండిరని నాకేమి తెలియును? మందయ్య—గంగచోడుని చేత వార్త నంపించితినికదా! బద్దన్న—నేనాయనను కలిసికొనలేదు. మందయ్య—అట్లనా! మన మిద్దఱము కలసి మహారాజుతో మాట్లాడుదము. బద్దన్న—ప్రభువు నాకు దర్శన మిచ్చునా? మందయ్య—నాతో వచ్చుచుంటివికదా! బద్దన్న:—వచ్చి యేమి చేయుదురు? మంద—అది నీకు తెలియవలయును. రాజుతో నీ వేమి చెప్పెదవో—అనినంతనే బద్దన్న మొగములో నొక తేజ్యము కనిపించెను. అదివఱకు వేరుగానున్న బద్దన్న మొగము తేజస్సులు క్రక్కెను. కార్యాంతర మందున్నట్లు కనిపించిన

యాతని మొగము తత్కాలకార్యావేశము పొందినట్లు కని పించెను. మందయ్యతో బద్దన్న కోటలోనికి బోయెను. మహారాజ దర్శనమయ్యెను. మహారాజు ప్రక్క పశ్చిమచాళుక్య సేనాని వీరభల్లాలు డుండెను. మందయ్య నిర్వెఱపోయెను. అతని యెదుట బద్దన్న యేమిచెప్పును? వారి రహస్య ప్రసంగమున కేమి వీలున్నది? రాజుతో బద్దన్న యేకాంతముగా మాటాడ వలయునని యతని సముఖమున నెట్లు చెప్పవచ్చును? మందయ్య రాజునకు నమస్కారముచేసి కూర్చుండెను. బద్దన్న చేతులు కట్టుకొని దూరముగా నిలుచుండెను.

మందయ్యగారు మహారాజుతో నిట్లనెను. 'ప్రభూ! ఇతడు బద్దన్న; మహారాజు దర్శనము చేయుటకు వచ్చె'ననెను. వీరభల్లాలుడు బద్దన్న పేరు వినినంతనే అలికిడి తగిలిన త్రాచు పడగవిప్పినట్లు నిక్కి కూర్చుండెను. బద్దన్న వీరభల్లాలుని స్థితి యతనివంక చూడకుండ కొనకంట గుర్తుపట్టెను. బద్దన్న మహారాజునకు సాష్టాంగపడి తర్వాత భల్లాలునకుగూడ నమస్కరించెను. బద్దన్న యిట్లనెను. "ప్రభూ, నే నిప్పుడు వేంగి చోళాధిపతి త్రిపురాంతకదేవుని బంటును. వారు తమవద్దకు నన్ను బంపిరి. అందుచే తమ దర్శనమునకు వచ్చితిని. తెలుగుదేశమునకు పశ్చిమ చాళుక్యరాజు, విక్రమాంకదేవుడు చక్రవర్తి. వెలనాటి చోళాధిపతి గొంకభూపతి మహారాజు, తమ సామంతుడైన త్రిపురాంతకదేవుడు తమతో నిట్లు మనవి చేయుచున్నాడు. ప్రభూ! పది పదేనుదినములలో, కూర్మ క్షేత్రమున మహోత్సవములు జరుగుచున్నవి. ఆ యుత్సవము లకు త్రిపురాంతకదేవుడు సకుటుంబముగా పోవుచున్నాడు.

మంచయ్యగారివద్దకు, నంబయ్యగారివద్దకుగూడ రాయబారులను పంపించెను. వారినికూడ నుత్సవమునకు రమ్మని త్రిపురాంతకు డాహ్వానించుచున్నాడు. నన్ను తమవద్దకు పంపినాడు. నన్ను వారు ప్రధానసేనానిగా నియమించుటచేత నన్ను తమవద్దకుఁ బంపించుట న్యాయమని భావించిరి. మూడు నాల్గువందల ఏండ్లుగా వేంగిచోళవంశము నామమాత్రవశిష్టముగానుండెను. ఈ నాటికి పశ్చిమచాళుక్య చక్రవర్తుల దయావిశేషము వలనను, తమ యనుగ్రహబలముననను, త్రిపురాంతకదేవులు వేంగిరాజ్యమునకు రెండేరుల నడిమివిషయమునకు మఱల యథార్థముగా ప్రభువై తమకు సామంతుడయ్యెను. ఇప్పుడు తమకు కలిగిన యీ మహోదయము కూర్మోత్సవమునకు సకుటుంబముగా తరలిపోవుటచేతను, క్షేత్రస్వామికి మ్రొక్కుబడులు చెల్లించుట చేతను పూర్తి చేయనెంచిరి. ఆ యుత్సవానందము మహాప్రభువులు తమరు లేకుండ వారికి పూర్తి కాదు. అంతేకాదు. తమరు దయచేసినచో వారిని తమరు సామంతులుగా నంగీకరించినట్లుకూడ వారు భావింతురు. పశ్చిమచాళుక్యసేనానిని వీరభల్లాళునికూడ వా రాహ్వానింపు మని చెప్పిరి. వీరభల్లాలుఁడు దయచేసినచో తమరువచ్చిన నెంత సంతోషింతురో యంత సంతోషింతు మనిరి. ఈ యుత్సవమునకు రావలసిన దని, త న్ననుగ్రహింపవలయు నని చక్రవర్తులు విక్రమాంకదేవులకుకూడ వారు వార్త నంపిరి. కూర్మక్షేత్రము దాక్షిణాత్యుల మహాక్షేత్రము. పశ్చిమదేశస్థులకు నీ మహోత్సవము తెలియదు. చక్రవర్తులు దయచేసినచో త మ్మనుగ్రహించినట్లు భావింతుమని వారు తమ పురోహితుని బంపించిరి.

బయలుదేరుటకు రెండు మూడు దినములుకన్న వ్యవధిలేదు, మహాప్రభువులకు సర్వసదుపాయములు త్రిపురాంతక దేవులే చేసిరి" అని మనవి చేసెను. ఇట్లు బద్దన్న చెప్పుచుండగా నొక్కొక్కరి మొగ మొక్కొక్కరీతిగా నుండెను. ముఖభావము లనేకవిధముల మారుచుండెను. వీరభల్లాళునివంక మహారాజు, మహారాజు వంక మందయ్య, మందయ్య వంక భల్లాళుడు, భల్లాళునివంక బద్దన్న, బద్దన్నవంక మహారాజు.

మహారాజు బద్దన్నకు సెలవిచ్చెను. బద్దన్న వెడలిపోయెను. మందయ్యగారును మహారాజును ఆ రాత్రి యే కాంత మాడిరి. మహారాజునకు బద్దన్నమీద కోపలేశము మిగులలేదు.

## ౧౭

సర్వాంధ్ర దేశము కూర్మక్షేత్రాభిముఖముగా పోవుచున్నట్లుండెను. ఇది యంతయు నంబయ్యగారికి చిత్రమనిపించెను. ఈ బద్దన్న మాయలో మహారాజెట్లుపడెను. ఈ బద్దన్న యెవడు! ఇతనికి మందయ్య మహారాజదర్శన మేల చేయించెను? అందఱును కూర్మక్షేత్రమునకు పోవుచుండిరా! ఈ పథకమున కర్థమేమి! బద్దన్న తన తొల్లిటి పథకమును మానుకొనెనా! వీరభల్లాలుడుకూడ కూర్మక్షేత్రమునకు పోవుచుండెనా! అది యట్లయినచో నిందులో పశ్చిమచాళుక్యాధికారమును తొలగద్రోయు మార్గ మేమున్నది!

ఏమైనను సరే, నంబయ్యగారు కదలలేదు. తననువచ్చి యెవరు రమ్మనిరి! రమ్మనినచో మాత్రము పోవునా! ఉన్న

ట్లుండి మందయ్యయు, గొంకభూపతియు నిట్లు తిరిగిపోయిరేమి! మహాసైన్యాధిపతియైన తనతో చెప్పకుండ తన్ను సంప్రదించకుండ నీతిరుగుబాటెట్లు జరుగును? ఇంతకు నిది తిరుగుబాటు కాదేమో! త్రిపురాంతకుడు కూర్మక్షేత్రమునకు రమ్మని తనతో కబురంపించెను. తా నేలపోలేదు? ఎందుకుపోవలెను? త్రిపురాంతకు డెవరు! అసలు త్రిపురాంతకుని గొంకభూపతి యేల యంగీకరించెను! నంబయ్య యొక్కొక్కప్పుడు వీనిని గూర్చి యాలోచించును. మఱియొక్కొక్కప్పుడు తానుసుఖముగా నే యాలోచనయు లేకయే భోగము లనుభవించుచుండును.

నాదెండ్లవిషయము, శతసహస్రవిషయము, రెండేరుల నడిమివిషయము, వేంగివిషయము ఈ సర్వప్రజయు కూర్మక్షేత్రాభిముఖమై పోవుచున్నట్లుండెను. ఒకొక్కచోట నీ జనముయొక్క సందడి యేమియని యడుగగా గొంకభూపతి కూర్మక్షేత్రమునకు పోవుచుండె నందురు. మఱియొకచోట త్రిపురాంతకదేవుడు పోవుచుండె నందురు. మఱియొకచోట రామదండమందురు. ఒకచోట పసుపుగుడ్డల బావుటాలతో, భజనలతో వేలాది జనము పోవుచుండును. మఱియొకచోట జయజయధ్వానములతో వెండిబెత్తాలవారితో నేనుగుమీద మహారాజు పోవుచుండును. మఱియొకచోట మందయ్యగారి పరివారము; గుఱ్ఱముపై మందయ్యగారును నదియొక యుత్సవముగా పోవుచుండిరి. ఈ సర్వజనమును గోదావరి మహాకోలాహలముగా దాటెను. గోదావరి యవతలియొడ్డువఱకు తెలుగుదేశము నవంతవర్మ చోడగంగు ఆక్రమించుకొనెను. కూర్మక్షేత్రమునకు ప్రజ లుత్సవమువేళ వచ్చుట ప్రతిసంవత్సరమును

సహజమే. ఈ సంవత్సరము ప్రజ ముబ్బడినలుబసిగా వచ్చిన ట్లుండెను. గోదావరి దాటినతర్వాత నార్మాత్రియు మఱు నాడును గొంకభూపతి,మందయ్యగారు, త్రిపురాంతకుడు వీరును వీరివెంటవచ్చిన వారును కదలిపోలేరు. శిబిరములు వేసికొని యుండిరి. అనంతవర్మ రాజాధికారులేమి చేయుటకును వీలు లేకపోయెను. ఆ శిబిరములు క్రమముగా యాత్రికుల శిబిరము లగుటమాని, సైన్యశిబిరము లయ్యెను. త్రిపురాంతక దేవుని యిరువదిరెండువేల సైన్యములలో పదునొకండు వేల సైన్యమును, మందయ్యగారి పదునారువేల సైన్యములో పదివేల సైన్యమును, మువ్వురు రాజులయొక్క పరివారము నాల్గువేలును నిరువదియైదువేల సైన్యమయ్యెను. మూడవనాటి యుదయమున నది సైన్యమగుట మఱుగుపరచబడలేదు. గొంకభూపతి కూర్మక్షేత్రయాత్రనుమానివేసెను. ఆయనయు, త్రిపురాంతక దేవుడును మఱల గోదావరిదాటి వెనుకకుబోయిరి. మందయ్య గారు సర్వసైన్యాధిపత్యమును వహించెను.

ఈ పాతికవేల సైన్యమును నైదైదువేలుగా విభజించి యైదుదళములుగా, నైదుమూలలుగా మందయ్యగారు నడిపించిరి. అనంతవర్మచోడగంగుని సైన్యములను అనకాపల్లి వద్దగాని సమావేశము కారాదు. ఈలోపుగా నీ దేశమునంతయు నాక్రమించుకొనుచు అనకాపల్లివద్ద చోడగంగుని సైన్యముల నెదుర్కొనవలయును. ఒకదళమునకు చంద్రగౌడుడు సేనాని. అతడచ్చటనుండి సూటిగా ననకాపల్లికి పోవును. తక్కిన రెండు దళములు కుడివైపున రెండుగవ్యూతుల దూరము నుండియు, మఱిరెండెడమవైపున రెండుగవ్యూతుల దూరమునునుండియు

వచ్చుచుండును. మందయ్యగారు వేయిసైన్యముతో నైదు దళముల వెనుకతట్టున పోవుచుందురు. ఆ వెనుక రెండుగవ్యూతుల దూరమునందు హనుమదళములో సగము ఆరువందల మంది. వీరందఱును గుఱ్ఱపురౌతులు. వీరికి సేనానాయకుడు బుంగన్న. ఈ సేన నడచుచుండెను. చంద్రగౌడుని యైదువేలలో వేయి యశ్వసైన్యము. అతనికి కుడివైపుననున్న రెండు దళములలో మిగుల కుడివైపుననున్న దళమునందు ముప్పది యుద్ధగజములుండును. ఈ సైన్యము ముందునకు త్రోసికొని పోవుచుండెను. నాలుగుదినములలో ననకాపల్లి చేరెను. అనకాపల్లి కాళింగులకు, నాంధ్రదేశమునకు నొకవిధమైన యెల్లభూమి. అంతవఱకు మందయ్య సులభముగా నాక్రమించెను. అసలు కళింగుల సైన్యమును తెలుగుసైన్యము పెడత్రోసుకొని వచ్చెను. బుంగన్న సేన చిన్నచిన్న కళింగసైన్యములు కల యూళ్ళను కలగుండుపెట్టి యా సైన్యమును చెల్లాచెదరు చేసెను. ఆంధ్రసైన్యమిట్లు తనమీదికి దాడివచ్చు వార్త తెలిసి యనంతవర్మ చోడగంగుడును సైన్యములను సిద్ధముచేసెను. ఎదురు వచ్చుచున్నా డన్నవార్త తెలసెను. వెనుకకు తిరిగి పోయిన త్రిపురాంతకుడు వేంగి చేరెను. వేంగిలో మఱియు పదునొకండువేల సైన్యము లుండెను.

గోదావరి యొడ్డున శిబిరము లేర్పరచినప్పుడు వీర బల్లాలుడును, నతని నాలుగువేలసైన్యములు వచ్చుట నుండిరి. ఈ సైన్యముయొక్క కోలాహలమునుచూచి వీరభల్లాలు డాశ్చర్యపడెను. ఇది యేమి యని గొంకభూపతి నడిగెను. గొంకభూపతి 'అనంతవర్మ చోడగంగు డూ తెలుగు దేశము

నాక్రమించెను. అతని తరిమివేయుటకే ప్రయత్నము చేసితి ననెను'. పశ్చిమచాళుక్య చక్రవర్తికి తెలియకుండనే యిట్లు చేసితివా, నీకాజ్ఞ యెవరిచ్చిరని వీరభల్లాలుఁడడిగెను. అప్పుడు బద్దన్న వారి సమక్షముననే యుండెను. బద్దన్న యిట్లనెను. 'ప్రభూ! ఈ దేశము వెలనాటి చోళులది. మీరు వెలనాటిచోడు నోడించి కైవసము చేసికొనిరి. వెలనాటి చోళునకు మీరు చక్రవర్తులుగాని, ఆయన కొత్తరాజ్యము సంపాదించుటకో, చేజారిన తనక్రిందిరాజ్యమును వశపరచు కొనుటకో మీ యధికార మేమి కలదనెను. వీరభల్లాలునకు కోపమువచ్చెను భల్లాళుని నతనియంగరక్షకులు పదిమందికో మాత్రమే కలరు. బద్దన్న తన నేర్పుకొలది నాలువేల పశ్చిమ చాళుక్యసైన్యములో వేయిమందిని ధనదపురములో నుండ నిచ్చెను. కొంతమందిని విజయవాటమున, కొంతమందిని వేంగిలో నుంచెను. కొందఱిని నాదెండ్ల కంపించెను. కొందఱిని చేబ్రోలు పంపించెను. పన్నెండువందలమంది మాత్రమే వీర భల్లాలున వెంటవచ్చిరి. ఆ పన్నెండువందలమందియు నీ పాతిక వేల సైన్యములో చెదరి యచ్చటచ్చట నుండునట్లు చేసెను. ప్రతి పశ్చిమచళుక్యసైనికుని నిద్దరాంధ్ర సైనికులు కనిపెట్టు చునే యుందురు.

ఈ స్థితిలో వీరభల్లాలున కేమిచేయుటకు తోచలేదు. ఇదిగాకనతర్వాత వీరభల్లాలునివద్ద నాపదిమంది యంగరక్షకులు గూడ లేకుండపోయిరి. వారిలో బద్దన్న యదుపు నంగీకరించిన నలుగురుమాత్రమే బ్రతికియుండిరి. చేతుల కరదండములు లేని బంధితునివలె వీరబల్లాళుడు వేంగికి కొంపోబడెను. అచ్చట

కోటలో ఒకగడిలో పదినుంది యాయధపాణులచేత జాగ్ర త్తగా రక్షింపఁబడుచుండెను.

త్రిపురాంతకుడు తన పదునొకొండువేల సైన్యమును తీసికొని విజయవాటము పోయెను. వేంగిలో విజయవాటములో నున్న పశ్చిమచళుక్యసైన్య మాంధ్రు లెదురుతిరిగి రని తెలిసి కొనెను. తమకా సేనానాయకుడు లేడు. కరవాలభైరవు డదివఱకే చచ్చెను. వీరభల్లాలు డెచ్చటనుండెనో తెలియలేదు. వారెదిరించుట మానివేసిరి. వారిలో కొంద ఱాంధ్రసైన్యమున చేరిరి. మఱికొందఱు తమ దేశమునుగూర్చి పోయిరి.

గొంకభూపతియు, త్రిపురాంతకుడును ఈ సేనతో కృష్ణ దాటి ధనదపురాభిముఖముగా పోవుచు భట్టిప్రోలువద్ద దండు విడిచిరి. గొంకయ్యగారు నంబయ్యగారికి కబురంపెను. సర్వ సైన్యాధిపతి నంబయ్యవచ్చెను. వచ్చిన నంబయ్య మహారాజు నెడల ప్రసన్నుడుగా లేడు. మహారాజు నంబయ్యతో తమ సైన్యమును పిలిపించు మని చెప్పెను.

నంబయ్య—ప్రభూ! మన సైన్య మెచ్చట నున్నది? అంతఃఱను విడుదలచేసి వైదేశ్యమయినది కదా! రాజు—ఆ సైన్య మును కాదు. కొంతసైన్యము మనక్రింద నెప్పుడు నుండును. ఆ సైన్య మెంత? నంబయ్య—రెండువేలమంది. రాజు—వారినే పిలిపింపుము. నేను నాతో త్రిపురాంతకుని పదునొకండువేల సైన్యమును తెచ్చితిని. ఈ రెండువేల సైన్యమును తీసికొనిరమ్ము. ఇంక వెలనాటి చోళులు పశ్చిమచాళుక్యరాజుల కరిగాపులు కారు. రేపో, యెల్లుండియో ధనదపురమునకు పోదము. అచ్చటి కొద్దిశత్రుసైన్యమును నిర్మూలించి పశ్చిమచళుక్య

రాజు విక్రమాంకదేవుని మీద యుద్ధమును ప్రకటించు చున్నాను. నం—ప్రభూ! పన్నెండువేలమందితో విక్రమాంక దేవుని యేమి యెదిరించగలము? రాజు—ఈ సైన్యమే పదివేల మందిని గూడ నెదిరించగలదు. వీ రంతఱును దేశభక్తిపరా యణులు. మందయ్య యీ మనదేశములో పదివేల సైన్య మున్నదని చెప్పెను. నీకు తెలియదా! నంబయ్య—నాకు తెలి యదు. రాజు—సరే! నీవు సేనను నడుపుటకు సిద్ధముగానుంటివా! నంబ—ఎప్పుడును సిద్ధముగానే యున్నాను మహాప్రభూ. రాజు — ఈ త్రిపురాంతకదేవుడు నీ క్రిందిసేనానాయకుడు. మీ యిద్దఱు నా యుద్ధము గెలిచిపెట్టుడు.

మఱునాఁడునయమున పదునాల్గువేలసైన్యము సర్వా యుధసమేతులై బారులుతీర్చి భట్టిప్రోలు ఊరిబయల నిలబడి యుండిరి. వారిలో సేనానియొకడు రాజదర్శనమునకు వచ్చెను. మహారాజునకు నంబయ్యకు, త్రిపురాంతక దేవునకు, నతడు నమస్కరించి యిట్లనెను. "మహాప్రభూ! నేను పదునాల్గు వందల సేనను తీసికొనివచ్చితిని. ఇది యంతయు నంబయ్యగారి సేన. ఆ ప్రభువునకు తెలియకుండ నే నీ సేనను సమకూర్చితిని. ఇవి యంతయు శతసహస్రవిషయములోని సేవ. ఇదికాక వెలనాటి దేశములో నారువేల సైన్యమును సమకూర్చితిని. ఈ సేనను ప్రభువులు వశపరచుకొనినచో వెలనాటిసేన యంతయు ప్రోగుచేసికొని నాల్గు దినములలో ధనదపురము నకు వత్తును! ఈ యిరువదివేల సైన్యమును కాక మఱి యొసి మిదివేల సైన్యమును నాదెండ్ల విషయమునుండి నా స్నేహితు డొకడు మూడు నాల్గు దినములలో తీసికొని రాగలడు. ఇది

యిరువదివేల సైన్యమును, వేంగిసైన్యము బదునొకండువేలును పరివారము రెండువేలును ముప్పదియాఁడువేల సైన్యముతో ప్రభువులు పశ్చిమ చాళుక్యసైన్యము నోడించవచ్చును. నంబయ్యగారివంటి మహాసైన్యాధిపతి కల తమవంటి ప్రభువుల కపజయ మనుచు నుండునా"యనెను. నంబయ్య నివ్వెరపోయి చూచుచుండెను.

రాజు—నీ వెవ్వరవు? అతఁడు—నేనొక బ్రాహ్మణుడను. రాజు—నీ పేరు. అతఁడు—నన్నయ్య. రాజు—మీ దేయూరు? నన్నయ్య—గోశాల. నంబయ్య—బద్దన్నయూరా? నన్నయ్య—చిత్తము. ఆ మీ సేనకుఁడైన బద్దన్న గ్రామమే. రాజు—ఈ సైన్యమును సమకూర్పుమని మీ కెవరు చెప్పిరి? నన్నయ్య—మహారాజుల యందలి నాభక్తి నాకు చెప్పినది. నంబయ్య—నీకు బద్దన్న చెప్పెను. నీవు చేసితివి. నన్నయ్య—ఆ భక్తికిని బద్దన్నకు భేదములేదు. నన్నయ్య—ఆ బద్దన్నకు రాజభక్తి కలదా? రాజు—(త్రిపురాంతకునితో) 'ఆ బద్దన్న మనబద్దన్నయేనా? త్రిపు—చిత్తము ప్రభూ. రాజు—నంబయ్యా. ఆ మాట నిజమే. ఆ బద్దన్న యంతటి రాజభక్తి కలవాఁడే. నంబయ్య—చిత్తము. రాజు—నన్నయ్యగారూ. మీరు సేనలను సమకూర్చుట మాత్రమేనా? సేనలను నడిపించనుకూడ నేర్తురా? నన్నయ్య—ప్రభూ! మహాసైన్యాధిపతి నంబయ్యగారి యనుగ్రహ మున్నచో కొంత సైన్యమునుగూడ నడిపించగలను. బద్దన్న శిష్యులము మేము ముగ్గురమున్నాము. నేను బ్రాహ్మణుఁడను, నాగయ్య, పాపయ్యలను నిద్దరు చతుర్థకులజులు. ఆ యిద్దఱును త్రిపురాంతక దేవుని సేనలో సేనానులుగానున్నారు; మహాసైన్యాధిపతి

యున్నచో మేము పుష్కరము సైన్యములను నడిపించగలము. రాజు—మహాసైన్యాధిపతి నంబయ్యగారున్నారుకదా! నన్నయ్య—ఉన్నారు ప్రభూ! అందుకనియే నడిపించగలము. నంబయ్య—మీబద్దన్న సర్వసైన్యాధిపత్యమును వహించగలడా? నన్నయ్య—ప్రభూ. తమరుండగా నా ప్రశ్న యేల పుట్టును! నంబయ్య—అనగా నడుపగల డన్నమాట. నన్నయ్య—తమరికి కోపము రానిచో మనవి చేసెదను. మహారాజనినచో, నంబయ్యగారనినచో, మందయ్యగారనినచో, త్రిపురాంతకదేవు లనినచో, బద్దన్నకు మహాభక్తి. నే నతనికి శిష్యుడను. నే నన్నచో నతనికి భక్తి. ఈ భక్తిభావములేనిచో నతడు బ్రతుకనే బ్రతుకడు. ఈ భక్తిభావములేని బద్దన్నకు శరీరములేదు. అట్టి బద్దన్న యొక డుండినచో వాడు సర్వధాత్రికి చక్రవర్తి కాగలవాడు. అతడు పంచమ కులస్థుడు. అతనికులము మన్నులో పుట్టినది, మన్నులో పెరిగినదని యతడు చెప్పుకొనును. ఆట్టే వానిని గురించి యేమి చెప్పను!" రాజు—సరే! మీరు పోయి తక్కిన సైన్యములను నాల్గుదినములలో ధనదపురమునకు తీసికొని రావలయును. మీ యుద్ధులు స్నేహితులును, మీరును నంబయ్యగారి క్రింది సేనానాయకులుగా నుండుడు.

ఆ నాటి మధ్యాహ్నము నంబయ్యగా రాలోచించెను. బద్దన్న తప్పేమున్నది! తనజన్మభూమి కాని వేంగి శతసహస్ర విషయములలో నతడు తనకు తెలియకుండ పదునారువేల సైన్యము సమకూర్చినచో నతడెంతకు చాలడు, అతడు తన మొదల నేమి మహిమయు చూపించెను. ఈ స్థితిలో తానే మహాసైన్యాధిపతిగా నుండు నున్నచో, రాజతనినే చేయునేమో.

కాని తనకును గోంకభూపతిని చుట్టరికముకలదు. ఆ చుట్టరికమును దిగద్రావునా! ఇంతకును బద్దన్న సమకూర్చిన యీ సేనతో తాను యుద్ధముచేయునా! వీనిమీద తన సైన్యాధిపత్యమేమి! తాను సైన్యాధిపత్య మంగీకరించుట తనకు మర్యాదభంగము కాదా! ఇదులో మర్యాదాభంగమేమున్నది. తాను మహాసైన్యాధిపతి బద్దన్న యేమి, మఱియొక డేమి, తనక్రిందివాండ్రు. అది వారి విధి.

ఇది నంబయ్యకు నీచమనిపించలేదు. తనకు కావలసినది మహాసైన్యాధిపతి పదవి. అందుకు పూర్తిగా తగడందుమా! కొంతవఱకు తగును. అమర్చిపెట్టినచో ననుభవించుటకు, నధికారముచేయుటకు తగినవాడు. తనయంతట తన్ను సమకూర్చుమన్నచో నాశక్తిచాలదు. అతడు ఫల మనుభవించుటకు పుట్టినవాడు ధనవంతుడు, భోగి, అహంకారి. అధికారధూర్వహుడు. పరులశక్తి తెలిసికొనలేనివాడు, ఈర్ష్య కలవాడు. ఏతాదృశుడు నంబయ్య సైన్యాధిపత్యము నేల వదలుకొనును!

నంబయ్య స్నానముచేసెను. ఆ నాడు శనివారము శనివారము జాముసేపు జపముచేసెను. కొబ్బరికాయలు కొట్టెను. హారతి వెలిగించెను. స్తోత్రములు చదివెను. అతడు విష్ణుభక్తుడు. నంబయ్య ఇటు పాపము లెన్నిచేయునో, అటు జపములన్నిచేయును. ఈర్ష్యామాత్సర్యము లెన్నివెలయించునో, విష్ణువునకు పూజాపురస్కారము లన్ని పచరించును. భక్తిజ్ఞాన వైరాగ్యములు మూడును మూడు విధములైన మనుష్యుల వద్దనుండును. వైరాగ్య మెవ్వరికోగాని వెలయదు. భక్తిజ్ఞానములలో భక్తియనగా జ్ఞానముతోడి భక్తియని యర్థము. జ్ఞాన

ములోకూడ భక్తియున్నది. భక్తికలవారి జీవితములు వేఱు. జ్ఞానము కలవారి జీవితములు వేఱు. ఈ రెండు ప్రవృత్తులు కలిగిన వ్యక్తులయొక్క జీవితములే రెండు విధములుగా పాలింపబడును. భక్తికలవారికి భగవంతుడు కలడు అతడే యున్నాడు. మఱి యెవ్వరును లేరు అతని నమ్మిననే ముక్తి. ఇది పరమమైన సిద్ధాంతము. ఈ సిద్ధాంత మట్లుండగా నీ సిద్ధాంతమును పురస్కరించుకొని వ్యక్తుల నీత్యాది ప్రవర్తనలలో భేదములుండును. ఈ భక్తిపాలు జీవితములోని ఆ నీతిపాలున కెదురుగా సమముగా నడిపించును. భగవంతుడా భక్తికి లౌకికమైన ధనమును, సంపత్తును, సౌఖ్యమును అధికారమును సమకూర్చును. సామాన్యముగా నిట్టి భక్తిగలవారు అధికశక్తిమంతులై యుండరు. అధికశక్తిమంతునిబుద్ధి యెప్పుడును జ్ఞానమువైపునకే మఱలును. అతనికి లౌకికమైన యదృష్టము గోచరించదు. అతని తెలివితేటలన్నియు మహోత్కృష్టములై కనిపించును. లోకమున కుపకరించును. మహాకీర్తికారణములైన కావచ్చును వానికి లౌకికమైన యదృష్టముండదు. ఒకదైవమును పట్టుకొని యతని వెంటపడి వాని నారాధించుచు, వానికి మ్రొక్కుచు, వానికి ముడుపులు కట్టును సేవించువాడు ఆ దైవముయొక్క కరుణావిశేషముచేత లౌకికముగా నదృష్టవంతుడగును. బద్దన్న జ్ఞానమార్గుడు. నంబయ్య భక్తిమార్గుడు. ఆ జ్ఞానమార్గునకు పరుని యాశ్రయించ నన్న యహంకారముండును. ఒకడువచ్చి తన్నాశ్రయింపమటయు గిట్టదు. ఆశ్రయించుట, ఆశ్రయింపబడుట, ఇవి భక్తిమార్గుని నెత్తురులోని గుణములు. భక్తి

యనగా భగవంతు నాశ్రయించుట. ఎవని తా నెప్పు డాశ్ర యించెనో, యింకొకడు తన్నాశ్రయించవలయుననియు, నప్పుడే యుండును. తన్నాశ్రయించినచో నుపకారము. ఆశ్రయింప నిచో నపకారము. ఏ డొక చిన్న భగవంతుడు. భగవంతు డట్టివాడే ఆశ్రితరక్షకుడు. భక్తజనవత్సలుడు.

నాల్గవదినమున సర్వసైన్యములు ధనదపురాభిముఖ ముగా నడచెను. ఏ వాసన తగిలినదో పశ్చిమచాళుక్యసైన్యము లచ్చట లేనేలేవు. నాదేండ్ల సైన్యములు వచ్చెను వానిని గంగచోడుడు నడిపించుకొని వచ్చెను.

గొంకభూపతి మఱునాడే విక్రమాంకదేవభూపతికి రాయబారిని పంపించెను. తెలుగుదేశము తూర్పుచళుక్య చక్రవర్తులది. కులోత్తుంగచోడదేవుని కుమారుడు విక్రమ చోళుడు మాకు చక్రవర్తి. తమరు కాదు. మీ యధికారమును మే మంగీకరింపము. హోయిసాలుల రాజ్యపుటెల్లలలో మా సైన్యములను తీర్చియుంటిమి. తమ రెత్తివచ్చినచో రావచ్చును, మా దేశమునను్న సైన్యములలో చేరదలచుకున్నవారిని మేము చేర్చుకొంటిమి. తక్కినవారిని పంపించివేసితిమి. విక్రమభల్లాలుడు సుఖముగా నున్నాడు. సేనాముఖమున మీ కప్పగింపగలము. ఆతని యంగరక్షకులలో నాల్గురిని మాత్రమే మడియించక తప్పక వచ్చినది. మీ యధికారము తెలుగుదేశములలో లేదు.''

ఈ వార్త కళ్యాణికి చేరినతార్వాత విక్రమాంకదేవచక్ర వర్తి పదిదినములవఱకు జైత్రయాత్రాసన్నాహము చేయ లేదు. మంత్రులు, దండనాయకులు చక్రవర్తిని ప్రోత్సాహ పెట్టిరి. చక్రవర్తి తూష్ణీంభావ మవలంబించెను. విక్రమచోడు

డేవఁడు! తనకు దగ్గరబంధువు. తన చెల్లెలినే యతనికిచ్చెను. ఈయాంధ్రుఁడు నాచక్రవర్తిత్వ మొప్పుకొనెడు, కానిమ్మనెను.

విక్రమాంకదేవుఁడు తనవయస్సులో దిగ్విజయము చేసెను. అందఱు రాజులను గెలిచెను. ఆంధ్రుల నోడించెను. హొయిసాలుల నోడించెను. ఇప్పుడు వృద్ధుఁడయ్యెను. ఆయన కొంత వ్యాధిగ్రస్తుఁడుకూడ నయ్యెను. అందుచేత నాంధ్రుల మరల నోడించవలయునన్న పట్టుదల లేకపోయెను. ఐనను కోపము తగ్గలేదు. ఈకోపముతోపాటు గోవిందన్న లక్ష్మణార్య అను సేనానాయకులు. వీరి పట్టుదల యెక్కువయ్యెను. వీరు పూర్వము తెలుఁగుదేశముగెల్చినవారు ఏబదివేల సైన్యముతో వంద యేనుగులతో, రెండువేల గుఱ్ఱములతో నాయిద్దరు సేనానులే తెలుఁగుదేశముమీఁదికి మరల దండయాత్రకు బయలుదేరిరి. వీరు వచ్చుచున్నారని గొంకభూపతికి తెలిసెను.

నంబయ్య శత్రుసైన్యముయొక్క బలమును చారుల ద్వారా తెలిసికొనెను. ఏబదివేల సైన్యమని తెలిసికొని భయపడెను. తన యేనుగులలో సగ మనంతవర్మ చోడగంగునిపైకి పోయెను, తన యశ్వసైన్యము పూర్వమే విడుదల యయ్యెను. ఇప్పుడు తా నేమి చేయవలయును. ఏమియు తోచలేదు.

## ౧౭

నంబయ్యకు శిక్షితమైన సర్వసైన్యముండి, అశ్వగజ సైన్యములందు పర్యాప్తముగా నున్నచో తాను చదువుకొన్న యుద్ధనీతినిబట్టి వ్యూహములు పన్నగలడు, విప్పగలడు. వలసినప్పుడు పరాక్రమమును చూపింపగలడు. తలకుమించినచో దాటి

పోగలడు. ఇంతియేకాని శత్రుసైన్యము బహుళముగా నుండి శత్రువునకు గజసైన్యమునుండి తనకు లేనిచో, శత్రువున కశ్వ సైన్యమునుండి తనకు లేన్నిచో నేమి చేయవలయునో తెలియ దగినవాడు కాడు. అల్పసైన్యములో నధికసైన్యముమీాదికి సాహసము చేయజాలడు. రెండు సమాన సంఖ్యములు కాని సైన్యముల నడుమ యుద్ధమేమిటని ప్రశ్నించును. ఈ స్థితిలో పోయి మహారాజుతో నేమని చెప్పను! మనకు గజసైన్యము లే దశ్వసైన్యము లేదని చెప్పినచో రాజు నవ్వడా! తన మర్యాద యేమున్నది. ఎట్లును మఱల తెలుఁగుసైన్యము లోడి పోవునని యే నిశ్చయము చేసెను. ఉన్న సైన్యముతోడ నే యుద్ధము చేయును, తానేమి ముందునకు దూకి యుద్ధము చేయవలెనుకదా?

ఇట్లుండగా నన్నయ్య నంబయ్యగారి వద్దకు వచ్చెను.

నంబయ్య—ఏమయ్యా, పాటు పోటరీ! గోవిందయ్య, లక్ష్మణయ్యలు రెండువేల గుఱ్ఱములను వంద యేనుగులను తెచ్చుచున్నారు. నీ వెన్ని గుఱ్ఱములను ఏన్గులను తెచ్చ చున్నావు? నన్నయ్య—అవియు నివియు కలిసి యాఱువందలు. తెచ్చుచున్నాను. నంబయ్య—అవి యెన్ని. ఇవి యెన్ని! నన్నయ్య—అవి యాఱువందలు, ఇవి యాఱువందలు. నంబయ్య—అన్నియు నాఱువందలే యంటివికదా? నన్నయ్య—గుఱ్ఱముల కెదురు తీర్చినప్పు డవ్వి గుఱ్ఱములు, ఏన్గుల కెదురు తీర్చినప్పు డేన్గులు. నంబయ్య—నీమాటలు నీకర్థమగుచున్నవా? నన్నయ్య—చిత్తము ప్రభూ! బద్దన్న క్రింద నేను నట్టి దళ వాయిని. ప్రభువులు తమ క్రింద నేను సేనాని నైనాను, సుహో

ప్రభువులు దయచూచినచో సేనాపతిని కాదలచుచున్నాను. నంబయ్య - మతి త్రిపురాంతకదేవు డేమగును? నన్నయ్య- వారికి రెండువేల పరివార మున్నది. అదియొకదళము. ఆయన ఆ దళమునే నడపునట. కనుక తక్కిన సైన్యమంతయు మహా సైన్యాధిపతియధికారము లోననే యుండును. సేనానులున్నారు. వారి తమ మధ్య సేనాపతి యుండవలయునుగదా! సేనాపతి యున్నచో తమ భారము తేలికపడును. నంబయ్య - మీ బద్దన్న యేమయ్యెను? నన్నయ్య-అతనిని నేను చూచి నెల నాళ్ళయినది. నంబయ్య-ఈ యుద్ధము యుద్ధముగానే యున్నది. ఏమి యుద్ధ మిది? మీ బద్దన్న కల్పించిన వ్యూహము. ఒక దాని కొకటి పొసగదు. తెలుగుసైన్యము లెట్లు గెలుచును? వారి యేనుగులువచ్చి మనసైన్యమును మట్టించును. వారి యాశ్వికులు వచ్చి మన పదాతుల నీటెలతో దూయుదురు. మనము ముప్పదియైదు వేలమందిమి. వెనుక కాపుగా సైన్యము లేదు. వారో, కావలసినచో మరల నేబదివేలు పంపించగలరు, వివాహ వివాదములు సమానులమధ్య. ఇది యేమి యుద్ధము. నా చేత కాదు. నన్నయ్య-ప్రభూ!, నన్ను సేనాపతిని చేయుడు. నేను నడపెదనుగదా తమరు పైనుండి యాజ్ఞలిండు. నంబయ్య- నీవు మాత్ర మెట్లుయుద్ధము చేయగలవు? నంబయ్య-తమరిప్పుడు మహాసైన్యాధిపతులు. బలములు సమానముగా నున్నను లేకపోయినను సైన్యాధిపత్య మక్కఱలేదనుటకు వీలున్నదా? దో యొకటి చేయవలయునుకదా! అట్లే నాకును మీ తర్వాత యధికార మిచ్చినచో నేనును చేసెదను. చేయక తప్పదు. యత్నము చేయవలయునుగదా! తర్వాత చూతము. నంబయ్య-

సరే! సాయంతనము రమ్ము, మహారాజువద్దనుండి యాజ్ఞాపత్ర మిచ్చెదను.

ఆ మఱునాడు నన్నయ్య సేనాపతియని ప్రకటింపబడెను. నన్నయ్య వెలనాటి సైన్యము వెలనాటిసైన్యము, శతసహస్ర విషయసైన్యము శతసహస్ర విషయసైన్యము, వేంగిసైన్యము వేంగిసైన్యము, నాదెండ్లసైన్యము నాదెండ్లసైన్యముగా కలగలుపులేకుండ నుంచెను. నాదెండ్ల సర్వసైన్యమునకు గంగ చోడుడు సేనాని. శతసహస్ర విషయ సైన్యమునకు నాగయ్యను సేనాని జేసెను. నాగయ్యతో నిట్లుచెప్పెను. 'నాగయ్యా!' ఇది నంబయ్యగారి విషయపుసైన్యము. నీకు నంబయ్యగారి యందున్న యభిమానము, గౌరవము నంబయ్యగారి కెట్లు తెలిసెనో తెలియదు. తనసైన్యమున కంతకు నిన్ను సేనాని జేయుమనెను. ఆ మహావీరుని ప్రతిష్ఠ నీ చేతిలో నున్న" దనెను. నాగయ్య మిక్కిలి సంతోషించెను. "తన్నుగూర్చి నంబయ్యగారికి తెలిసెనా! తెలియనిచో సేనాని నెందుకు చేయును? పూర్వ మాయనను తాను దర్శించినప్పుడే తనయెడల చూపిన ప్రేమ గొప్పగా నుండెను." వేంగిసైన్యమునకు పాపయ్యను సేనానిని చేసెను. వెలనాటిసైన్యము మిగిలెను. దానిమీద తానే యధికారియయ్యెను. తా నధికారియని వారితోఁ జెప్ప లేదు. ఆసేనను మహారాజే నడిపించునని చెప్పెను. ఆసైన్యము యొక్క యుత్సాహమునకు మేఱలేకపోయెను.

సైన్యము హొయిసాలుల రాజ్యపుటెల్లయు తెనుఁగుల రాజ్యపు టెల్లయు, పశ్చిమచళుక్యుల రాజ్యపుటెల్లయుగలసిన సంధి ప్రదేశమునందు చేరెను, రాబోవు పశ్చిమ చళుక్య

సైన్యము కృష్ణ దాటిగాని తెలుఁగు సైన్యము నెదురించుటకు వీలులేకుండ కృష్ణ యివతలియొడ్డున నిలబెట్టెను. వేంగిసైన్యము పదునొకండు వందలు పాపయ్య యాధిపత్యముక్రింద మొగము తీర్చి యుండెను. వెలనాఁటి సైన్యము కంఠదేశము. నాదెండ్ల శతసహస్ర సైన్యముల బాహుస్థానములు. త్రిపురాంతకుని సేన కృష్ణ నెగువను దిగువను శత్రుసైన్యము దవ్వుల కృష్ణ దాట కుండ రక్షణకుగా నేర్పడెను.

సైన్యము తీర్చిన మఱునాఁడు కృష్ణ యవతలియొడ్డున పశ్చిమ చళుక్యసైన్యము కనుపించెను. గజఘీంకారములు, అశ్వహేషలు, పదాతుల యుచ్చైర్నినాదములు, దశదిశా వలయముల భేదించుచుండెను. ఆ సైన్యమంతయు నొక్కటే దళముగా నుండెను. నాల్గురకములుగా విభజింపబడిన తెలుఁగు సైన్యము. వారి కన్నలుకంటె తక్కువ సైన్యముగా కనుపించెను. వారి కెచ్చట చూచినను గుఱ్ఱము కెన్గులు కనిపించ లేదు. వారిలో దళవాయులు, దుముదారులు సేనానులు నవ్వుకొనిరి.

కృష్ణ దాటవలయును. ఆ ప్రదేశమున కృష్ణ యేబది గజములకంటె వెడల్పులేదు. రాతిదేశము. కాని కృష్ణనిండి ప్రవహించుచున్నది. ఆమె యచ్చట నతివేగవతి. ఎట్లు దాట వలయును? పూర్వము జయించితి మన్న యుత్సాహము, శత్రువులకు గజాశ్వబలము లేదన్న ధైర్యము, శత్రువులసైన్య సంఖ్య యల్ప మన్న నిరాదరణ, పశ్చిమ చళుక్యసేనానుల వివేకము తొలగద్రోచెను. రెండువేల యశ్వసైన్యములో నుత్తమాశ్వముల వేయింటిని నదిలోని కురికించిరి. ఒక్కొక్క గుఱ్ఱము వెంట వందమందిసైనికులుగా దూకిరి. వారి కెదురుగా

నిలిచియున్నది వేంగీసైన్యము. అందఱును పంచమకులస్థులు. బద్దన్న యనిన వో దేవుడనుకొనినవారు. వారిలో వేయిమందిని నన్నయ్య చీల్చి యేటిలోనికి దుమికించెను. ఏటినడుమ ఖడ్గాఖడ్గి యుద్ధము జరిగెను. నీటి వేగమునకు గుఱ్ఱము లీదుచు కొట్టుకొనిపోవుచుండెను. వానివెంట నాయూసైన్యము లీదుచు కొట్టుకొనిపోవుచు యుద్ధము చేయుచుండెను. నేలమీఁదనున్న గుఱ్ఱము మనిసిపై దూకును, నోటితో కఱచును. జలములో నున్న గుఱ్ఱమునకు దూకునోడుపు చాలదు. నీటిని పుక్కిలించి యుమియుటలో నోటితో కఱచుశక్తి చాలదు. రెండేసుల వదిమినాటి పంచమకులస్థులు నీటిలో మునిగి గుఱ్ఱముల పాదములు నఱికిరి. శత్రుసైన్యమును యథేచ్ఛముగా చెండాడిరి. గుఱ్ఱముల వెనుకకు పోదురు. అటనుండి గుఱ్ఱముల వెనుగాళ్లను, శత్రువుల వీపులను ఖండింతురు. ఈరీతిగా నైదువందల గుఱ్ఱములు మడిసెను. వేయిసైన్యము నడిచెను. వేంగీసైన్యము రెండువందలమంది మాత్రమే హతమైరి. తక్కినవారు మఱల నీదుచు వెనుకకు పోయిరి.

తర్వాత మఱల పశ్చిమచాళుక్యులు కృష్ణ దాటుటకు ప్రయత్నము చేయలేదు. నాల్గుదినము లిఱుపక్షము లట్లే యుండెను. ఐదవనాటికి కృష్ణవరదతీసెను. ఏబదిగజముల నీటి వెడల్పు ముప్పది గజములే యయ్యెను. కొంత వడి తగ్గెను. ఆ నాఁడు వేయిపడవలమీఁద పశ్చిమచళుక్యసైన్యము నదిని దాట నారంభించెను. ఆ పడవ లెచ్చటనుండి వారు తెచ్చిరో యాంధ్రులకు తెలియలేదు. నంబయ్యగారు నాల్గువేలసైన్యమును దాటుచున్న సైన్యము నభ్యంతరపెట్టుట కట్టెయుంచి, నాల్గు

వేల సైన్యము నొడ్డుననే నిలువబెట్టి తక్కిన సైన్యమును వెనుకకు మఱలించెను. మఱలించి కొంతదూరమున నిలువబెట్టెను. ఆ కృష్ణ దాటుటలో నొడ్డునకు చేరుటలో శత్రువులు పదివేల సైన్యము చెడెను. ఆంధ్రుల రెండువేల సైన్యము నశించెను. మిగిలినది పశ్చిమచళుక్యుల నలుబదివేల సైన్యము. ఆంధ్రుల ముప్పదియైదువేల సైన్యము. పశ్చిమ చళుక్యసేనాని లక్ష్మణార్య గజాశ్వసైన్యాధిపతి. ఆయన మిగిలిన పదునేనువందల యశ్వసైన్యమును ఆంధ్రసైన్యము మీదికి దూకించెను. ఆసమయములో నెచ్చటనుండి వచ్చిరో క్రొత్తగా నాల్గువందలమంది సైనికులు గుఱ్ఱములమీద నాంధ్రసైన్యమునకు తోడువచ్చిరి. సంజయ్య యాశ్చర్యపోయెను ఈ సైన్య మెక్కడిదని? ఈ వచ్చిన నాల్గువందలమంది యీ పదునేనువందల గుఱ్ఱపు దళము నడ్డగించిరి. నాల్గువందలమంది పదునేనువందలమంది నడ్డగించుటయే చిత్రముగా జరిగెను. ఎదురుగా రాక ప్రక్కగా వచ్చుట, యైదారు గుఱ్ఱములకు నడుమగా గుఱ్ఱములువచ్చుట, కనుమూసి కను తెఱచునంతలో పశ్చిమ చళుక్యాశ్వదళములో నాల్గువందల గుఱ్ఱముల ముంగాళ్లు తెగిపడిపోవుటయు, రాహుత్తులు మడియుటయు జరిగెను. ఈ యుద్ధము తరువాత నాల్గు గడియలు సాగెను. పశ్చిమ చాళుక్యుల మొగ్గతిల్లని మూడు వందల గుఱ్ఱములు వెనుకకు పాఱిపోయెను. ఆంధ్రుల నాల్గు వందల గుఱ్ఱములలో రెండువందలు చనిపోయెను. లక్ష్మణార్యు కోపముతో వందయేన్గులను మఱల తెలుగు సైన్యము మీదికి బురికొల్పెను. అసలు సైన్యమల్లే యుండెను. మఱల నెచ్చట నుండియో రెండువందలమంది పదాతులినుపగుదియుల వం

చేతులు కలవారు, దూలములవంటి ఖడ్గములు కలవారు నేను గుల కెదురు నడచిరి. యుద్ధము జాముసేపు జరిగెను అప్పటికి శత్రువులయొక్క వంద యేనుగులలో తుండము తునుగనిది, ముంగాళ్లు నరుకబడనిది, యొక్క యేనుగు లేదు. ఈ రెండు వందలమందిలో పదిమంది మిగిలి రేమో! పశ్చిమచళుక్య సైన్యము గజములతోపాటు వారిమీదికి దుమికెరి. ఆ దుమికిన వారిమీదికి గంగచోడుడు తన సైన్యములో కొంతభాగముతో పోయెను. గజయుద్ధ పిశారదులు వారిపని వారు చేయుటకు గంగచోడుడు సహాయపడెను.

తర్వాత నిరుపక్షములకు యుద్ధమయ్యెను. అశ్వగజ సైన్యములు వృథాయైన పశ్చిమచళుక్యులకు గుండెలు లేవు. వారిసేన వ్యూహము కట్టలేదు. వ్యూహము తీర్చిన తెలుఁగు సేన వారిని మూడువైపుల నుండి ముట్టడించెను. ఒకవైపున తెనుఁగుసేన విచ్చినచో, శత్రువుల యశ్వసేన సంహరించి మిగిలిన రెండువందలమంది యా విచ్చినచోట ప్రత్యక్షమగు చుండిరి. ఇది బద్దన్నసేన ఇది హనుమదళములో సగము. సగముతో బుంగన్న మందయ్యగారి వెంట నుండెను. తక్కిన సగ మారువందలతో బద్దన్న పశ్చిమచళుక్యుల గజాశ్వసైన్యముల నిర్మూలించి యాహుతిపెట్టెను.

ఆ నాఁడు సూర్యదేవు డపరగిరిశిఖరపరిలంబమానబింబు డగుచుండగా తెలుగుసైన్యము మిగిలిన పశ్చిమచళుక్య సైన్యమును కృష్ణలో దూకి, పారిపోవువారికి వెంటబడి దుమికి సంహరించుచుండిరి. పశ్చిమ చళుక్యుల యేఁబదివేల సైన్యములో నైదువేలయినను మిగులలేదు. ఆంధ్రుల ముప్పదియేడు

వేల సైన్యములో నిఱువదివేలకు పైమించి మిగిలెను. ఎక్కువ నష్టపడినది వేంగిసైన్యము. ఈ పదునొకండువేలలో నైదు వేలుమిగిలెను. శత్రువుయొక్క హెడయు కన్పించరాని మూడవ దినమున సర్వసైన్యాధిపతియైన నంబయ్యా జయించిన సైన్యమును ధనదపురాభిముఖముగా నడిపించుకొని పోవుచుండెను. నంబయ్యా ప్రక్కను నడచుచున్న నన్నయ్యతో తత్కాల సాభిమానవచనములతో "బద్దన్న కనిపించడేమి" యనెను. నన్నయ్యా 'మఱల నాకును కనుపించలే'దనెను.

నంబయ్యగారు ధనదపురమునకు చేరిననాడే మంచయ్యగారు ధనదపురము చేరిరి. యుద్ధము అనకాపల్లి వద్దకూడ నట్లే జరిగెనని చెప్పిరి. బుంగన్న అర్ధమానుమునకేము కళింగుల గజాశ్వసైన్యముల నెదుర్కొనెను. శత్రువులు పూర్తిగా చెల్లాచెదరు కావింపబడిరి. ఆంధ్రసైన్యము సాతికవేలలో పదివేలు నష్టపడెను. కళింగుల ముప్పదివేల సైన్యములో నైదువేల మంది మాత్రమే మిగిలిరి. ఈవార్త వచ్చెను.

మఱునాడు గొంకభూపతి విజయసభ చేసెను. యుద్ధమునందు మహాశౌర్యము నెఱపిన యోధులకు బహుమానము లిచ్చుటకు ప్రశంసించుటకు నా సభ యేర్పడెను. మహారాజు మంచయ్యగారికి 'కళింగమత్తేభసింహ'యని బిరుదిచ్చిరి. నంబయ్యగారి యుద్ధనీతివైశారద్యమును పొగడిరి. నన్నయ్యకు మహారాజు మణిఖచితమైన పిడికలిగిన మహాఖడ్గము నొకదానిని బహుమానము చేసెను. మఱియు ననేకమంది యోధులకు, రెండుయుద్ధములలో పరాక్రమము నెఱపినవారికి ధనము బిరుదములు నొసంగెను. సభ యంతయు జయజయానినాదములతో

నిండెను. చివరకు నన్నయ్య లేచి యిట్లనెను. 'మహాప్రభూ! మనమని యింతటితో తీరలేదు మనము మఱల సైన్యములను కూర్చి పశ్చిమచళుక్యరాజుల దండయాత్రకు సిద్ధముగా నుండవలయును. విక్రమాంకదేశచక్రవర్తి సాహసజేత. ఆయన మనచే నిట్లోడింపబడి యూరకుండు నని తలంచరాదు. మఱల నీ యున్నసైన్యముతోపాటు మఱియు నిరువదివేల సైన్యము సమకూర్చుటకు ప్రయత్నము చేయవలయును ఈ నిలువ యున్న సైన్యమును విడుదల పెట్టరాదు. అని మనవి చేసెను. మహారాజంగీకరించి నన్నయ్యను, పాపయ, నాగయ్యలను నంబయ్యగారిని, చంద్రగౌడుని గంగచోడుని, మీ రీ విషయమున నప్రమత్తులై యుండవలయు నని శ్రద్ధ యేమాత్రము సడలరాదని యాజ్ఞాపించెను.

ఆ సమయమున చేతులు కట్టబడి తల వాల్చుకొని యున్న యొకపురుషుడు మహారాజు నెదుటకు కొని రాబడెను. అతని చూచుచునే మహారా జతనిశృంఖలములు వదలింపించి యతనిని తనవద్ద కూర్చుండబెట్టుకొని యిట్లనెను. 'వీరభల్లాళా! అదృష్టములు తారుమారగును. నీ విరువదిరోజుల క్రిందటి వఱకు నాపై యధికారివి. నేడు నా దయాపాత్రుడవై నావు. మేము నీ పశ్చిమచళుక్యసైన్యము నోడించితిమి. మీ యధికారమును మా నేలనుండి తొలగించితిమి. మఱల మీరు ముమ్మాఱు గెలుతు రేమో చెప్పలేము! మేమింతటితో తృప్తిపడి యూరకుండుటలేదు. మా సైన్యములో సగముకూడ నష్టము కాలేదు. మఱల నింతకుమిబ్బడి సైన్యము సమకూర్చుచున్నాను, నాల్గువేల గుఱ్ఱములను గొలుదిసములలో తెప్పిం

తును. నాల్గువందల యేనుగులను కోరుచున్నాను. ఈ సారి మీయేన్గులకు గుఱ్ఱములకు మనుష్యులను బలియీయను. నిన్ను నేను వదలిపెట్టుచున్నాను. నీవు పొమ్మని పదినుండి రాజభటుల నిచ్చి తెలుంగుదేశపుటెల్లలను దాటించి రమ్మని పంపించెను.

ఇంత విజయసభ జరిగినను బద్దన్న బుంగన్నల సంగతి సభలో ప్రస్తావించబడలేదు. వారిసంగతి జ్ఞాపకముండియు నిద్దరు ప్రస్తావించలేదు. ఆ యిద్దరును త్రిపురాంతక దేవుడును, నన్నయ్యయు మంచయ్యగారికి జ్ఞాపక ముండెనుగాని బద్దన్న చేసిన సాహాయ్యము స్వంతముగా పొందినవాడు నంబయ్యగారు, నంబయ్యగారికే తెలియవలయును. తాను చెప్పుట న్యాయము కాదని యూరకుండెను.

తరువాత నాల్గు దినములు మహారాజు చోళరాజధానికి బయలుదేరెను. నంబయ్యయు మందయ్యయు మహారాజు వెంట బయలుదేరిరి. కొంతమంది సేనలతో రత్నములతో మణులతో ఖడ్గములతో కానుకలతో మహారాజు చక్రవర్తి దర్శనమునకు ప్రయాణమైరి. పదునేను దినములైన తర్వాత వీరందరు చోళ రాజధాని చేరిరి. చక్రవర్తిని దర్శించిరి. చక్రవర్తి వీరిని తగు మర్యాదతో స్వీకరించెను.

గొంకభూపతి త్రిపురాంతక దేవుని రమ్మనలేదు. త్రిపురాంతక దేవుడు వారి వెంటపోలేదు. చక్రవర్తి కందరును పునః పునః ప్రణామములు చేసి యెదురుగా నిలువబడిరి. అప్పుడు గొంకభూపతి యిట్లనెను. "రాజపరమేశ్వరా! రాజమార్తాండా! అన్యంకభీమా! పరగండభైరవా! సత్యాశ్రయ కులశేఖరా!

నీ కిదే జోహారులు. వెలనాంటి చోడుడు గొంకభూపతి నీ ప్రభుని సామంతుడు, నిన్ను సేవించుటకు వచ్చినాడు. ఎనిమిదేండ్ల క్రింద పశ్చిమ చాళుక్యులు నీ చక్రవర్తిత్వమైన నా భూమిలో ప్రవేశించి తెలుగు సైన్యము నోడించి దేశమును స్వాధీనపరచుకొనిరి. ఈ యెనిమిదేండ్లుగా ఆంధ్ర రాజ్యలక్ష్మి నీ వియోగముచే పరితప్తయై కృశీభూతయైనది. మహాప్రభూ, ఇన్నాళ్ళకు నీ సామ్రాజ్యలక్ష్మియైన యాంధ్రదేశము మఱల మేము గెలువగలిగితిమి; ఒక్కయేడాదిగా ఆంధ్రదేశములోని ప్రబలు ఈ పారతంత్ర్య భారముచే నట్టుడికినట్లుడికినారు. వారి దుఃఖమునకు మేరలేకపోయెను. ఈ యస్వాతంత్ర్యజీవితము కడముట్టించుటకు వారుచేసిన ప్రయత్నము భగీరథ ప్రయత్నము. ఊరూర రహస్య సైన్యములను సమకూర్చిరి. పశ్చిమ చళుక్యాధికారులకు మీరహస్యము తెలియకుండ వేయికన్నులతో కాచిరి. ఇంతటి సమర సన్నాహము హరికథలుగా రామభజనలుగా కప్పిపుచ్చిరి. రామదండు పోవుచున్నదని మిషపెట్టి సైన్యమును నడిపిరి. తీర్థయాత్రలకు పోవుచున్నట్లు కనిపింపచేసి సైన్యములను నడిపించిరి. ఇంతమహాప్రయత్నము చేసి శత్రువుల నెదిరించిరి. శత్రువులకు నేనుగులున్నవి, మాకులేవు. శత్రువుల కశ్వసైన్యము లున్నవి, మాకు లేవు. పూర్వము మాకున్న యశ్వగజసైన్యములను చాళుక్యులాడచికొనిరి. ప్రభూ! ఆంధ్రభటులే గజసైన్యముతో యుద్ధము చేయునప్పుడు మత్తగజములైరి. గుఱ్ఱములతో యుద్ధము చేయునప్పుడు గుఱ్ఱములైరి. చివరకు జయము ప్రాప్తించెను. స్వాతంత్ర్యలక్ష్మి మఱల మమ్ము వరించినది. నీ గొప్పదనము నీదా దాసు

లము. మీ తండ్రులు, మీ తాతలు, మీ తాత తండ్రులు. మీ తాత తాతలు నా యాంధ్రచక్రవర్తులు. మేము మీ బంటులము. ఇదిగో పశ్చిమచాళుక్యులనుండి మరల తీసికొన్న యాంధ్రస్వాతంత్ర్యలక్ష్మి నీ పాదములయందర్పించు చున్నాను, అని గొంకభూపతి తనఖడ్గము కులోత్తుంగ చోడదేవుని కుమారుడైన విక్రమచోళుని పాదతలమునందుంచెను. నంబయ్య మందయ్య లిద్దరును తమ కత్తులను చక్రవర్తి పాదసీమయందుంచిరి. తరువాత మోకరించి శిరసుల నేలమోపి ప్రణామములు చేసిరి. చక్రవర్తి మువ్వురిని లెమ్మని యనుజ్ఞ నిచ్చెను. గొంకభూపతిని చేపట్టుకొని లేవదీసెను. తన సింహాసనముపై కూర్చుండ బెట్టుకొనెను. ఇట్లనెను, "గొంకయ్యా, పేరునకు మేము చక్రవర్తులము. నీవు సామంతుడవు. నిజానకు నీవు పరమాప్తుడవు. నీవు నాకు భ్రాతృసమానీయుడవు. నాతండ్రి గారైన కులోత్తుంగ చోడదేవ చక్రవర్తి నిన్ను పుత్రనిర్విశేషముగ ప్రేమించెను. నిన్ను తన యంకతలమునందు నెలకొల్పెను. నిన్ను దత్తపుత్రునిగా స్వీకరించెను. ఆయనకు నేను ఔరసుడను. నీవు దత్తుడవు. నాకంటె నీవే పెద్దవాడవు. ఆంధ్రదేశమంతయు నీకిచ్చెను, చోళరాజ్యము నాకిచ్చెను. నీవు నన్ను చక్రవర్తిగా నంగీకరించుట నీదైన భ్రాతృప్రేమ రెండు రాజ్యములు కలిసియుండుట రాజ్యమునకు బలమను హేతువుతో నీవు సామంతుడుగా నంగీకరించు చున్నాను. జ్యేష్ఠ భ్రాతగా గౌరవించు చున్నాను" అని గొంకభూపతియొక్క ఖడ్గము మరల గొంకభూపతి కిచ్చెను. నంబయ్యయు మందయ్యయు తమ ఖడ్గములు తాము తీసికొనిరి.

అప్పుడు నంబయ్య యిట్లనెను. 'రాజపరమేశ్వరా! వేంగిచోడుడు త్రిపురాంతక దేవుడు వేంగి రెండేసుల నడిమి విషయములను తా నాక్రమించుకొనెను. అది యంతయు గొంకభూపతిది.

గొంకయ్య—అత డాక్రమించుకొనలేదు. నాకు సామంతుడుగా నుండెను. న్యాయముగా నది యతనిది. నా దేశమునకు శతసహస్ర విషయమెట్లో, మందయ్యకు నా దెండ్ల విషయమెట్లో, త్రిపురాంతునకు నా రెండునాడులునట్లు. చక్రవర్తికి నంబయ్య మందయ్య లెట్టిసామంతులో త్రిపురాంతక దేవుడు నట్టి సామంతుడు" మఱల నంబయ్య మాటాడలేదు. అతని మొగమున కందిరీగలు కుట్టెను.

## ౧౨

తరువాత పదినెలలకు బద్దన్న తన యింటియందు కూర్చుండి యుండెను. ఈలోపుగా బద్దన్నతండ్రి చనిపోయెను. అతడే గృహమునకు సర్వాధికారి యయ్యెను. ఆ యింటిలో బాదమ్మయు తాను నిద్దరే నివసించుచుండిరి. మఱి సౌఖ్యమున కంతరాయము లేకుండెను. ఒకరినొకరవిసి మొక్క, తముల పాకు తీవలవలె పెనవేసికొని పోవుచుండిరి.

బద్దన్న యుద్ధమునుండి సరాసరి యింటికివచ్చెను. తన సకోము మహారాజు కబురంపించునని యెదురు చూచెను. నంబయ్యగారు తనయందు కృతజ్ఞుడగునని తనయెడలనున్న వైషమ్యభావము తగ్గించుకొనునని తనకు వార్త నంపించునని యెదురు చూచెను. మఱల త్రిపురాంతకదేవుడైనను తనకు

వార్త నంపించునేమో యనుకొనెను. నన్నయ్యామైనను మహా రాజసభలో తన పేరు చెప్పుననుకొనెను. అతఁ డనుకొనిన దేమియు జరుగలేదు. సర్వజగత్తుమీఁదనతని కొక నిరాదరణ కలిగెను. ఈనిరాదరణతో మ్ముప్పొద్దులు బాదమ్మతోనే యుండు చుండెను. బాదమ్మ యతనికి మహారాజమ్యైను. బాదమ్మతో నను 'నేను నిన్ను సేవించెదను. నీవలన నా కెక్కుడ సుఖము సమకూడును.'

అతఁడు ప్రతిదినము తనకోస మెవరో వత్తురని యెదురు చూచును. ఎవ్వరునురారు. మనిసిమొగములో నేదో యొక దైన్య మేర్పడును. బాదమ్మ యతనిని కౌగిలించుకొనును. మొగము నొడిలోపెట్టుకొని యోదార్చును. నీవింకేటి పనియు నెవరో నీకు ప్రత్యుపకారము చేయుదురని చేయలేదు కదా. దేశభక్తికొలంది చేసితివి. దేశమునకు మజల స్వాతంత్ర్యము తెచ్చుటకు చేసితివి. అప్పుడు నీకు ప్రతిఫలవాంఛ లేదు. ఇప్పు డెందుకనును. బద్దన్న 'ప్రతిఫలవాంఛకోసము కాదు. నేనింత చేసితిని. ఈజగత్తునకు నాయందు కృతజ్ఞత యేల లేదా యని విచారించుచున్నాను.

బాదమ్మ—ఇది యచ్చముగా వారియందు కృతజ్ఞతా భావము లేకపోయెనని దిగులా! నీవేదో వాంఛించి యావాంఛా పూర్తికాలేదన్న జిజ్ఞాసయా! బద్దన్న—ఆజిజ్ఞాస లేకపోలేదు. ఆవాంఛ పూర్వములేదు. నే నీ కార్యము చేసినప్పు డావాంఛ లేదు. ఈకార్యము ఫలించిన కొలది నా వాంఛ తలచూపెను. ఆ వాంఛకు ఫలము సహజముగా ప్రాప్తించు ననుకొంటిని. అట్లు జరుగలేదు. అది మనస్సు కొక్క విషాద మయ్యెను.

బాదమ్మ—ఇప్పుడు కలిగిన యీ విషాదముచేత నావాంఛ కొకకాలుష్య మేర్పడుచున్నది. ఆ వాంఛ తలచూపనేరాదు. తలచూపినచో బుద్ధిచేత నంత పరామర్శింప బడరాదు. దాని యందొక నైష్ఫల్యభావము గోచరించి, యది పలువిధము లైన వికారములకు చోటిచ్చునట్లు చేయుట బుద్ధిపూర్వకముగా చేసినట్లగును. బద్దన్న-నీ వింతటి బుద్ధిశాలినివి; తిప్పన్నతో సంసార మెందుకు చేయుదువు! బాదమ్మ-తెలివితేటలు కలిగి యుండుట యొక చెడ్డగుణము. ఎప్పుడును, ఆ తెలివితేట లుపయోగించుటకు వీలైన పరిస్థితికోసమే మనస్సెదురుచూచు చుండును. ఒక తెలివిగలిగిన స్త్రీ తెలివిలేని పురుషునితో, తెలివిగలిగిన పురుషుడు తెలివిలేని స్త్రీతో కలిసియుండలేరు. ప్రవాహము పల్లపు నేలమీదికి పోవునచో సర్దుగా పోవును. వట్టి రాయివంటిది. ఒక యెత్తైన ప్రదేశము, ఒక కొండ తగిలినచో గుడుసుళ్లుపడును. మెత్తగా కదలుచున్న యీద్రవ్య మునకు గట్టిగా కదలని ఆ ద్రవ్యమునకును పొత్తు కుదురదు. అప్పు డా ప్రవాహ మెగిరి గంతులువేయును. నురుసులుకట్టును. ధ్వనిచేయును. ఆ ప్రవాహము యొక్క తప్పేమి! ఇట్టి రెండు ప్రవాహము లొకదాని కొకటి యెదురు వచ్చినను నానిలో నవి గ్రుచ్చి యెత్తుకొనును. మెత్తని పదార్థములకు, మెత్తనిపదార్థ ములకు గల పరస్పరసన్నికర్ష మట్టిది. అవి యొకదానిని కొకటి యొదుగును. ఒక దానిలో నొకటి చొచ్చును. రెండును కలసి పోవును. మిక్కిలి యూహగల రెండు ప్రకృతుల సమాగమ మట్టిది. బద్దన్న—వీ ప్రకృతి యంత మెత్తది కావచ్చును. నా ప్రకృతి కాదు. బాదమ్మ—నీ ప్రకృతియు మెత్తనిదే. ఒక ప్రకృ

తిలో మెత్తదనము సహజముగా నుండును. మఱియొక ప్రకృతిలో మెత్తదనము పరిస్థితులచేత నేర్పడును. బద్దన్న—అట్టి పరిస్థితు లేర్పడినచో తిప్పన్నలోగూడ నీ మెత్తదన మేర్పడెడిదేమో. బాదమ్మ—తిప్పన్న ప్రకృతివంటి ప్రకృతి యెప్పుడును మెత్తదనము తెచ్చుకోదు. ఆప్రకృతి ధనసంపాదన ముఖ్యమైనది. అందుచే మెత్తదనమురాదు. బద్దన్న—ధనసంపాదన యెవనికి ముఖ్యమైనది. కాదు, బాదమ్మ—అంతకే ముఖ్యమైనది కాదు. ధనాభిలాష యుండవచ్చును. ఈయభిలాష సర్వేతరములైన మృదుభావములను కప్పివేయునంతటి తీక్ష్ణదశలో నున్నప్పుడు ఆ బుద్ధికి మెత్తదనముపట్టదు ఊహ యెప్పుడు నూహయే. మన మితర విషయములగూర్చి యంతలోతుగా నెంతవాడిగా నూహింతుమో, ధనార్థి, ధనమునుగూర్చి యంత లోతుగా అంతవాడిగా నూహించును. ఊహాశక్తి యచ్చటను అంత నిశితముగా నున్నను వస్త్వాశ్రయమును బట్టి యా యూహకు మెత్తదన మలవిచుకోదు. బద్దన్న—నాయందు నీకు నట్టి యూహామృదుత్వ మేమి కనిపించెను. బాదమ్మ—ఊహ సహజముగా బాల్యమున మృదువై యుండును. ఆ యూహలోని మృదుత్వము బాల్యసంబంధి. అది నిజమైన మృదుత్వ మనుటకురాదు. కాని నీలో బాల్యమునందే బాల్యమృదుత్వమునకు సంబంధించని యూహామృదుత్వ మేర్పడినది. ఇచ్చట మృదుత్వ మనగా నిశితత్వమని యర్థము. నీవు యుద్ధమును గూర్చి రాజనీతిని గూర్చి సైన్యములు సమకూర్చుటగూర్చి మఱి తత్సంబంధములైన సర్వ విషయములగూర్చి బాల్యమునందే వృద్ధు డూహించిన ట్లూహింతువు. మన కులములో

నావంటి స్త్రీ యుండదు. నీవంటి పురుషుడుండడు. ఒక విషయములో నీబుద్ధి నిశితమైనది. ఏ విషయమునకు సంబంధించకుండ అసలువిషయ మేమైనది. బద్దన్న—నన్నయ్యగా రూరిలో లేరు, ఆయన వచ్చినచో బాగుగానుండును. ఆయన పరిషత్తులో ప్రధానుడు. నాకు స్నేహితుడు ఆయన యున్నచో పరిషత్తు మనలను శిక్షించకుండ చేయగలడు. బాదమ్మ—ఆయన యిప్పుడిప్పటనుండి వచ్చును. వచ్చినను లాభము లేదనుకొందును, మహారాజుతో నీసంగతి చెప్పలేదు. పదినెలలు దాటెను. తనకు రాజాదరము కలిగినది. ఆ యాదరబాలాతపమునందే చలికాచు కొనుచుండెను. బద్దన్న—అతడేమి చేయుగలడు! అక్కడ నంబయ్యగారున్నారు. ఆయన నెదిరించి మాటాడునా! కొండ నాలుకకు మందు వేసినచో, నున్న నాలుకకూడ నూడి పోవచ్చును. బాదమ్మ—నీ కొకసారి స్నేహితు డైనచో నతని మీద నీగ వ్రాలనియ్యవు. బద్దన్న—నీమీద మాత్రము వ్రాల నిత్తునా. బాదమ్మ—పోతుటీగనా, పెంటినా? బద్దన్న—నీవు నాగరకురాలవు. మీ మతమునకు సంబంధించిన సర్వవిషయములు జంగాలవద్ద నేర్చుకొంటివి. శైవమతములోని సర్వ రహస్యములు నీకు తెలియును, అంతనాగరకురాలవు. బాదమ్మ—కామము శరీరధర్మము. లేనిచో నిన్నుబడి వచ్చుట యెందులకు? బద్దన్న—మనస్సుయొక్క చురుకుదనమునకు వినియోగము కలుగుటకు. బాదమ్మ—సరే కాని యింతవఱకు మఱి పశ్చిమచాళుక్యులు దండెత్తిరాలేదు. మహారాజు ప్రాతసైన్యములను విడుదల చేయునని వదంతిగానున్నది. అయినచో నిర్ణయించిన క్రొత్తసైనికులను ప్రోవుకమ్మని చెప్పనే

చెప్పరేమో! ఈ యుద్ధపుటొజడి యెక్కువగా నున్నది. మన విషయము లోకమున కంతగా పట్టుటలేదు. ఎచ్చటనో యూహలుగాని, పరిషత్తులుగాని పనిచేయుటలేదు. మఱల దేశమునందు శాంతి సమకూరినచో పరిషత్తులు ప్రారంభింతురు. మనసంగతి యప్పుడు విచారణకు వచ్చును. బద్దన్న—ఈ యూరి నుండి లేచిపోవుదమా? బాదమ్మ—అక్కడ నూరుండదా? బద్దన్న—విజయవాటమునకు పోవుదము. అది నాయూరు. నేనా పురాధిపతిని. ఇద్దఱు నాలోచింప నారంభించిరి.

## ౧౮

బద్దన్న విజయవాటమునకు పోయెను. పోయినవాని కేమి చేయవలయునో తెలియలేదు. ఒక పురాధిపతియనగా నేమి? ఆ పురముమీఁది సుంకములు తాను చెల్లించుకొనవలయును. తా నింటింటికి పోయి యడుగునా? ఆ పురములోనికి వచ్చునట్టి పోవునట్టి సంబారములమీఁద సుంకములు తనకు రావలయును. అవి యెట్లువచ్చును? ఇతడు పురాధిపతి యని యెవ్వ రెఱుగును. ఎఱుగ కేమి? అందఱు నెఱుగుదురు. ఆ యూరిమీఁది సుంకము లెంతవరకు చెల్లుబడియగును; తన కేమియు తెలియదు. ఇతర పురాధిపతు లెట్లు చెల్లించుకొందురు. వారికి వేఱే యధికారు లుందురు. తన కధికారు లేరే! ఏమి చేయవలయునో బద్దన్నకు తెలియలేదు.

ఒక్కొక్కని బుద్ధి యొక్కొక్కని విషయములో శరపరంపరగా ప్రవహించును. మఱియొక విషయములో మందకొడిగానుండును. యుద్ధము, వ్యూహములు, సైనికులను

శిక్షించుట మొదలైన విషయములలో మహారాజులు, మహా సేనానులు నూహించలేనంత తీవ్రముగా నూహించగల బద్దన్నకు తను విజయవాటపురాధిపతి యగుట యెట్లో తెలియలేదు. అతఁడు సుంకములు చెల్లుబడి జేసికొనుట యెట్లో తెలియలేదు. అతడు మఱల గోశాల వచ్చెను.

బాదమ్మ—పోవుదమ ? బద్దన్న—ఎచ్చటకు? బాదమ్మ—ఎచ్చటికేమిటి, విజయవాటమునకు. అచ్చటికిపోయి యేమిచేసి వచ్చితివి? ఆ యూరివారితో నింక సుంకములు నీకు చెల్ల వలయు నని చెప్పలేదా? బద్దన్న—ఆ యూరినివాసు లెవరు? నే నెవ్వరితో చెప్పుదును? ఎవ్వరును నావంక చూచినవారు లేరు. క్షత్రవిద్య యెఱిఁగిన కొలదిమంది మాత్రము నావంక మిట్టి మిట్టి చూచిరి. నేను పోవుచుండగా కొంతవఱకు వెనుతిరిగికూడ చూచిరి. వారిని పిలిచి యీయూరు నాది, సుంకములు నాకు చెల్లింపవలయును అని చెప్పుదునా? చెప్పినచో వారు నవ్వరా? అప్పటికి నొకని పిలచి మీరేయూ రని యడిగితిని. అతడు తనది నంద్యాల యని చెప్పెను. అచట నన్నతడు చూచినాడట. చూచినట్లున్న దని మఱల నావంక చూచినాడు. బాదమ్మ—అట్లు కాదయ్యా! నగరపరిషత్తుం డును. పరిషదధ్యక్షునివద్దకు పోయి యీ సంగతి చెప్పినచో నాయన చేసిపెట్టును. బద్దన్న—పరిషదధ్యక్షులు ధర్మాధి కారులు. వారికి, సుంకముల చెల్లుబడికి నేమియు సంబంధము లేదు. దీనికి వేఱే రాజాధికారు లుందురు. నా క్రిందియధి కారులు లేరు. బాదమ్మ—అట్లయినచో మనము పోయి విజయ వాటములో నుండవలయును. అచట కొంతమంది యుద్యో

గస్థుల పెట్టుకొన వలయును. బద్దన్న అది చేయుటకు మొదలు మన దగ్గర కొంత ధన ముండవలయును. బాదమ్మ—త్రిపురాంతకుని పోయి యడిగి తేరాదా? బద్దన్న—నేను పోయి యాయన నడుగను. ఆయన చేయదగిన యుపకారము చేసెను. దీని కాయన నడుగుదునా? స్వామిగారు పిల్లనిచ్చినచో పిల్లను తన్ను పోషించుటకు డబ్బుసయితి మిమ్మని యడిగినట్లు. దున్నుకొనుటకు పొలమిచ్చినచో ఎడ్లు, బండి, నాగలికూడ కొనిపెట్టు మన్నట్లు. బాదమ్మ— ఎడ్లు, బండి, నాగలి కొనలేని వాడు పొలమడుగుట యెందులకు? బద్దన్న—నే నొక పురాధిపతి నైనచో నంబయ్యగారి కంటికి నే నాగుదునని యిట్లుచేసితిని. ఈ తికమకలు నాకు తెలియవు. బాదమ్మ—ఐనచో నిచటనే యుందము. పరిషత్తు లేనిచేయునో చేయును, శిక్షించినచో ననుభవింతము.

ఎందుకో తెలియకుండ వారిద్ద రొకరొకరితో మాటాడుట మంద గించెను. వా రొకరినొక రనుకొన్నది లేదు. ఒకరు చేసినదాని నొకరు నిందించినది లేదు. ఆ పగలెల్ల నట్లు గడచెను. రాత్రికి బద్దన్న యిట్లనెను. "నావలన నీవు బాధపడుచున్నావు. నా కారణమున నీకు నలుగురిలో నిల్చుటకు వీలులేకుండ నున్నది. నేను నిన్ను నీ భర్తనుండి విడదీసి నీ కాశ్రయము లేకుండ చేసితిని. నీవు నన్ను క్షమింపుము."

బాదమ్మ—ఈ మాటలచేత నిజముగా నీవు నన్ను నిందించుచున్నావు. నలుగురికి కాకుండ జేసినచో, నేను నిన్ను చేసితివిగాని నీవు నన్ను చేయలేదు. నేను నీ యింటికి వచ్చితిని గాని, నీవు నన్ను రమ్మనలేదు. బద్దన్న—నీ వెంత కాదన్నను

నాతప్పు నాకు తెలియును. నేను జ్వరబాధితుడై యున్నప్పుడు నీతో నన్న యొకమాట యింతకు కారణమైనది. అన్నాళ్ళు నా మనస్సులో నే మున్నదో నీకు తెలియదు. అదివఱకు నీవంక నేను చూచిన చూపులు, నీతో మాటాడిన మాటలు యౌవనము రూపుకట్టని, నీవు నిజముగా లక్ష్యముకాని, యిత మిత్థయని నిర్ణయింపబడని, ఒక స్త్రీ భావమునందు, యౌవనో దయలక్షణముయొక్క నడకగా నుండెను. దానికి నీవు లక్ష్య మనిలేదు. ఆ మాటతో ని న్నేరికోరిన ట్లయినది. అదివఱకు నాకు ధైర్యముచాలదు. ఆ కరవాలభైరవుని సంహరించినంతనే నాలోని పురుషత్వము ఒక వ్యక్తిత్వమును తాల్చినట్లయినది. ఆ మాటయొక్క దోషముచేత నీవు నావద్దకు వచ్చితివి. ఈ పరిషత్తులు, ఈ అనిశ్చితమైన బ్రతుకు నావలన నీ వనుభవించు చుంటివి. బాదమ్మ— నీ వనకపోయినచో నే ననెడిదానను. బద్దన్న—నా మనస్సు కష్టపడునని యనకుము. అదుది యెప్పు డును నోటితో ననదు. అందుకనయే సర్వమైన, యధర్మమైన స్త్రీ పురుషసంగమమునందు పురుషు డధిక శిక్షార్హుం డగు చున్నాడు. ఆదోషమునకు వీడుకర్త. బాదమ్మ—ఆ దోషము నకు పురుషుని కర్తగాచేయుట స్త్రీ పురుషులయొక్క యీా ప్రవర్తననుబట్టికాదు. దానికి వేఱె కారణమున్నది. ఇందులో పురుషు డెంతదోషియో స్త్రీయు నంతదోషవతి. ఒక్కొక్కపుడు పురుషునికన్న స్త్రీయందే యధికదోష ముండును, స్త్రీ లజ్జా వతి. ఆమె ముందు పలుకరించ దంసురు. స్త్రీ ప్రేమ కలిగి నప్పుడే లజ్జావతి. ప్రేమలేనప్పు డామె లజ్జావతికాదు. ఆమె దుర్జనురాలు. ప్రేమలేనిచో పురుషుడు సజ్జనుడు. ప్రేమ

యున్నప్పుడును సజ్జనుడే. ఈ సజ్జనత్వము స్త్రీయందు లేదు. స్త్రీ ప్రేమలేనిచో దుర్జనురాలు. ఉన్నచో లజ్జావతి. పురుషుడు ప్రోత్సాహకుడుగా కనిపించును. ఆ ప్రోత్సాహమును, ప్రోత్సహించినది యనురాగసూచియైన యా స్త్రీయొక్క లజ్జాభావము. బద్దన్న—అట్లేయందము. పురుషు డధికముగా శిక్షింపబడుటకు వేతే కారణ మున్న దంటివి. అది యేది? బాదమ్మ—ధర్మములు, శిక్షలు, స్మృతులు లౌకికములైన కారణములను పురస్కరించుకొని యుండవు. మనము లౌకికముగా విచారించినచో వానిని కారణములుగా నంగీకరింపము. పురుషుడు సృష్టియొక్క ప్రాణము స్త్రీ శరీరము. ఈ వట్టిశరీరము కదలదు. ప్రాణము కదలును. కదలుట ప్రాణముయొక్క లక్షణము. ఇది స్త్రీ పురుషులయొక్క సృష్టిరహస్యము. కామాదులు నీకు నాకు నొకటిగా భాసింపవచ్చును! శరీరావయవములు నీయవియు, నాయవియు నొక్క రీతిగా నున్నట్లుండవచ్చును. పరమార్థము జరిగెడు సృష్టిలో సృష్టింపబడుచున్న జంతుసమూహములో సృష్టివేళ స్త్రీ జంతువునకు శరీరము మాత్రమే యిచ్చుచున్నది. పురుషుడు ప్రాణమిచ్చుచున్నాడు. ఒకశరీరమునందు తన ప్రాణముండవలయు నని భర్తయూహ. అతని కుద్దిష్టమైన శరీరమందు తన ప్రాణము కాక మఱియొక పురుషుని ప్రాణముండుట యా భర్తయైన పురుషుడు సంహారింపబడుట. నిశ్చేష్టను డగుట. ఇటువంటి యొక లౌకికసిద్ధాంతమును పురస్కరించుకొని పురుషు డధికదండార్హు డగుచున్నాడు. బద్దన్న—ఇది యంతయు నభూతకల్పనగా నున్నది. బాదమ్మ—ఉన్నది. ఇది నేను కల్పించలేదు. గురువులు చెప్పినదియే.

గ్రహించుట కష్టము. నాకా యూహ లేదనుట తెలికే. ఊహ లేకపోవచ్చును. భావముండవచ్చును. భావమునగా సత్తా నిప్పునందు నిప్పుతనముండును. అది పదార్థసన్నికర్షమంది జ్వాలయగును. రావిపుల్లయందు నిప్పు లేదందుమా? చకుముకి రాతియందు నిప్పు లేదందుమా! ఇతర వస్తుసన్నికర్షచేత ఆ నిప్పు ఊహ కందినది. తత్పూర్వ మా యగ్ని భావరూపమున నున్నది. అట్లు సర్వము సర్వజనులయందు సత్తారూపమున నుండును. సందర్భమిశ్రితమై ఊహింపబడినట్లు కనిపించును. బద్దన్న—ఐనచో నావలన తప్పేమియు లేదందువు బాదమ్మ—నేను నీయందలి ప్రేమచేత లేదందును. లోక మనను. బద్దన్న—అనగా నీ వన లేదన్నమాట. లేనిచో ప్రొద్దుటినుండియు నాతో నేల మాటాడవు? బాదమ్మ—మాటాడనిది నీవు, నేను కాదు. బద్దన్న—నేను నీవందును. బాదమ్మ—ఇది తెగదు. నీవు విజయవాటము పోయితివి. ఈ యూరినుండి పోయినచో మన మెక్కువ సురక్షితుల మగుదు మనుకొంటిని. నీ బుద్ధి యుద్ధవిషయములలో పనిచేసినట్లు తక్కిన విషయములలో పని చేయదు. విజయవాటము నీది యనిపించుకొని సుంకములు చెల్లుబడిచేసికొను పని పశ్చిమచళుక్య సైన్యమును నిర్మూలించిన పనిలో సహస్రాంశముకాదు. ఇప్పుడు మఱల నింకొకయుద్ధము వచ్చిన దనుకొనుము. నీవు మఱల విశ్వరూపము తాల్తువు. విజయవాటములో నేమియుచేయు లేక నీయందొకదోష మారోపించుకొని యా దోషమును వ్యాపింపచేసి యా దోషముచేత నే నెంతవఱ కావరింపబడుదునో యూహించి యా మేఱ నీనిందను ద్విగుణీకరించుకొని నాతో మాటాడమికి మొగము చెల్లమి

తెచ్చిపెట్టుకొంటివి. ఇందు నీ తప్పు లేదు. విజయనాటములో పరిషత్తులు నిన్ను మన్నించవు. వట్టితిండి గడచుట యన్నచో నిచ్చట నీకు భుక్తికి లోపము లేదు. నీకు పొలమున్నది. ఆ పొలము పండించలేదు. ఈ యేడాది దున్నలేదు. నేను త్రొక్కించ మని పోరగా పోయి త్రొక్కించితిని. నీ తండ్రి యున్నప్పుడు నీకు చేతిలో డబ్బాడినది. నీవు దేశమునకు మేలుచేతు వన్నప్పుడు లోకము నీచేతికి డబ్బిచ్చినది. పరిషత్తు లేమిచేయునో తరువాత చూట, ముందర పొలము చూచు కొనుము.

౧౬

మరల కొన్ని నెలలు గడచెను. పశ్చిమ చళుక్యులు మరల దండెత్తి వత్తురన్న యూహాయే యంతరించెను. గోంక భూపతి దళముపై దళముగా విడుదలచేయుచుండెను. మరల గ్రామములన్నియు తిరిగి వచ్చిన పురుషులచేత నిండి శోభాయమానముగా నుండెను.

ఇల్లుగాని యూరుగాని, కొలదిమంది సంఖ్యతగ్గినతోడనే వెలితిగా నున్నట్లుండును. ఒకయింటిలో పదిమంది యుందురు! అందులో మువ్వురు పొరుగూరికి పోదురు. ఇంటిలో సందడి తక్కువయగును. ఎంతమందియో లేనట్లుండును. అట్లే గ్రామమును. నాలుగువేలమంది జనాభా గలిగిన గ్రామములో నైదారు వందలమంది యూరిలో లేనిచో నూరంతయు వెల వెల పోవును. ఎంతమందియో లేనట్లుండును. తదనుగుణముగా నూరియొక్క సమ్మర్దము, ఊరిలో జరుగు కార్యములు, తక్కువ

యగును. అక్లే గోశాలనుండి రెండువందలు పైచిలుకుగా జనము సైన్యములోనికి పోయిరి. వారు లేనన్నిదినములు నూరిలో మనుష్యులున్నట్లేలేదు. వారు వచ్చినంతనే జన మెంత మందియో వచ్చినట్లుండెను. ఇది యూరిలోని జనసంఖ్యనుబట్టి యుండును. గోశాల చిన్నగ్రామము.

అందఱు వచ్చిరిగాని నన్నయ్యరాలేదు. చాలదినముల క్రింద నన్నయ్య తన కుటుంబమునుగూడ ధనదపురమునకు తీసికొనిపోయెను. అతని కచ్చట మహారాజు గొప్పయుద్యోగము నిచ్చెను. అతఁడు ధనదపురనివాసి యయ్యెను. నాగయ్య పాప య్యలు వచ్చిరి.

జనమందఱు వచ్చిన తర్వాత నొక నెలదినములలో మఱల గ్రామమంతయు యుద్ధము జరిగినట్లుగాని యుద్ధము కొఱకా గ్రామమునుండి సైనికులు వెళ్ళినట్లుగాని లేకయే సాగుచుండెను. అంతయు గడచి యెంతయైనది. సరిగా మూఁడేండ్లు కాలేదు, అప్పటికప్పటికే మనుష్యుల మనస్సులలో నెంతయో మార్పు వచ్చెను. గ్రామమంతయు ప్రశాంతముగా నున్నట్లుండెను. వ్యవహారము లు తొల్లిటిచాయ నడచుచుండెను. మఱల పరిషత్తులు పూర్వమునందువలె పనిచేయ నారంభించెను. గోశాల 'ఊరు' ఏర్పడెను. ఈ సమయములో 'ఊరు'నకు నొక ధర్మకార్యము తీర్చవలసివచ్చెను. ఒక యతని భార్యపోయి మూఁడునెలలు మఱియొకని యింటిలోనుండి తిరిగి భర్తవద్దకువచ్చెను. ఆ భర్త వలదనెను. ఆ పురుషునిమీఁద నభియోగము తెచ్చెను. ఊరుగా పురుషుని, ఆ స్త్రీని శిక్షించెను. వారి కులము రజకకులము. ఊరి పెద్దసభ్యులిట్లనిరి, "ఇది మీ కులము పెద్దలు తీర్మానించవలసినది.

వారైనదో మీ కులమర్యాదకు తగినట్లు కొన్నినిష్కర్షములు పుచ్చుకొని మఱల నీ స్త్రీని భర్తవద్ద నుండునట్లు చేసెడివారు. ఈ యభియోగము కులము పెద్దలను దాటి యూరివఱకు వచ్చెను. మీ కులపుకట్టడులను దాటిన వ్యవహార మైనది. అందుచేత నీ పురుషునికి శిక్షయధికముగా వేయవలసివచ్చెను. ఇతడు నేడు మొదలు పదియేండ్లు గ్రామమునకు దాసు డగుచున్నాడు. ఈ స్త్రీ గ్రామమునుండి వెడలగొట్టఁబడుచున్నది. ఊరు తీర్పిట్లిచ్చెను.

ఈ యభియోగము జరిగినప్పటినుండియు తిప్పన్నకు బద్దన్నమీద నభియోగము చేయవలయునని వాంఛపుట్టెను. నాగయ్య, పాపయ్యలు గ్రామములోనికి తిరిగివచ్చిరి గదా! అందులో పాపయ్య బద్దన్న విషయము తనకు పట్టన ట్లూరకుండెను. నాగయ్య తిప్పన్నపక్ష మవలంబించెను. నాగయ్య యిట్లవలంబించుట పాపయ్య కిష్టము లేదు. నాగయ్యకుకూడ మనసులో భయముగానే యుండెను. బద్దన్నమీద నభియోగ మెంతవఱకు గెలుచును. బద్దన్న విజయవాడ పురాధిపతి. తమ యూరు విజయవాటమునకు సంబంధించిన పూంశి. బద్దన్న తనవద్ద సుంకములు చెల్లించుకొనుట లేదు.

కాని ప్రజలందఱకు బద్దన్నమీద గౌరవముకలదు. ఒక్క పురాధిపతి యను గౌరవమే కాక మహాసైన్యాధిపతి యనియు, రాజ్యముల నల్లకల్లోలము చేయగల నేర్పరియనియు ప్రజకందఱకు నతనిమీద నొకమహాభిప్రాయముండెను. ఇంతటి యభిప్రాయమునకు వ్యతిరేకముగా నేమి చేయవచ్చును? ఈ సంగతి తానుప్రోత్సహించుచున్నాడే కాని తానే మొదలు

పెట్టలేదు. విడువబడ్డయున సైనికులు గ్రామమునకు రాకముందే, ఈ విషయము కొంచెముకొంచెముగా 'ఊరి' పరిషత్తు సమాలోచించినట్లే యున్నది. ఆలోచన లేకాని, యెవ్వరును సాహసించి దీనిని పరిషన్ముఖమున తీసికొనిరాలేదు. గుసగుసలు, ఒకవేళ పైకిచెప్పుటలు, బద్దన్నయైననేమి, మఱియెవరైననేమి, న్యాయము న్యాయమే, ధర్మము ధర్మమే యని యేకదేశ మండలి సాహసోక్తి విడంబనములు—ఇంతమాత్రమే జరిగినది.

తిప్పన్న నాగన్న యింటిచుట్టును తిరిగెను. ఒకసేనానియై యుద్ధములో గెలిచి యింటికితిరిగి వచ్చినప్పటినుండియు నాగన్న 'ఊరి'లో నొక ప్రధానసభ్యు డయ్యెను. అతడు తక్కిన సభ్యులతో బద్దన్నను శిక్షించితీరవలయునని బాధించుచుండెను. ఒకనాడు పాపయ్యయు, నతడు మాటాడుట తటస్థించెను. ఇప్పుడు పాపయ్యయు సభ్యుడే. నాగయ్య యెంతవాడో పాపయ్య యంతవాడు.

పాపయ్య—మనము బద్దన్న శిష్యులము. అతడు మనకు నేర్పిన విద్య. నాగయ్య—పంచముడు నాకు గురువేమి? నేను ఖడ్గవిద్య చాలమందివద్ద నేర్చుకొంటిని. నిజాని కతని వద్ద నేర్చిన దేమియులేదు. పాపయ్య—అతడు గురువే కాదందువా! నావద్దనే కాదన్నచో నే నేమందును. పోనిమ్ము. మన మిరువుర మును సేనానులమై తిరిగి వచ్చితి మసికదా యూరిలో నింతటి మర్యాద! ఈ సేనానుల మగుటకు బద్దన్న కారణము. అతని యెడ ద్రోహము చేయుట తగదు. నాగన్న—బద్దన్న యేమి కారణము? బద్దన్న యెవరు? గొంకభూపతికి సేనానులు కావలసి వచ్చిరి. మన సామర్థ్య మెఱిగి మనలను తీసికొనిరి.

పాపయ్య—మహారాజు నీ మొగము నా మొగము నెఱుఁగడు. నన్నయ్యగారు స్వకీయప్రతిభచేత మహారాజును తన మాటకు త్రిప్పుకొని సైన్యము తన వశవర్తమై యుండుటకు నిన్నును, నన్నును చేర్చుకొనిరి. లేనిచో నీవంటి నావంటి సేనానులు చాలమంది దొరకగలరు. నన్నయ్యగారు బద్దన్నయందు మిక్కిలి భక్తిగలవారు. నాగయ్య—అంత భక్తికలవారైనచో పోయి ధనదపురములో కూర్చున్నాఁడేమి? బద్దన్నవంక నే చూడ లేదేమి? తానుద్యోగముచేయుచున్నాఁడుగాని, బద్ధన్నసంగతియే పట్టించుకోఁడేమి? పాపయ్య—ఇది లోకము. ఎవని బ్రతుకు వాఁడు బ్రతుకవలయును. నన్నయ్యగారు తనవంశ మంతటివలె వేద శాస్త్రాధ్యయనము చేసినవాఁడు కాఁడు. క్షత్త్రవృత్తిగా మనిన వాఁడు. అట్టివానికి నేఁటి యుద్యోగమువంటి యుద్యోగము మిక్కిలి ప్రతిష్ఠాహేతువు. ఎవఁడైనను తనజీవిక తాను చూచు కొనును. నాగయ్య—అందుకనియే నే చెప్పునదియును. బద్దన్నకు నే శిష్యుఁడనుకాను. నీ వనుకొన్నట్లు నన్నయ్యగారు నన్ను బాగుచేయలేదు. నేను ధర్మాధికారిగా చేయవలసినపని కిట్టి భావము లడ్డు రానీయను. బద్దన్న తప్పుచేసెను, పరభార్యాప హారణము చేసెను. ఒకటే తప్పునకు రెండుశిక్ష లుండవు. వాఁ డధికుఁడని యొకటి, అల్పుఁడని యొకటి. ఇది ధర్మము కాదు. పాపయ్య—అది ధర్మము కాదు, ఇది ధర్మము కాదు. నీ బదులు నాబదులు మఱొకఁడు పరిషత్తులోనుండి బద్దన్నను శిక్షించ నిమ్ము. మఱియొకటి చేయనిమ్ము. మన కవసరము లేదు. మనము పరిషత్తులోనుండి యట్లు చేయుట న్యాయము కాదు. మనము పరిషత్తులో నున్నాము. మన ప్రసక్తి లేకుండ

నీ యభియోగముమీద మనము తీర్పు చెప్పవలసివచ్చెను. అప్పుడు మన ముపసంహరించుకొనవచ్చును. కాదా తీర్పు చెప్పవచ్చును. అప్పుడు న్యాయమే చెప్పుము. ధర్మమే చెప్పుము. అప్పుడు నీవు ధర్మము చేసినట్లగును. కానీ యిప్పుడు నీవు చేయుచున్నది యధర్మము. బద్దన్నమీఁద నీ యభియోగము వచ్చుటకు నీవే కారణభూతుడ వగుచున్నావు. ఇది యధర్మము. నీది కానిపనిలో నీవు జోక్యము కలిగించుకొని, మనకు ప్రాణదాతయైనటువంటి వానిమీఁద నభియోగము తేల్చుటవేఱు. వానియంతట నది యభియోగము వచ్చినచో నీవు పరిషత్తులోనున్నచో న్యాయముచెప్పుట వేఱు. నాగన్న— బద్దన్న నా ప్రాణదాతయఁదువా! నా ప్రాణ మెప్పుడు క్లిష్ట స్థితిలో నున్నది; ఆత డెప్పుడు రక్షించెను! పాపయ్య—ప్రాణ దాత యనగా మన జీవిత మీ యుచ్ఛస్థితిలో నుండుటకు కారణభూతు డైనవా డని నా తాత్పర్యము. అతనియంతటి మహావీరుడు నే డాంధ్రదేశములో లేడు. నిజానికి సర్వభారత దేశములో లేడు. నాగయ్య—బద్దన్న యంత వీరుడందునా! మహా సైన్యాధిపతి నంబయ్యగారికన్న గొప్పవీరుడా యేమి! ఏనుఁగులు లేకుండ, గుఱ్ఱములు లేకుండ ముప్పదివేల పదాతులతో పశ్చిమచళుక్యసైన్యము, నేబదివేలసైన్యమును, రెండువేల గుఱ్ఱములను, రెండువందల యేనుఁగులను బరిమార్చిన జోదు నంబయ్యగారు. ఆయనకంటె గొప్పయోధుడా? పాపయ్య— నీవంటి వానితో మాటాడుట కష్టము. ఆ రెండువేలగుఱ్ఱములను, రెండువందల యేనుఁగులను బరిమార్చినదెవరు! నంబయ్యగారా, బద్దన్నయా! బద్దన్న తన కొప్పనకసైన్యముతో రానిచో

ఆ నంబయ్యగారేమయ్యెడివాడో? నీ వేమయ్యెడివాడవు! నే నేమయ్యెడివాడను! నీచేతనే భగవంతుడు నిజము పలికించినాడు. బద్దన్న నీ ప్రాణదాత. నాగన్న—బద్దన్న గజాశ్వసైన్యములను నిర్మూలించుట యొకగొప్పగా చెప్పెదవు. గొంక భూపతి మహారాజు, నంబయ్యగారు మహా సైన్యాధిపతి. దేశములోని ప్రజలందఱు వారిబంట్లు. ఎవనిశక్తి వాడు ప్రకటించి రాజునకు సేవచేయుట వాని విధి—పాపయ్య మొగము గంటువెట్టుకొని మఱల మాటాడకుండ వెడలిపోయెను.

## ౨౦

బద్దన్నమీఁద యీ యభియోగపుమాట గోశాలలో క్రొత్తది కాదు. కాని యిదివఱకు గాలిలో నున్నది ఇప్పుడాకృతి కట్టినది. ఆకృతి కట్టుటయే మొదటితెలివిగా బయలుదేరి యూరంతయు గగ్గోలయినది. అతడు తమకు రాజస్థానీయుడు. సేనాధిపతి. పురాధిపతి. ఒక్కొక్కప్పుడు పరిషత్తులలో నున్న పై యధికారులను తొలఁగించవచ్చును. వారియందధర్మము కనిపించినచో ప్రజానుమతితో శిక్షించవచ్చును. అట్టిదేమి జరుగునో యని కొందఱు భయపడిరి.

పరిషత్తునకు బంటులుందురు. ఒకనాఁడు పరిషత్తు యొక్క బంటువచ్చి మాఱునాడు బద్దన్నను, బాదమ్మను పరిషత్తు నెదుటికి రావలసిన దని యాజ్ఞ చెప్పిపోయెను.

బాదమ్మ—రేపు మనము పరిషత్తునెదుటకు పోవుదమా!

బద్దన్న—నేను పోను. బాదమ్మ—పోనిచో రెక్కలు విఱిచికట్టి తీసికొని పోవుదురు. బద్దన్న—సాహసించి వచ్చినవానిని

రెండుగా నఱికెదను. బాదమ్మ—అది ధర్మమా! అప్పుడూరందఱు వచ్చెదరు. తర్వాత రాజభటులు వచ్చెదరు. బద్దన్న-ఊరందఱు వచ్చినను తుండెతుండెములు చేసెదను. రాజభటు లెవరు? ఈ పదియూళ్ళకు నేను రాజును. బాదమ్మ—నీకు భటు లేరీ? బద్దన్న-త్రిపురాంతకుని భటులు వత్తురా! వారు నామీఁదికి రారు. బాదమ్మ—గొంకె రాజభటులు వత్తురు. బద్దన్న--ఇంత వఱకు తెలుఁగుదేశ మొకటిగా నున్నది. అంతకాడికి వచ్చినచో రెండగును. కృష్ణయవతలి రాజ్యము వేఱు. ఇవతలి రాజ్యము వేఱు. ఈ దేశ మనాదని వేంగిపల్లవులది. వేంగిపల్లవుడైన త్రిపురాంతకుడు కాలానుసారముగా వేంగిచోడు డయ్యెను. అతని పల్లవుని చేసెదను. వెలనాటిచోళుల యధికారము దేశములో నంతరింపించెదను. బాదమ్మ—ఇది యంతయు నాకోసమా! బద్దన్న—నీ కోసమే. నిన్ను నేను తీసికొనివచ్చుట పరునిభార్యను తీసికొని వచ్చుటగా వ్యాఖ్యానము చేయుచున్న యీ దేశమును శిక్షించినను తప్పులేదు. నీవు నా భార్యవు. భార్యయనగా పెండ్లిచేసికొనవలయుననియా! తాళికట్టవలయు ననియా! నా హృదయము నీయందు లగ్నమైనది. నేను పురుషుడ నని తెలియకముందు, నాలో లింగజ్ఞాన మేర్పడక ముందు, నేను నిన్ను భార్యగా స్వీకరించితిని. ఇందు దోష మేమున్నది? అనీతియేమున్నది! ఇదియంతయు నాగన్న చేయు చున్నాడట. వాడు నేటికీనాడు మగవాడైనచో, నేను చేసిన మగవాడు. నే నెచ్చటికిపోయిరమ్మన్నచో నచ్చటికి పోయివచ్చిన వాడు. ముందా నాగన్నను శిక్షించెదను. బాదమ్మ—చూచి తివా. నీ వివేకమువలన, నీ నీతివలన, నీ శౌర్యమువలన, నీ

బాహుబలమువలన, నాంధ్రదేశము స్వతంత్రమైనది. ఒక్క-గొడుగు క్రింద నిలచినది. బద్దన్న-ఆమాట యెవరనుచున్నారు. నీవనుచున్నావు. బాదమ్మ-తెలిసినవారెల్ల రనుచున్నారు. ఆ తెలిసినవారిసంఖ్య తక్కువ. అది యట్లుండనిచ్చి యీయొక గొడుగుక్రింద నిల్చిన దేశమును మఱల రెండుముక్కలు చేయుట న్యాయమా! నీవానాడే తలచినచో నీ రెండుముక్క లప్పుడే యయ్యెడివి. ఆనాడు నీవు త్రిపురాంతకునివద్ద వాగ్దానము తీసికొంటివి. అతని గొంకరాజునకు సామంతుని చేసితివి. నా యుద్దేశ్యములో త్రిపురాంతకున కది కోపముగా పరిణమించెను, అందుకనియే యాయన యుద్ధములో జోక్యము కలిగించుకొనలేదు. మఱల నీవంక చూడలేదు. అప్పుడు త్రిపురాంతకుడు నీమాట విన్నాడు. ఇప్పుడు విను నని నమ్మకము లేదు. అప్పుడు నీవు చేసిన ప్రయత్నము నీ కొఱకు కాదు. దేశము కొఱకు. నీయందు స్వార్థము లేనప్పుడు. ప్రజలు నీమాట నప్పుడు విన్నారు. ఇప్పుడు నీది స్వార్థము. ఆ స్వార్థమును లోకదృష్టి దోషముతో కూడిన స్వార్థము. నా బుద్ధి నిశితమైనది. ఈ నిశితత్వమే మన నొకరి నొకరియెడ కాకర్షించినది. నీకు సరే బాల్యము. నాకు నా పూర్వజీవితమున నా నిశితత్వమును ప్రదర్శించుటకు వీలులేకపోయి యీ స్థానముకొఱకు వెదకుటయు, నీవు కనిపించుటయు జరిగినది. మన మీ కలయికలో శరీరము లాకర్షింపబడుట తక్కువ. మనస్సాకర్షింపబడుట యెక్కువ. బద్దన్న-ఈ సంగతి లోకమున కేమి తెలియును! బాదమ్మ-మనుష్యులు శరీరములో తక్కువ జీవింతురు. మనస్సులో నెక్కువజీవింతురు. మనస్సు కనబడనిది. శరీరము

కనబడునది. లోకము కనబడుదాని వెల కట్టుచునుగాని, కన బడని మనస్సు వెలకట్టలేదు. ఆ కనబడనిదాని వెలకట్టలేదని యీ లోకమును నిందించుటయు తప్పే. బద్దన్న-లోకమున కది తప్పుకానిచో తప్పు మనది. బాదమ్మ-తప్పు మనదికాదు. మన మనస్సులు మనకు కనబడుచున్నవి. మనకు కనబడినదాని ప్రకారము మనము నడచుచున్నాము. వారికి కనబడినదాని ప్రకారము వారు నడచుచున్నారు. బద్దన్న-అదియట్లే కావచ్చును. కాని మనము లోకములో భాగము. వ్యక్తులు కొందఱు వారినడక వారు నడువవచ్చును. ఆ నడక లోకపు నడకతో సరిపోవలయును. అచ్చముగా మనస్సే లేదుగదా! వ్యక్తికి ప్రధానమైనది మనస్సు. లోకమునకు ప్రధానమైనది శరీరము. బాదమ్మ-అయినచో నీవు లోకము నేల నిరాకరించి నాతో వచ్చితివి. బద్దన్న-అబద్ధా లాడకుము. ఆడపిల్లలు పుట్టుదురు. బాదమ్మ-అది యొకటి పెట్టకుము. మన కథ తేలినతర్వాత పిల్లలు పుట్టుట. బద్దన్న—మన చర్చ లన్నియు చివరి కిట్లే పర్యవసించును. బాదమ్మ—దానికి నీవే కారణము. ఏదో వాదించినట్లు వాదించి చివరి కిందులోనికి దింపుదువు. బద్దన్న—అయ్యయ్యో! నా జీవితమే యిట్లున్నది. యుద్ధములు సైన్యములు అన్నియు చేసి, చేసి చివరకు నీ దగ్గరకు వచ్చితినిగదా! బాదమ్మ-నేనే నీవద్దకు వచ్చితిని ఇంతకు నేనొక స్త్రీని లేవదీసికొని వచ్చితివి. నన్ను పరిమత్తు శిక్షింతు ననుచున్నది. మీ రందఱు లేచి నాకొఱకు యుద్ధము చేయుడందువు. దీని కెవరంగీకరింతురు! మఱియొకటి చూడుము అప్పుడు శత్రుసైన్యము దేశములో నున్నది. ఆ నెద్దరికి నెవరకు-అకువచ్చునో వారు

దేవునిగా లోకము చూచెను. ఇప్పుడు దేశము శాంతముగా నున్నది. ఆపద లేదు. ఎవనికిని నేమియు పట్టదు. ఎవని గొప్పతనము నెవనికి నచ్చదు.

ఇట్లు బాదమ్మ యతని తర్వాత బద్దన్న విషాదగ్రస్త మానసుం డయ్యెను. ఆమె చెప్పిన మాటలలోని యాథార్థ్య మతనికి తెలిసెను. కింకర్తవ్యతామూఢుఁ డయ్యెను. కొంతసేపటి వఱకు కొకరితో నొకరు మాటాడ లేదు.

అంతటితో ప్రొద్దుగ్రుంకెను. అది హేమంతఋతువు. మఱునాటి ప్రొద్దుటికి పూసకట్టు ముత్యాలు కాబోవు మంచు, సృష్ట్యాది పరమాణువులు ద్వ్యణుక, త్ర్యణుకభావములు పొందబోవుస్థితిలో, నణువులు సమాహారదశ నందుకొనబోవుటకు పరమసన్నిహితస్థితిలో నెట్లుండునో తెలియదుకాని, దూరమున కొకమబ్బుగా కనిపించినట్లు లీ మఱునాటి ప్రొద్దుటి పరిణమయితవ్యనీహారబిందువులు చీకటి వచ్చినంతనే యొక తెల్లనిమబ్బుగా, నొక గుమ్ముమంచుగా నేర్పడెను. శిశిరమును, హేమంతమును రెండు ప్రత్యేక ప్రత్యేక ఋతువులు. మంచు లేకుండ, ననగా జలసంసర్గము లేకుండ శిశిర ముండునా? శిశిరమునకు జలము సహకారియా? వేసంగియందు జలమున్నది. శిశిరము లేదుకదా! శిశిరము వేఱేవస్తువు. జలము వేఱేవస్తువు. జలమునకు శిశిరమునకు సంబంధ మున్నట్లు కనిపించుట న్యాయమా? ఈ హేమంతములో బాదమ్మ బద్దన్నల శరీరములు శిశిరబలముచేత పరిష్వంగమును వాంఛించెను. కాని మనస్సులోనున్న తీవ్రమైన యాలోచన యు గ్రీష్మము వెట్టియు, పరిష్వంగసంధానకారి కాలేదు.

ఆ రాత్రి వారిరువురు పండుకొనలేదు, తినలేదు. రాత్రి రెండు జాములయ్యెను. ఇరువురును చెరియొక మంచముమీద పండుకొనిరి. కొంతసేపటికి బాదమ్మ కేదో సన్ననిధ్వని విని పించినట్లాయెను. ఆమె యొకటిరెండుసార్లు పరిగణించలేదు. మూఁడవసారి లేచిచూచెను. ఆధ్వని బద్దన్ననుండి వచ్చుచున్న ట్లుండెను. అతని మంచము నద్దకుఁ బోయి చూచెను. అతని కన్నులు మూఁతబడి యుండెను. మూఁతఁబడిన కనుగొలఁకుల జలబిందువు లేర్పడియుండెను. అతని కంఠమునుండి సన్నగా నీ రోదనధ్వని వచ్చుచుండెను. బాదమ్మగుండె తరుగుకొని పోయెను. అహా! యీ జీవుఁడెంత కష్టపడుచున్నాఁడు! పట్టి పసివాఁడు, కామమెఱిగినవాఁడు కాఁడు. తానెఱిగిన దోషము కాని దోషముచేత బాధింపఁబడుచున్నవాఁడు. తనయంతట దానైనచో లోకములు పుడిసిలింపఁగలవాఁడు. అడుగులోననే హంసపాద న్నట్లు జీవితప్రయాణము ననే తనవంటి, యనఁగా బాదమ్మవంటి వొక మహాంతరాయముచేతఁ బ్రతారింపఁబడినవాఁడు. అతనికి సాయంకాలము వచ్చిన కోపవేగమును తాను విషయమును విమర్శించి చూపి చల్లబఱచెను. ఉద్రేకము వచ్చినప్పుడీబద్దన్న యెంతయైనను చేయఁగలఁడు. గోశాల యంతయు నిర్మూలము చేసి, వలసినచో గొంకభూపతిని దిగఁద్రొక్కి, త్రిపురాంతకుని తెలుఁగుమండలి కధినేతను చేసెడివాఁడేమో! అతనికి వచ్చిన యూహ యీ రీతిగా మున్నెప్పుడు వ్యర్థము సేయఁబడలేదు. అంత చేయగలవాఁ డిప్పుడేమియు చేయలేనివాఁడై యే పరిషత్తునకుఁ దానొక మహారాజుగా నుండెనో ఆ పరిషత్తు నెదుట చేతులు కట్టుకొని నిలుచుండుటవంటి దీనస్థితి నింతటికియుక్తాల

ప్రకృతి సహించుకొనలేదు, లేకున్నాఁడు. ఇంతకుఁ దాను కారణము. తాను తిప్పన్నను వదలి యీ పసివానితో నేల వచ్చెను. ప్రధానముగా నతనియౌవనముచేతనాకర్షింపఁబడెనా? అట్లుకాదు. అతని విద్యచేత నాకర్షింపఁబడెనా? అదియుఁగాదు. ఆ విద్యాప్రకటనసమయము నందలి ప్రతిభావిశేషముచేత నాకర్షింపఁబడెనా ! కొంతమట్టుకు గావచ్చును. ప్రధానముగా నతని యీ పతనమునకుఁ దానేలకారణ మయ్యెను? బాదమ్మ తన యంతరాంతరము వెదకిచూచెను. బద్దన్న శైవుఁడు. తాను వైష్ణవి. చాలదినములుగా బద్దన్నయంతటివాడు శైవుఁడై యుండుట కామె మనస్సంగీకరించలేదు. అతఁడువైష్ణవుఁడైనచో నెంతబాగుగా నుండునని యామె చాలసార్లూహించెను. ఆమె యాలోచించఁగా, నాలోచించఁగా నది ప్రధానకారణము, తక్కినవి యుపకారణములుగా నామెబుద్ధికిఁ దోఁచెను. ఆప్రధాన కారణము మఱుగుపడి యతని యౌవనము, దీప్తి, శౌర్యము, ప్రతాపము నిజమైన కారణములుగా నగుపించెను. ఈ రెండేం డామె యట్లు ప్రవర్తించెను. ఆ యుపకారణములన్నియు నేటికి శాంతప్రచారములయ్యెను. ఈ స్థితిలో యౌవనానుభవము యొక్క క్రొత్తదనము మఱఁగినంతటిలో నతని శౌర్యాదుల ప్రాచుర్యము మఱుగుపడఁజేయు పరిస్థితులలో నామె మనస్సునకు నా వెనుకనున్న యూహ పొడకట్టెను. ఈ రెండేండ్లుగా నామెమనస్సులోనామె వైష్ణవురాలనని, యతఁడు శైవుఁడని, యీభావమేలేకుండెను. తాను తిప్పన్నవద్దనున్నప్పుడు తాను వైష్ణవురాలు. తిప్పన్న వైష్ణవుడు. పలుమంది వైష్ణవమత రహస్యము లెఱిఁగిన దాసరులవద్ద తా ననేకరహస్యము లెఱింగినది,

కొప్పాడ వాడలో నంతయు వైష్ణవులు. ఆ వాడలో పిల్ల పిల్లలకు వైష్ణవము తెలియును తాను తిప్పన్నవద్ద నున్నప్పు డామె మనస్సు బరిపరివిధములుగ భావించెను. జీవితము వేఱు, మతము వేఱు. ఈ రెండును వేఱువేఱుగా గనిపించెను. బద్దన్నవద్దకువచ్చిన నాఁటినుండియు నా రెంటికిని భేదము కన్పించలేదు.

నేఁడేమి చేయవలయును! బద్దన్ననుచూచుచు నామె కేమియుఁ దోఁచలేదు. అతనిని లేపెను. పోవుద మనెను. ఎచ్చటి కని యతఁ డడుగలేదు. ఇద్దఱు నట్లే వెడలిపోయిరి.

## ౨౧

కొంతదూరము పోవునప్పటికి బద్దన్నకు స్మృతి తెలిసెను. అప్పుడతఁ డెచటికి పోవుచున్నా మని యడిగెను.

బాదమ్మ—విజయవాటమునకు. బద్దన్న—ఇంకెంతదూర మున్నది? బాదమ్మ—దగ్గరకు వచ్చినాము. బద్దన్న—మనము విజయవాటమునకు పోవద్దు. బాదమ్మ—ఎందుచేత? బద్దన్న—నేను పుట్టినయూరే యిట్లయినది. నేనధిపతినైన యూరు, నాయధిపతిత్వ మెఱుఁగని యూరు, అది యెట్లగునో? బాదమ్మ—ఎచటికి పోదము? బద్దన్న—మఱియెచ్చటి కైనను సరే. బాదమ్మ—కొప్పాక పోవుదమా? బద్దన్న—ఇది బాగుగా నున్నది. మగవాడు పుట్టిన యూరులో దిక్కు లేదు. ఇంక ఆడుది పుట్టిన యూరుమాట చెప్పుము. బాదమ్మ—మా యూరులో నాకా భయము లేదు. బద్దన్న—అట్లే యగపించును. బాదమ్మ—అది కాదు. కొప్పాకవాడలో వేయిమందిని నీవుసైనికులను బ్రోగు

చేసితివి. అందులో నైదువందలమందిని నీవు చంపితివి. మూడు వందలమందిని బుంగన్న చంపెను. అచ్చట జనమే లేదు. ఉన్నను, నచ్చట నాగయ్యా పాపయ్యాలు లేరు. బద్దన్న—పాపయ్యా మంచి వాడే. బాదమ్మ—మన కెవరిమంచితన మెందుకు! మనదారిని మన ముందము. బద్దన్న—ఇతరు లుండనిచ్చినకదా! బాదమ్మ—మా యూరిలో భయములేదు. బద్దన్న—కానీ చూతము!

కొప్పాక చేరిరి. కొప్పాక యీకలుతీసిన కోడివలె నెచ్చటచూచినను పురుషుడన్నవాడు లేకయుండెను. పంచమ వాటిక మఱియు దిగులుపడియుండెను. ఇద్దఱును బుంగన్న యింటికిపోయిరి. ఈలోపుగా బుంగన్న చెల్లెలు చనిపోయెను. బుంగన్న వ్యాధిగ్రస్తుడై యుండెను. బాదమ్మ తండ్రి, తమ్ముడు యుద్ధములో మరణించిరి. బాదమ్మ తమ్మునికొడుకును పెట్టుకొని బాదమ్మ మేనత్తయొక్కతె మాత్రము కాపురము చేయుచుండెను. బాదమ్మ తిప్పన్నను వదలిపోయినదని తెలిసి యిది వఱకందఱును కక్కసించుకొనినవారే. దిక్కుదిబాసు లేని యీ స్థితిలో బాదమ్మ నామె మేనత్త మిక్కిలి సమాదరించెను. ఆమె దృష్టిలో బాదమ్మ లేచిపోయినట్లే కనిపించలేదు. ఆ ముసలిది మేనకోడలును, మేనకోడలు భర్తయు వచ్చినట్లే వారినాదరించి యింటిలో నుంచుకొనెను.

ఊరిలో జన మెక్కువగ లేకపోవుటచేత వాడలో నున్న కొద్దిమంది పురుషులకు స్త్రీలకు పని సమృద్ధిగా దొరకుచుండెను. బాదమ్మ మేనల్లుడు ఒక సంపన్నగృహస్థు నింట గొడ్లను కాచుచుండెను. అతని మూడుపూటలు వారియింటనే భోజనము. పైన నేడాది కైదుబస్తాలు జొన్న లిత్తురు. మేనత్త ముసలిది,

ఈమె యింటిలో మగ్గమును బెట్టి బట్టలు నేయుచుండెను. బొదమ్మ యింటిలో పూర్వ మీ నేత లేదు. ఆ ముసలిది జీవనాధారము కోసము దీని నేర్పరచుకొనెను. వస్త్రములు నేయువిండ్లు కొల్పాక హరిజన వాటికలో వందవఱకు నుండెను. వారివద్ద నా ముసలిది యీ వృత్తిని నేర్చుకొనెను. బొదమ్మయు బద్దన్నయు వచ్చినప్పటినుండియు బొదమ్మ ప్రతి దినము కూలికిపోవును. వడ్లదంపుకు పోవును. ఇంటిలో నెవరికి తిండికి లోపము లేకుండ నుండియుండెను. బద్దన్నకు బొదమ్మ కూలిచేయుట యిష్టములేదు. బద్దన్న తండ్రితాతలు కూలి చేసినవారు కారు. పాలేరుతనము చేసినవారు కారు. బద్దన్న తన యూరులోనున్న పొలమునువదలికొని యిచ్చటికివచ్చెను. అతనికి తలకొట్టుకొన్న ట్లుండెను. కాని త న్నెఱిగియున్నవా రిప్పు డా యూరిలో నెవ్వరును లేరు. హనుమదళములో మిగిలిన జనము గోంకభూపతియొక్క మూలబలములో చేరెను. ఆ యూరిలో నున్న అగ్రవర్ణములవారు బద్దన్న పే రెఱుగుదురు, గాని యతని మొగ మెఱుగరు. అతడుతన పేరు చెప్పుకొనలేదు. క్రమక్రమముగా నతడు కూలిచేయుట మొదలుపెట్టెను. ఒక యేడాది యిట్లు గుప్తముగా గడచిపోయెను. ప్రొద్దుననే లేచి బొదమ్మ వడ్లదంపునో, మఱిదేనికో పోవును. బద్దన్న కూలికిపోవును. ఇంటిలో ముసలిది కూడుడకబెట్టి బద్దన్నకు వేళకు తీసికొనిపోయి యిచ్చును. బొదమ్మ తనకు తీరికయైనప్పు డింటికి వచ్చి తిండి తినును. ఇద్దఱును వారియిష్టము వచ్చినప్పు డింటికివత్తురు. ఈ సమయమున కింటికి వత్తురన్న నియమములేదు. బద్దన్న సామాన్యముగా ప్రొద్దుపోయి వచ్చును. అప్పటికి బొదమ్మ నిదురపోవుచుండును.

మఱియొకప్పు డతనింటికి వచ్చినప్పు డీమె యుండదు. ఈమె యింటికి వచ్చినప్పు డతడుండడు. ఎక్కువసా ర్లొకరినొకరు కలసి కొనుటయే లేదు కలసికొనినను శ్రమపడియుందురు. పండుకొని నిదురపోదురు. ఆ చిన్నగుడిసెలో వారి కేకాంతము లేదు. ఒకప్రక్క ముసలిది పండుకొని యుండును. మఱియొకప్రక్క బాదమ్మ మేనల్లుడు నిద్రించుచుండును.

ఇట్లు చాలదినములు గడచువఱకు బద్దన్న తా నొక వీరుడ ననిగాని, కరవాలభైరవుని సంహరించిన వాడననిగాని విజయవాట పురాధిపతి ననిగాని మఱచిపోయి నట్లుండెను. అన్నిటికంటె బాదమ్మను తాను ప్రేమించతినని, బాదమ్మ తనతో లేచి వచ్చె నని, ఇద్దఱు సుఖ మనుభవించుటకై యిట్లు వచ్చితి మని, దానినిగూడ మఱచిపోయెను.

బాదమ్మ మునుపటివలె లేదు. ఆమె శరీరము మున్ను యౌవనస్ఫూర్తిచే కొట్టవచ్చినట్లుండెడిది. ఆమె యెపుడును తల మాయనీయలేదు. చీర నందముగా ధరించకుండనుండలేదు. నల్లని తలకట్టు, దీర్ఘమైన తలకట్టు దువ్వి పాపటతీసి యెడమ వైపున తాటిపండంత కొప్పుపెట్టి యెప్పుడును కొప్పులో పూవులు పెట్టెడిది. ముక్కున కడ్డబాస, చెవులకు పోగులు, జూకాలు మున్నామె తీసి యెఱుగదు. నడుమునకు వెండి యొడ్డాణము చేతులకు నాల్గుజతల గోట్లు, వెండికడకడెములు వ్రేళ్ళకు వెండి యుంగరములు, కాళ్ళకు కడియములు, తుమ్మ కాయలు, గొలుసులు, పిల్లాళ్ళు మొదలైన వెండినగలతో నెప్పుడు నామె తిరుగుచుండెడిది. మున్నెప్పుడును చెంగావి రంగుచీరెలు ధరించెడిది. ఈ షేడాదిలో నామె యంతయు

మాఱిపోయెను. ఒక్క నగలేదు. తం లో పూవుబెట్టదు తల గోళ్ళతోగూడ గీరి ముడివేయదు. పూర్వము జానపదస్త్రీ సర్వసౌందర్యము, సర్వయౌవనశోభ యామెయందే యుండి నన్నట్లుండెను. బాదమ్మ నేడు పేదరాలై కాంతి మాసి యుండెను బద్దన్నకూడ మొదటిరోజులలో పనిచేయుట తెలియక, యితరులైన కూలిజనము లేకపోవుటచేత మాత్రమే యజమానులచేత నంగీకరింపబడి క్రమముగా పనినేర్చుకొని యిప్పుడు పూర్తిగాపాలేరయ్యెను. ఇప్పటికిని బద్దన్నకు కోపము వచ్చినచో వసికట్టియో, మేడికోలయో, కత్తిని దూసినట్లు దూయును. ఒకప్పుడొక యజమాని యడిగెను. 'నీవు యుద్ధములో పనిచేసితివా'యని. బద్దన్నతనకు యుద్ధమునకు నేమియు సంబంధములేదనెను. ఈరీతిగా వారిద్దఱు ప్రేమమాటయే మఱచి పోయి రాజ్యతంత్రమే మఱచిపోయి, యుద్ధస్థితియే మఱచిపోయి, దొరతనములే మఱచిపోయి జీవితాంతము నట్లు బ్రతుకుట కాని బ్రతుకు బ్రతికి, యిరువదియేండ్లకో డెబ్బదియేండ్లకో చని పోయి యుండెడివారేమో! అట్లు జరుగకుండ వారికొకనాడు సాయంతనము నొక వార్తవచ్చెను. నూటికి కోటికి నెప్పుడో బాదమ్మ బద్దన్నలు కలిసికొందురు. ఆనాడట్లు కలసికొనిరి. ఆ కలసికొనుటలో తొల్లిటి ప్రేమమయ సంభాషణలు లేవు. ఈనాడు నీ వెచ్చటికి కూలికిపోయితి వని, కూలి యెన్నిగింజ లని, ఆ దొర మంచివాడేనా యని, యిటువంటి ప్రశ్నలు—ఇట్లు మాటాడుచుండగా ఊరిపరిచారకుడు వచ్చి 'నీ వేనా బద్దన్న' వనెను. బద్దన్న ఉలికిపడెను. బద్దన్న తా నా యూరిలో నాగన్న నని చెప్పుకొనుచుండెను. బద్దన్న 'యెందు' కనెను.

సేవకుడు. 'నీవు రేపు పరిషత్తు ఎదుటికి రావలయును' అని చెప్పి పోయెను.

బద్దన్న ఏమియు తోచలేదు. బొదమ్మ కంతకుమునుపు తోచలేదు. బద్దన్న గ్రామములోనికి పోయెను. రాత్రికి ప్రొద్దుపోయి వచ్చెను. వచ్చినవెంటనే బొదమ్మ ముఖము ప్రశ్నించినట్లుండెను. బద్దన్న చెప్పెను. 'నాగయ్య యీయూరుకు వచ్చెను. ఇన్నాళ్ళుగా మనకోసము వెదకుచున్నాడట. కొప్పాక నీ పుట్టిల్లుగుటచేత నిచ్చటనుందునని యనుకొనెనట. ఇదివఱకు రెండుమూడుసార్లువచ్చి యడుగగా, నాపేరుకలవాడీయూరిలో లేడని చెప్పిరట. మఱల మఱల వచ్చి నన్ను గుర్తుపట్టెనట. ఈ యూరిపరిషత్తులో పదిదినములుగా నిదే ప్రయత్నమట. నన్నొకసారియే పిలుచుటయు, శిక్షించుటయు జరుపవలయు ననియు, లేనిచో నేను పారిపోవుదు ననియు చెప్పెనట. ఐనను నీయూరి పరిషత్తువారికి నేను బద్దన్నవని మొదట విశ్వాసమే కలుగలేదు. అందుచే పట్టుకొనలు, కోపములు లేవు. పిలిపింతము, రానిచో నప్పుడు తెలిసికొనుందాం, యని రట!

ఈవార్త చెప్పి బద్దన్న దిగులుపడినట్లు కూర్చుండెను. బొదమ్మ ముగములో దిగులు కనిపించలేదు. ఆమె హృదయములో నేదియో యుత్సాహరేఖ గోచరించెను. కొంతసేపటికి బొదమ్మతాండవ్యకోసి కొప్పరపుట్టి చెంగావిసీరె కట్టి తననున్న నగలన్నియు పెట్టుకొని బద్దన్నయెదుటికి వచ్చెను. అది కృష్ణపక్షము. నవమియో, దశమియో. అప్పటికి చంద్రోదయము మయ్యెను ఆమెను చూచినంతనే బద్దన్న తాను పాలేరుపని చేయుచున్నానని మఱచిపోయెను. మఱల బద్దన్ననని జ్ఞానము

వచ్చెను. ఆయింటిలో వారిమనస్సులుగాని, వారి ప్రేమలుగాని వారి యుత్సాహములుగాని, వారి శృంగారరసములుగాని పట్టునంతటి యెడము లేదు. ఇరువురును కలసి పొలాలమీదికి పోయిరి. చీకటిలో, అనగా గుడ్డివెన్నెలలో బాదమ్మ కేదియో గ్రుచ్చుకొనెను. ఇద్దఱును కూర్చుండిరి. ఆమె పాదములు తన తొడమీద పెట్టికొని అతడు విరిగిన ముల్లునో, ఎండిన గరిక కాడనో లాగివేసెను. ఆమె తన బరువంతయు నతనిమీద మోపి నడచెను. ఆమె యిట్లనెను. 'నాగయ్యా చాల మంచి వాడు. మనము నిద్రపోవుచుంటిమి. ఆతడు వచ్చి మేల్కొలి పెను. మనము, మనలను మనము మఱచిపోయినాము. అతడు మీరు మీరని చెప్పినాడు. మన మిద్దఱము నీకు నేను లేక నాకు నీవు లేక యిద్దఱము నూరికి కూలికి కాదా ? నాగయ్య 'బద్దన్నా నీవెవరవు! మహావీరుడవు విజయవాటపురాధిపతివి. ఛీ కూలిచేయుదువా' అని చెప్పెను" అనెను. వారియిద్దఱి నాటిప్రేమ శృంగారము వెన్నెలలు పట్టలేదు.

౨౨

కొంప్పాకలో పరిషత్తు సమావేశమై యుండెను. ఎదు రుగా బద్దన్న నిలువబడియుండెను. పరిషదధికారి 'నీ పేరేమి' యనెను.

బద్దన్న—బద్దన్న. అధికారి—నీ దేయూరు ? బద్దన్న— గోశాల. అధికారి—నీమీద నభియోగమువచ్చెను నీవు తిప్పన్న యనువాని భార్యను లేవదీసికొనిపోతివి. బద్దన్న—ఔను. అధికారి—నీవు దీనికి తగిన శిక్ష ననుభవించుటకు సిద్ధముగా

నుంటివా! బద్దన్న-ఉంటిని! అంతలో పరిషత్సభ్యులలో నొకరు లేచి యిట్లనిరి. 'బద్దన్నా! యీ కూర్చున్న యాయన యెవరు? బద్దన్న-ఆయన పేరు నాగయ్య. సభ్యుడు-ఆయన దేయూరు? బద్దన్న-మాయూరు, గోశాల. సభ్యుడు-నీ వాయన నెఱుగుదువా? బద్దన్న-ఎరుగుదును. సభ్యుడు-ఈయన వెనుకటి యుద్ధములో నొక సేనాని. బద్దన్న-ఔను. సభ్యుడు-నీవుకూడ సేనానివికదా! బద్దన్న-ఔను. సభ్యుడు-ఒక సేనానిమీద మఱియొక సేనాని తనకు పట్టని యభియోగము తెచ్చినచో నీ సేనాని యా సేనానితో యుద్ధ మాడవచ్చును. ఆడి పగ తీర్చికొనవచ్చును. ఆపగ తీర్చికొనుట వేఱు. పరిషత్తుచేయు శిక్ష వేఱు. పరిషత్తెట్లును శిక్షించును. శిక్షించిన తరువాత నభియోగము తేబడిన సేనానికి, తెచ్చిన సేనానితో యుద్ధముచేయుట కధికారము కలదు. నాగయ్య-అది యిప్పటి మాటకాదు. అప్పు డాప్రసక్తి లేదు. మేము పూర్వ మెప్పుడో సేనానులము. ఇప్పుడు రాజుకొలువులో లేము. కొలువులోనున్న సేనానులకు మాత్రమే యీ నిబంధనకలదు. సభ్యుడు-ఆ నిబంధన యెప్పుడు నున్నది. బద్దన్నా! నీవు యుద్ధము చేసెదవా? బద్దన్న-నే నతనితో చేయను. సభ్యుడు-నీ యిష్టము. ఐనను నెందుచేత నని యడుగవచ్చునా? బద్దన్న-అడుగవచ్చును. నాగయ్యనే యడుగవచ్చును. నాగయ్య-నాకు తెలియదు. సభ్యుడు-నీవు చేసిన దోషమునకు శిరశ్ఛేదము చేయవచ్చును కాని యా యధికారము గోశాలపరిషత్తునకు గలదు. మహారాజపర్యధిష్ఠిత ధనదపుర పరిషత్తునకు కలదు. నీవు మా గ్రామమునం దుండుటకు వీలులేదు. ఇచ్చటనుండి ప్రొద్దు గ్రుంకకముందు వెడలి

పోవలయును. నాగయ్య—ఇతడు గోశాలనుండి పారిపోయి వచ్చెను. ఈ యూరిపరిషత్తువారు తగిన భటుల నిచ్చి గోశాల పరిషత్తునకు పంపవలయును. సభ్యుడు—పంపవచ్చును. ఆ పంపుట యనునది నీతో యుద్ధము చేసినచో జరుగవలసినపని. అతడు యుద్ధము చేయుననుచున్నాడు. అట్టి సమయమున వానిని వదలి పెట్టుటయే యితర గ్రామపరిషత్తులు చేయును. నాగయ్య—అందుకనియే యుద్ధము చేయ ననుచున్నాను.

బద్దన్నకు కోపము వచ్చెను. ఇంకను బద్దన్నలో కోపము మిగిలెనా! ఏడాదినుండి కామక్రోధములతో ప్రసక్తి లేని బద్దన్నకు గడచిన రాత్రి తలచూపిన కామముతో పాటు, నేడు కోపమును తల చూపినట్లుండెను. బద్దన్న యిట్లనెను. "నేను నీతో యుద్ధ మందుకోసము చేయుననుటలేదు. నీతో యుద్ధముచేయుట నా శక్తికి మర్యాదానష్టము."

నాగయ్య—చూచితిరా! వాని పొగరు, వాడు పంచముడు. అట్లు మాటాడుచున్నాడు.

అప్పుడు మఱొక సభ్యుడు లేచి యిట్లనెను "అతడు పంచముడో మఱియెవ్వరో! అతడు బద్దన్న. నీతో కత్తి యుద్ధముచేయుట నిజముగా నతని శక్తికి మర్యాదానష్టము. ఇన్నాళ్లు బద్దన్న మా యూరిలోనున్నాడు. మే మెవడో కూలి వాడనుకొంటి" మనెను. తర్వాత సభ యెచ్చటి దచ్చట విడిచి పోయెను. తర్వాత రెండుదినములకు బాదమ్మ బద్దన్నలు కొత్పాక విడిచిపోయిరి. వారింకను నుండినను నచట నెవరు పొమ్మనెడివారు లేరు. కాని, యున్నచో బద్దన్న చేత కూలి యెవరు చేయించుకొందురు! బాదమ్మచేత వడ్లెవరు దంపించు

కొందురు. ఆ రెండుదినములు బద్దన్నవంక ప్రతివారు నాశ్చర్య పోయి చూచువారే యైరి.

నా రిద్దఱము వేంగికి పోవుటకు నిశ్చయించుకొంటిమి. దారిలో బద్దన్న యిట్లనెను. "బాదమ్మా! మీ కొట్టాపుక నిజముగా శూరుల గాదువు. గోశాలలో పుట్టుటకన్న మీ యూరిలో పుట్టుటయే యుత్తమ మైనది.

బాదమ్మ—గోశాల యెట్టిదో మనము పరీక్షించినామా! అచట పరిషత్తుయొక్క యెదుటనే పడలేదాయెను. బద్దన్న—కావచ్చును. ఆనాడు నా కీనాడున్న ధైర్యములేదు. ఒక చమత్కారము చూచితివా! ఈ యనుభవించుచున్నన్నినాళ్ళను ననుభవముమీద విరక్తి పుట్టదు. అనుభవము లేకున్నప్పుడు విరక్తి పుట్టును. ఏడాది మనము విరాగులముగా నుంటిమి. నా మనస్సున కొక విరక్తిభావము తోచినది. బాదమ్మ—మనస్సంతే. ఒకపని చేయుచుండును. ఆపని చేయకపోయినచో తోచదు. అది చేయుటయే న్యాయ మనిపించును. రెన్నాళ్ళనుండి యేపనియు లేక యుంటిని. చేతులు కోసికొన్నట్లుండెను. మొదటిలో కూలి చేయుట యేవగింపుగా నుండెను. మన కులమువారందఱు చేయునదియే. ఇప్పుడు కూలి మానివేయుట యెట్లాయని పించుచున్నది. బద్దన్న—అందాక నెందుకు! నిన్న మధ్యాహ్నమువఱకు నా మనస్సులో నేను నీకు వలపుకాడ నని, నీవు నావలపుకత్తెవని లేదు. ఇప్పుడు దారివెంట నడచుచుండగా దూరదూరముగ నడచుటగూడ కష్టముగానున్నది. బాదమ్మ—చాలుగాని, త్రిపురాంతకుడు మనల నాదరించు నందువా! బద్దన్న—మనకు త్రిపురాంతకునితో పనియేమి! ఏదో మన

కూలినాలి మనము చేసికొందము. బాదమ్మ—ఆ మాత్రము నకు వేంగిపోవుట యెందులకు? బద్దన్న—నీ యిష్టము.

వారు వేంగిపోయిరి. వేంగిలో త్రిపురాంతకుడు లేడు. ఆయన కాశీయాత్రకు పోయె నట, త్రిపురాంతకుని కొడుకు విష్ణువర్మ యిరువదియేండ్లవాడు, వ్యవహారములు చూచుకొను చుండెను. అతడు బద్దన్న నాదరించెను. పూర్వము బద్దన్న వేంగిలో నెలనాళ్ళున్నప్పుడు తండ్రి బద్దన్నకు చేసిన గౌరవ మెఱుంగును. సర్వదా యిప్పు డత డట్లే చేయుచుండెను. బద్దన్నను మామయనియు, బాదమ్మను అత్త యనియు పిలువ నారంభించెను.

ఒకనాడు బద్దన్న విష్ణువర్మతో నిట్లనెను. 'దొరా! నన్ను నీ వింత గౌరవముగా చూచుచుంటివి. మీ నాయనగా రున్నచో నప్పు డెట్లు చూచెడివారో నాకు తెలియదు.

వి—ఇప్పుడనగా? బ—ఇప్పుడనగా, నా బాదమ్మ నా భార్యకాదు. మేము గోశాలలో నున్నచో నాతల తీసెడివారు. కొప్పాకనుండి మమ్ము వెడలగొట్టిరి. ఇచ్చటికి వచ్చితిమి. నే నిచ్చట నున్నానని మీ యూరిపరిషత్తునకు తెలిసినచో, నన్ని యూరినుండి వెడలగొట్టుదురు. వి—ఈ యూరి పరిషత్తా! పరి షత్తట్లు చేసినచో, నీ యూరిపరిషత్తును బ్రతుకనీయను. బద్దన్న—మీకు చిన్నతనము, తెలియదు. ఉన్ననిన్నాళ్లుందును. వి—ఉన్ననిన్నాళ్ళేమిటి? మా నాయనగారివలెనా? నీదగ్గర సంతటి కత్తివిద్య నేర్చికొని చివరకు నీవంక చూడ లేదు. నేను రెండు మూడుసార్లు నీమాట తెచ్చితిని. ఎచ్చట నున్నాడో నాకు తెలియదని, ఘూర్జరుల నింకొక యుద్ధమువచ్చినచో బైటకు

వచ్చునని, యిట్టి సమాధానములు చెప్పినాడు. బద్దన్న—మీ నాయనగారికి నామీదకోపము. ఆయన గొప్ప ప్రతిభావంతుడు. సర్వాంధ్రరాజ్యము తనచేతిక్రిందికి తీసికొంద మనుకొన్నాడు. నేను గొంకరాజునకు సామంతునుగా మాత్రమే యుండునట్లు వాగ్దానము తీసికొంటిని. అందుచేత నామీద కోపము. వి—అట్లనా! బ—నమ్మటంటివా! వి—ఏమియు లేదు. బ—చెప్పవయ్యా రాచబిడ్డా! నీకుగూడ నట్టియూహ యుండెనా! వి—చేసిపెట్టు దువా! బ—బాబూ! ఆ గొంకిరాజునకు నే నెవడనో తెలియును. నా శరీరములోని యీ నెత్తురు బానిసనెత్తురు. బానిసభావము నాజాతి నెత్తురుతోపాటు, నా నెత్తురులోకూడ నిండియున్నది. ఆవిక్రమచోళుడు నాకు చక్రవర్తి యని, గొంకరాజు మహారాజని నా నెత్తురులో నేను స్రవపోవుచున్నప్పుడుకూడ నా భావమే మేల్కొని యుండెను. నేనేమిచేయుదును! నీతండ్రి కోరికకు నీకోరికకు నాయొడలికండలు కోసియిమ్మనుడు, ఇత్తును. కాని మహారాజుభావముతో వైరుధ్యము రారాదు నీవు నన్ను క్షమించవలయును.

వి—మామా! నీయిష్టము. నే నేమి చేయుదును! నీవు నేర్పినవిద్య నాతండ్రి నాకు నేర్పలేదు నీవు వచ్చితివని సంతోషించితిని. నీవద్ద నేర్చుకొంద మనుకొంటిని. నాతండ్రికి నీ వన్నచో నెంతగౌరవమో, నాకిప్పుడు తెలిసినది. నీ విజయవాటము నీకీయలే దని, నిన్ను పిలిపించి కొండ యెక్కించలేదని నాతండ్రి కృతఘ్ను డనుకొంటిని. నీయెడల నా తండ్రికి కలిగిన కృతజ్ఞత యీ యల్పవిషయములలో లేక జీవితపరమార్గమైన మహావిషయములలో లగ్నమైనది. నీవు చెప్పిన విద్యయే నాకు

చెప్పలేదు. నేను గొంకరాజున కెదురుతిరిగినచో, నీ కాయన యిచ్చిన వాగ్దానము నాద్వారా చెడు నని యట్లు చేయలేను. మామా! ఆ గొంకరాజునందు నీ కెంతు కంతటి భక్తి. ఆ సంబయ్యను చేతకానివానిని సైన్యాధిపతిగా పెట్టుకొనుటకన్న నిన్ను పెట్టుకొనరాదా! హయసాలులను నిర్జించరానా! వారి రాజ్య మాక్రమించుకొనరాదా? కళింగులను గెలువగాదా! ఆంధ్రసామ్రాజ్యమహాప్రతిభ విష్ణువర్ధన మహారాజుతో వెనుకపట్టెను. కులోత్తుంగచోడదేవునంతటివాడే తెల్గుదేశము వంక చూడలేదు. నీవంటివా డుండగా నిట్లు దేశమును చేసి కొనుచున్న గొంకరాజుదే వివేకమంతయును.

బాదమ్మ బద్దన్నలు వేంగిలో నాల్గుమాసము లుండిరి. మఱియొకనెలలో త్రిపురాంతకదేవుడు వచ్చు నని తెలిసెను.

## ౨౩

త్రిపురాంతక దేవుడు మఱి పదిదినములకు కాశినుండి తిరిగివచ్చి వేంగికి చేరునని వార్త యానాడు వచ్చెను. ఆనాడే గొంకభూపతివద్దనుండి పదిమంది రాజభటులు వచ్చిరి. ఒక యాజ్ఞాపత్రము విష్ణుశర్మ కిచ్చిరి. అది యిది. 'మా సామంతుడైన త్రిపురాంతకదేవుని కుమారుడు చిరంజీవి విష్ణుశర్మ నాశీర్వదించి మహారాజు గొంకయ్య వ్రాసిన యాజ్ఞాపత్రము. బద్దన్న యనువాడు గొప్ప యధర్మకార్యము చేసి మీ యాస్థానములో నున్నాడట. అతడు శిక్షను తప్పించుకొని తిరుగుచున్నాడు. మీనాయనగారు కాశికి వెళ్ళిరని తెలియుట చేత నీకు వ్రాయుచున్నాము. వెంటనే యా బద్దన్నను రాజభటుల కధీనముచేసి పంపవలసినది. (రాజముద్ర)

ఈ యుత్తరము విష్ణుశర్మ చూచినంతనే మండిపడెను. రాజభటులను తిరస్కరించెను. రాజభటులు కుబ్జవాడని యూరకుండిరి. విష్ణుశర్మ బద్దన్నను పంపించుటకు వీలులేదనెను. మహారాజును స్వతంత్రుని జేసిన బద్దన్నను శిక్షించుటకు మహారాజునకు సిగ్గులేదా యనెను. రాజభటు లేమందురు? ఊరకుండిరి. కాని ప్రభూ! ఇది మహారాజు నాజ్ఞ అని మాత్రమనిరి.

తరువాత బద్దన్నయు, విష్ణుశర్మయు మాటాడుకొనిరి. బద్దన్న యిట్లనెను. 'బాబూ! యిది మహారాజు నాజ్ఞ. మీకు కుబ్జతనము. మీరు కాదన్నచో వచ్చెడు నాపద నాయన గారిది. వా రున్నచో నన్ను తప్పక పంపించెడివారు.

విష్ణుశర్మ—పంపించరు. ఎందుకు పంపింతురు? ఇది వఱ కేపనినిచేయుటకు నీ వభ్యంతర పెట్టితివో యిప్పు డా యభ్యంతరము లేదు. గొంకరాజుతో యుద్ధము చేసెదవు. నీవు మాకు సేనానాయకుడవు కమ్ము. బద్దన్న—బాబూ! పూర్వము నే నంత సైన్యమును సమకూర్చితి ననగా, నది సర్వాంధ్ర దేశమున క్లిష్టమైన పని. లోకదృష్ట్యా నే నిప్పు డొక యధర్మ కార్యముచేసి దానికొఱకు మీరు యుద్ధము చేయుడనగా నెవరు చేయుదురు?

విష్ణుశర్మ—ఆ సంగతి నీ కెందుకు? సైన్యమును నేను సమకూర్చెదను. నీవు సైన్యములను నడుపుము. బ—బాబూ! తెలుఁగుదేశ మెంతదేశము. ఈ దేశములో మనము మనము చీలియున్నచో, నీ చిన్నచిన్న రాజ్యములను అటు కళింగులుగాని, హోయిసాలులుగాని, పశ్చిమచళుక్యులు గాని ముక్కలుగా వసులవచ్చును. వి—నీతో మాటాడుట నాకు చేతనగునని కాదు,

నీకే యిష్టమైనచో వెళ్ళెదువుగాని, నాయనగారిని రానిమ్ము. బ—నా కాతిథ్య మిచ్చినది నీవు. నేను సెలవుతీసికొనునది నీవద్ద. నేను వచ్చితి నని తెలియదు. నేను వెళ్ళితి నని తెలియదు. నాయనగారికిని దీనికిని సంబంధములేకుండ చేయుము. వి—నేను నిన్ను పోనీయను. ప—ఇప్పటికి నిదేమాటయా?

ఆ నాడు సాయంకాలము విష్ణుశర్మ యంగీకృతిలేకుండ బద్దన్న రాజభటుల వెంటబోయెను. పోవుచుండగా విష్ణుశర్మ యిట్లనుచుండెను. 'ఇది మహారాజునకు శుభముకాదు. ఆంధ్ర దేశమునకు క్షేమముకాదు. ఏ మహావీరుడు చళుక్యుల రెండు వేల గుఱ్ఱములను నఱకెనో, వేయి యేనుగులను నుగుపెంటలు చేసెనో, యెవని నీతివలన గొంకరాజు పశ్చిమచళుక్యులకు బందీ కాలేదో, ఆ మహావీరుని శిక్షించి, తలతీసి, రాజేమిబాగు పడునో నేను చూచెదను.

బద్దన్న ధవదపురముచేరెను. బద్దన్న చేతులకు సంకెలలువేసిరి. రాజద్వారములోనుండి బద్దన్న కోటలోనికి ప్రవేశించుచుండెను. ఎదురుగా మహారాజును, నంబయ్య గారును, నాగయ్యయు, నన్నయ్యయు వచ్చుచుండిరి. నన్నయ్య బద్దన్నను చూచెను. బంధితుడైన బద్దన్నను చూచినంతనే నన్నయ్య కేమియు తెలియులేదు. బద్దన్న యేమితప్పుజేసెను. నన్నయ్య వెంటనే మహారాజు వద్దకుపోయి మహారాజుతో నిట్లనెను. 'ప్రభూ! అతడు బద్దన్న. గొం—ఇతడేనా బద్దన్న? ప్రభూ, బద్దన్న యేమితప్పుచేసెనో యడుగుటకు నాకధికారము లేదు. కాని బద్దన్నచేతికి సంకెలలువేసి యగౌరవపరచదగిన వాడుకాడు. అతనికి చేను పూటయుందును. ప్రభువునెదుట

నెప్పుడు ప్రత్యక్షపెట్టమన్న నప్పుడు పెట్టగలను. దానికి నాతల కుదువ. ప్రభువు లతని సంకెలలు తీసివేయించవలయును.

మహారాజు నన్నయ్యావంక నాశ్చర్యపడి చూచెను. రాజభటులతో సంకెలలు వదలించుడని చెప్పెను. నాగయ్యా నంబయ్యాల మొగములలో నెత్తురు కూడుకట్టెను. నన్నయ్యా బద్దన్నను తనయింటికి తీసికొని పోదునవెను. నంబయ్యాగారు వీలులేదనెను. బాదమ్మ యింతసేపు రాజభటుల వెనుక వచ్చుచుండెను. ఆమెను నన్నయ్యాగా రప్పుడు చూచెను. నన్నయ్యా హఠాత్తుగా రాజువద్ద సెలవుతీసికొని యింటికి పోవుచుండెను. బాదమ్మ నన్నయ్యా వెంట పోయెను.

బద్దన్నమీది యభియోగము మరునాడని నంబయ్యా. నాలుదినములు పోవలయునని నన్నయ్యా. నన్నయ్యా యీ లోపుగా మందయ్యాకు, గంగచోడునకు, చంద్రగౌడునకు కబురంపించెను. వారు మూనాళ్ళలో వచ్చిరి. నాల్గవదినమున త్రిపురాంతకుడును, విష్ణుశర్మయు వచ్చిరి. వీరందరును మహారాజు సభలో నుండి బద్దన్నదోషము విమర్శింప బడువేళ వచ్చిరి. వీరి యందరి రాకతో సభలో కలవరము బయలుదేరెను. మహారాజు తత్పూర్వము త్రిపురాంతకదేవుడు, తన కొల్లునకు వచ్చుట యెఱుగడు. అందరును కూర్చుండు వేళకు నావు యిదుగడియలు పట్టెను.

రాజభటుడు—దోషీ, నీపేరేమి? బ—బద్దన్న. రాజభ—నీ యూరేది? బ—గోశాల. రా—నీవు తిప్పన్న యను వాని భార్యను లేవదీసికొని పోయితివా, లేదా? బ—లేవదీసికొని

పోయితిని. రాజభటుడు—గోశాల పరిషత్తు నిన్ను శిక్షించుటకు పిలువగా పారిపోయితివా లేదా? బ—పారిపోయితిని.

అంత రాజభటుడు తానుపోయి యొకవంక నిలుచుండెను. మహారాజు నంబయ్యగారివంక చూచెను. నంబయ్య పండిత పరిషత్తుతో నిట్లనెను. "అయ్యా! దోషయును బంధితుడొప్పుకొన్నాడు. ఇంక తమరు వానిని దోషియని నిర్ధారణ చేయుటయు శిక్షించుటయు మిగిలెను." పరిషత్తు 'గోశాలవాసి, యతనిదోషము నిర్ధారణ చేయువాడు, సభలో నుండెనా' యని యడిగెను. నాగయ్య తాను - గోశాలవాసి నని తానతని దోషము నెరుగుదునని చెప్పెను.

అప్పుడు నన్నయ్య లేచి నిలుచుండెను. ఇట్లనెను. "మహారాజునకు పరిషత్తునకు నమస్కారములు. నాగయ్య సాక్షిగనుక యభియోగము తెచ్చిన వారెవరో నిర్ణయించకుండ శిక్షించుటకు వీలులేదు.

నంబయ్య—అభియోగము తెచ్చినది నేను. నన్నయ్య—చిత్తము. కాని తమరొక్కటి యాదరించవలెను. తమరు మహాసైన్యాధిపతులు. బద్దన్నయు సేనాని. నంబయ్య—బద్దన్నను సేనానిగా నెవరు నిర్ణయించిరి. త్రిపురాంతకదేవుడు—బద్దన్న నా సేనాని నా సర్వసైన్యమున కతడధిపతి. నన్నయ్య—ఒక సేనాని మీద మఱియొక సేనాని తనకు జోక్యము లేని యభియోగము తెచ్చినచో నతనితో కత్తియుద్ధము చేయవలయును. ఆ యుద్ధములో దోషి చనిపోయినచో సరే. చనిపోనిచో నప్పుడు పరిషత్తు శిక్షించును. నంబయ్య—నేను పురాధిపతిని. వట్టి సేనానితో యుద్ధము చేయను. విష్ణు—బద్దన్నయు పురాధిపతియే.

అతడు విజయవాటపురాధిపతి. త్రిపు—ఔను. అతనిని పురాధిపతిని చేసియే నేనతనిని సేనానిగా నిర్ణయించితిని. నం—నేనుత్తమ చతుర్థకులజుడను. అతడు పంచముఁడు పరిషదధ్యక్షుడు—ఈ యుద్ధమునకు వర్ణభేద మడ్డురాదు. బ—మహాప్రభూ! పారిషదులారా! మీ రందరు, నా యందు చాల ప్రేమ చూపించుచుండిరి. నేను నంబయ్యగారితో కత్తియుద్ధము చేయగలవాడనా? పైగా నా కిప్పు డిరువదియైదేండ్లు నాకు బుద్ధి తెలిసినప్పటినుండియు, అనగా పదునేనేండ్ల నుండియు శ్రీకులోత్తుంగచోడదేవులు నా ప్రాణముమీఁద కూర్చున్న చక్రవర్తి. శ్రీ గొంకభూపతి నా సర్వస్వము మీఁద కూర్చున్న మహారాజు. చిన్ననాడు నంబయ్యగారు నేను మనసులో నవధిగా పెట్టికొన్న యోధుడు. ఆ యోధునితో నే యుద్ధము చేయుదునా? నాగ—నంబయ్యగారు నీకు చిన్ననాటి గౌరవపాత్రుడు. నేడు కాదనియే కదా నీ యుద్దేశ్యము. నీ విప్పుడు యుద్ధము చేసినచో తప్పులేదు. మహారాజు—నీవు నంబయ్యగారితో యుద్ధము చేయగల్గుదువనియేనా? విష్ణు—మహాప్రభూ, కల్గుననియా? జయించగల్గునని. తలచినచో తల నాలుగు ముక్కలుగా చేయగల్గునని. నంబయ్యగారే కాదు; త్రిశూలముచేత గొని పరమేశ్వరుఁడు వచ్చినచో బద్దన్న గెలువగలుగును.”

మహారాజునకు కోపము వచ్చెను. త్రిపురాంతకుడు కుమారుని కోపపడి సభలోనుండి పంపించెను. విష్ణువర్మ మహారాజసభ కయోగ్యమైన కోపజనితావయవవిచాలనముతో వెడలిపోయెను.

మహారాజునకు కోపము తీరలేదు. బద్దన్న కింత యండ యున్నదని, తన సామంతులు తనసేనానులు బద్దన్నపక్షీయు లింతమంది యుండిరని మహా జెరుగడు. ఈ బద్దన్న యంతటి శూరుడా? ఈత డెవరు? బద్దన్నను మహారాజొక్కసారియే చూచెను. రామహేంద్రవరములో వీరబల్లాలునితో బద్దన్న మాటాడినపుడు. మహారాజున కప్పుడు బద్దన్నమీద కొంత స్మృతి లోనికి వచ్చెను. మహారాజునకు నంబయ్యగారి యెడల నభిమానము తక్కువది కాదు. సభ యంతయు గగ్గోలుగా నుండెను. మహారాజున కేమియు తోచలేదు. హఠాత్తుగా మహారాజొక నిర్ణయమునకు వచ్చి యిట్లనెను. "రేపు సాయంకాలము జాముప్రొద్దుండగా నీ యుద్ధము నిర్ణయించితిమి, బద్దన్నను నన్నయ్యగారు తీసికొని పోవచ్చును. రేపా వేళకు నన్నయ్యగారు బద్దన్నను ప్రత్యక్షపఱుపవలెను."

మహారాజు సభనుండి లేచెను. సభ వెడలిపోయెను.

నన్నయ్య బద్దన్నను "నీవు కత్తిపుచ్చుకొని రెండేండ్లు లు నదా? కొంచె మభ్యాసముచేయుము" అని తన కత్తి డాలును తెచ్చి యారాత్రియంతయు మఱునాటి ప్రొద్దుటనంతయు బలవంతముచేసెను. బద్దన్న పుచ్చుకొనలేదు. మఱియు నొత్తిడి చేయగా "నా కభ్యాసమెందుకు, బాబూ" యనెను. బాదమ్మ నన్నయ్యతో "బద్దన్న యెట్లును చచ్చిపోవును. నేను గూడ చచ్చిపోయెదను" అనెను. నన్నయ్య "బద్దన్న యెందుకు చచ్చిపోవును. నంబయ్య యంతమాత్రము కత్తికాడు కాడా" యని యోదార్చెను.

రెండుజాములయెండ మండిపోవుచుండెను. పశుపక్ష్యాదులు నిలువనీడలేక అల్లాడుచుండెను. వాయువులు మొదలు పెట్టుటలో దివ్వున మొదలుపెట్టి వీధిగోడల యిరుకుల వెంట జట్టున దూసికొని యిండ్లకు కప్పుగావేసిన పెంకుల క్రింద కీచక రంధ్రములలో విస్ఫాదనము మిక్కిలిగాచేసికొని, కన్నులుమూసికొని పరువెత్తిన యడవిగుఱ్ఱపుదండువలె నుండెను. ఎచ్చటచ్చటికి నాలుగట్టుట, పడియట్టుట, పండబెట్టుట పనిగా నీతిమాలిన శత్రుసైన్యమువలె నా వాయువు విజృంభించెను. ఈ వాయువునకు తన పెఱభేదములు పోయినవి. మును పీ గాలులే చల్లగా వచ్చి యీ వృక్షసముదాయమును పెంచెను. ఈ లేత మొక్కలు తనుకోమలపత్రాననబిలములతో నానాటి యివము గొన్న యీగాలులను నోరుతెఱచుకొని ప్రతీక్షించెను. ఆ కంతముగా త్రావెను. నేడా గాలులే వానినోట దుమ్ముకొట్టెను. ఈ గాలులెంతకు చాలవు! సర్వజగన్మాతయైన భూదేవియొక్క సస్యకంచుక మూడ్చి ఆమ్మ పగిలించిన యీ గాలులు.

సాయంతమున జాము ప్రొద్దున్నప్పటి కెండ తగ్గలేదు. క్రొత్తగా వడగాలులు సాగెను. కాని సంబయ్య బద్దన్నలు యుద్ధముచేయు ప్రదేశము కోటలోపలి గరిడీశాలయు. అచ్చట నేనుగంతయెత్తున పందిరి వేయబడెను. ఆ చుట్టువ జనము కూర్చుండుటకు సదుపాయము లున్నవి. ప్రాగ్దిశాభిముఖముగా పశ్చిమదిశయందు మహారాజుగారి సింహాసన మేర్పడెను. ఆ సింహాసనము వెనుక మేడమీఁద తెరలవెనుక నంతఃపుర స్త్రీలు కూర్చుండిచూచుటకు వీలుగానుండెను. రాజుగారికి కుడి వంక పరిషత్సభ్యులకు నెడమవంక సేనానులు, మంత్రులు,

రాజోద్యోగులు కూర్చుండుటకు నేర్పాటులు చేయబడెను. అంతఅును వచ్చి కూర్చుండిరి. ఊరిలోని జనము గుంపులు గుంపులుగా వచ్చుచుండిరి. వెండిబెత్తాలవారు జయీవిజయీ భవలు చదివిరి. అప్పు డొక శంఖధ్వానము చేయబడెను. దానితో మంత్రుల నడిమినుండి నంబయ్యగారును, దక్షిణ దిశయందుకూర్చున్న త్రిపురాంతకదేవుని వద్దనుండి బద్దన్నయు బయలుదేరిరి నంబయ్య మహాయుద్ధమునకుపోవు యోధునివలె వేషము వేసికొనియుండెను. బద్దన్నకు తాను కట్టినయుత్తరీయ మును, దోవతియు తక్క వేఱులేవు. ముందుకువచ్చిన తర్వాత దోవతి విరిచికట్ట మన నన్నయ్య చెప్పగా బద్దన్న కట్టెను. నంబయ్య సర్వావయవములయందు కవచముతాల్చెను. బద్దన్న నిష్కవచుడు.

బద్దన్నను చూచినంతనే నంబయ్యకు వాని నొకకత్తి వ్రేటున నఱుకగల ననిపించెను. ఇంతలో కరవాలభైరవుని సంగతి జ్ఞాపకము వచ్చెను. తాను ధరించిన కవచమునుగూర్చి తాను పొందినలజ్జ యంతలో విస్మృతిపడెను.

నంబయ్యకు కత్తి యందిచ్చువాడు, శ్రమపడినపుడు త్రేఅపికొలది శ్రమాపనోదనము చేయువాడు నాగయ్య, బద్దన్నకు నన్నయ్య యట్టివాడుగా కనిపించెను. త్రిపురాంత కుడు నట్టివాడుగనే కనిపించెను. విష్ణుశర్మయు నట్టివాడుగనే కనిపించెను. గంగచోడుడు నట్టివాడుగనే కనిపించెను. చంద్ర గౌడుడు నట్టివాడుగనే కనిపించెను, మంచయ్యకూడ నట్టివాడా యనిపించెను. సభలో నెల్లవారికిని బద్దన్నయందే యభి మానమున్నట్లు కనిపించెను. రాజ నభిమానము ద్విధావిభక్త

మయ్యెను. అంతఃపుర స్త్రీలయొక్క మెచ్చుదల యంతయు బద్దన్నవంక నుండెను, విజయవాంఛ మాత్రము నంబయ్యవంక నుండెను.

యుద్ధ మారంభ మయ్యెను. నంబయ్య ముందు దూకి పోలేదు. బద్దన్న కదలనేలేదు. బద్దన్న యున్నచోటనే యుండును. నంబయ్య మీదికివచ్చినప్పుడుగాని కత్తియెత్తడు. కొంత వేళకు నంబయ్య కుత్సాహము కలిగెను. బద్దన్నమీదికి దూకి పోజొచ్చెను. ఏ దెబ్బతోడను బద్దన్నయొడ లంటుకొనలేదు. నంబయ్యకు విసుగుపుట్టెను. బద్దన్నతో నిట్లనెను. 'ఏమిరా మహావీరుడనటగదా! మన్నుతిన్న పామువలె కదలవేమి! పరిషత్తుయొక్క, మహారాజుయొక్క దండన పొంది కాకులు గ్రద్దలు పీకికొని తిను కళేబరము చేసికొనకుము. వీరుని చావు చావుము" అని బద్దన్న మీదికి దూకెను. బద్దన్న పదిదినముల నుండి తన్ను తాను చంపుకొనెను. ఈ మాటతో బద్దన్నకు మెలకువవచ్చెను. మెలకువవచ్చిన బద్దన్న కత్తినెంట నంబయ్య చేతినెత్తురు బైటికివచ్చెను. జనమందరు 'అద్ధా' యని ప్రశంసించిరి. వెండిబెత్తాలవారు బెత్తాలుపైకెత్తిరి. కోటలో ప్రేక్షకులైన జనములట్లఱవరాను. తరువాత బద్దన్న విజృంభించెను. బద్దన్న చెంగున మహారాజు ముందరికి దూకెను. దూకి యిట్లనెను, "మహాప్రభూ, బద్దన్నయెవరో తమరెఱుగరు. మీకు నన్ను తెలిసికొని చనిపోయెదను" అని మఱల నంబయ్య కభిముఖముగా తిరిగెను. నంబయ్య లాఘవము, నంబయ్యతీర్పు, నంబయ్య కత్తివిద్య యతనిముందర నేమి పనికివచ్చును! బద్దన్న నంబయ్య కవచమును ముక్కలు ముక్కలుగా కొట్టెను.

బద్దన్న విద్య తెలిసిన నన్నయ్య ముప్పది నెంబది ఖడ్గములను సిద్ధముగా నుంచెను. బద్దన్న కత్తి మొక్కపోయిన విసరి పారవేయును. నన్నయ్య వేరే ఖడ్గమిచ్చును. నంబయ్య గారియొడల కవచములేదు. ఒడల నెక్కువ గాయములు లేవు. చిన్ని చిన్ని గాయములే కాని గాఢమైన వ్రణ మొక్కటియు లేదు. మహారాజున కిట్లనిపించెను. "వీడు వందమంది నంబయ్యలను బాతినపెట్టినఅకును. వీడు నా సేనానాయకుడు కాలేదే. వాని సర్వస్వముమీద నేను మహారాజు నట. ఈ యదృష్టము సే నెఱుగ లేక పోయితి"నని.

బద్దన్న నంబయ్యగారి చేతిలోని కత్తి యెగురకొట్టెను. నాగయ్య నంబయ్య కింకొకకత్తి నందిచ్చెను. బద్దన్న దాని నెగురగొట్టును. నాగయ్య పాతిక ఖడ్గములను తెప్పించెను. బద్దన్న పాతికఖడ్గములను నడిమికి నఱికెను. చివరకు నంబయ్య చేతిలో నొక్కకత్తియే యుండెను. అందరకు భయము వేసెను. అతడే నిముసములో నంబయ్యను నఱకునో యని. బద్దన్న మాత్రము నంబయ్యను చంపునట్లు కపించలేదు. మహారాజి ట్లనుకొనెను. "నంబయ్య కాక యింకొక్కడైనచో నీపాటికి యుద్ధము మానివేసెడివాడు"అని. కాని నంబయ్యకు కోపము పెరుగుచుండెను. తన ప్రాణములు ప్రతినిముసమును బద్దన్న రక్షించుచున్నాడని తెలియలేదు. ఏదియో యెడుపుచూచి బద్దన్నను చంపవలయు ననియే యాలోచించుచుండెను. నంబయ్య కన్నులలోనున్న యర్థము బద్దన్న చదువుచుండెను. బద్దన్న యిట్లనెను. "దొరా! నీ చేతిలో నేను చనిపోయినచో నాకు మర్యాదానష్టము లేదు. నా చేతిలో నీవు చనిపోయి

నచో నీవు మహాసైన్యాధిపతివి, అది తప్పు' అని మఱియొకరీతి యుద్ధ మారంభించెను.

బద్దన్న యేయనుగువేసినను కత్తి యెట్లాడుకొన్నను నంబయ్య కత్తికి బద్దన్న శరీరము విహారభూమి యగునట్లుండెను. అట్లు కొంతసేపు జరిగిన తర్వాత బద్దన్న విష్ణుశర్మవంక తిరిగి యిట్లనెను. 'బాబూ చూచితివా. ఇవియన్నియు తప్పులు. జ్ఞాపకముంచుకొనుము.' త్రిపురాంతకదేవుడు "బద్దన్నా! నీవు చనిపోకముందు నిన్నొకసారి కౌగిలించుకొనవలెను" అని. అంతలో నంబయ్యచేతిలోని కత్తి యొగిరిపోయెను. బద్దన్నను వచ్చి త్రిపురాంతకుడు కౌగిలించుకొనెను. నంబయ్య ప్రకృతి బద్దన్న తెలిసికొనెను. కౌగిలివదలి యశ్రద్ధగానున్నట్లు నటించెను. నంబయ్య మఱల కత్తిపుచ్చుకొనుటతోడనే బద్దన్న మీదికి దూకెను. ఇతడెదురై యేదో ధ్యాస నున్నట్లు చూపెను. నంబయ్య కత్తి బద్దన్న గుండెలో దూరెను. బద్దన్న గుండె చేతితోపట్టుకొని నంబయ్య కత్తిపిడిలోనికి తనకత్తి పోనిచ్చిదూసెను. నంబయ్యయొక్క వైదు వ్రేళ్లును ముక్కలై క్రిందపడెను.

ఒక్కపెట్టు వేయికంఠములనుండి హాహాకారములు బయలుదేరెను. బాదమ్మ యెచ్చటినుండి వచ్చెనో, తన కత్తి గుండెలో క్రుమ్ముకొని బద్దన్నమీద పడెను. జనమందరును తెఱపిచేయబడిరి. సేనానులు, సామంతులు, పారిషదులు చుట్టును చేరిరి. మహారాజు ఆ యిద్దరివద్ద నిలుచుండెను. బద్దన్నకు స్మృతిపోయినది. బాదమ్మ చనిపోవుచు మహారాజుతో నిట్లనును. "ప్రభూ! వందవన్గులకు కత్తి పుచ్చుకొని

యెదురు నిల్వఁదగినవాని యెదుట నొక మేకపిల్లను పెట్టితివి. ఆ మేకపిల్లకు వ్రేళ్ళు తెగిపోయినవి. ఆ మొటికజంతు వెందుకు పనికివచ్చును? మహాసేనాధిపతిని పోగొట్టికొంటివి. నిన్ను చక్రవర్తిని చేసినవానిని పోగొట్టుకొంటివి. నిన్ను మహారాజునుగా నిల్పినవానిని చంపించితివి. అతఁడు జారుఁడుగాఁడు; నేను జారిణినికాను. మా ప్రేమకు మీ సూత్రములు పట్టవు మాది లింగజ్ఞానాతీతమైన సంబంధము."







## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA123B152 |
| పుస్తకం పేరు | బద్దన్న సేనాని |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 255 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Pravallika |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good. |